# దైవ సాక్షాత్కారము







గ్రంథకర్త :

ఏ. టి. చంద్రశేఖర్



దైవం శరణం గచ్ఛామి

ధర్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి

# విషయసూచిక

# రచన, రచయిత

1 ఈ రచనకు నేనే కారణమా? ఈ రచనకు నేనే కర్తనా? కాదు. నా రచనపై ఏ ఇతర గ్రంథాల ప్రభావములేదు. ఈ ప్రపంచంలోని ఏ సంఘటనలు ఏ పరిస్థితులు నన్ను రచయితను చెయ్యలేదు. తల్లి పిల్ల వానికి మాటలు నేర్పినట్లు, దైవము నాకు ప్రస్తుత వర్తమాన స్థితిగతులను కొద్దికొద్దిగా అర్థం చేయిస్తూ, రచనకు కావలసిన మానసిక స్థితికి కొనితెచ్చారు. 1981 జూన్‌లో మాతృమూర్తి మరణించటంతో, ఒక రచన చెయ్యటానికి అవసరమైన మానసిక శిక్షణను దైవము పూర్తిచేశారు.

2 ఒక రచన చేయించటానికి, ప్రభువు ఒసంగిన శిక్షణ వలన, నేను ఈ గ్రంథానికి కర్తనయ్యాను. లక్ష్యాలు ఎన్నెన్నో. ఎన్నెన్నో లక్ష్యాలను ఎందరెందరి చేతనో దైవము సాధ్యపరుస్తూ ఉన్నారు. నాకు ఉన్న మేధాశక్తి బహుస్వల్పము. జ్ఞాపకశక్తి ఉండీలేనట్లు. ఇందుగల మొదటిభాగం వేటి అధ్యయనం చేసు వ్రాసినది కాదు.

3 దైవము లక్ష్యసాధన కోసం ఒక సాధారణ వ్యక్తిని తీర్చిదిద్దారు. నా మనస్సునుంచి భావస్పందనను కల్గిస్తుండటంచే, ఇది ఈ తీరున రూపుదిద్దుకొంది. ఇందులోని ప్రతి వాక్యము, పేరా, ప్రతి పేజి దైవ స్ఫురణ అని నేనటం లేదు. లక్ష్యసాధనకు అవసరమైన భావము దైవానుగ్రహం.

4 మానవ శ్రేయస్సు కోసం దైవము ప్రేరణ ఇవ్వగా, మానవుల కోసం రూపొందిన భావమిది. నేను అల్పుడను. గతంలో నాకు తెలిసింది సామాన్యునికి తెల్సినంత, అయినా శాసించ కలిగాను. ఒక వ్యక్తిని శాసించాలన్నా ఈనాడు కష్టము. నేను శాసించింది ఒక దేశ ప్రజల సమస్యకు పరిమితమైనదికూడా కాదు. ప్రపంచానికి సంబంధించిన మత భావనలపై, వేల సంవత్సరాలుగా మానవ మస్తిష్కంలో స్థిరస్థానాన్ని సంపాదించిన దైవవాక్కు అనెడి గ్రంథాలపై, నేను ప్రకటించిన పోరాటమిది. మత భావనలతో బాటు, మానవాళి మస్తిష్కంలోని భావనలను ఎదుర్కొన్నాను. ఇది సాహసోపేతమైన చర్యయే.

5 నాబోటివాడు మతగ్రంథాల స్థానాన్ని ఎదుర్కొగలడా? నా జీవితం ఎంత? నా అనుభవం ఎంత? నా అవగాహన ఎంత? అయినా నేను ఎదుర్కొన్నాను. అంటే అది భావస్పందన. అది దైవ సహకారం.

6 నేను వివరించగల పరిధి అంటూ ఒకటి ఉంది. నాకు సాధ్యమయిన వివరణను మాత్రమే ఇవ్వగలిగాను.లక్ష్యసాధనకు ఎందరెందరో ఉన్నారు. ఒక లక్ష్యం యొక్క సంపూర్ణ సాధనకు అవసరమైనంత, నేను వివరిస్తున్నానని నేనటం లేదు. లక్ష్యము యొక్క సమిష్టి సాధనలో, నేనూ ఒక ఉపకరణాన్ని మాత్రమే. నాకు ఉన్న భావపరిధి బట్టి, నేను అందివ్వగల భావన పరిమితం. ఈ పరిమితం నుండి మిగతా ప్రజానీకం ప్రేరణ పొంది, ప్రగతికి ఉపక్రమించాల్సి ఉంటుంది.

7 ప్రపంచంలోని ప్రతి ఒక్కరిని దైవము ప్రేరేపించరు. ఒక్కరికి కొందరికి ఇచ్చే ప్రేరణ ద్వారా, మిగతా ప్రజలను ఆ ప్రేరణ దిశగా మరలిస్తారు. అందుకు సాధనం రచన. రచయితల యొక్క రచనలకు భావమే ప్రాణము. ఇందుండే రచనలు రూపుదిద్దుకొంటాయి. భావప్రసారం అవసరానుకూలంగా, గతంలోను నేడు లభిస్తూనే ఉంది. ఇట్టి అపూర్వత లభించిన వారిలో నేనూ ఒకడిని అయ్యాను.

8 ఈ ప్రపంచంలో కాదు. నా సమాజంలో కాదు, నా పరిసరాలనుండి కూడా నాకు ఉన్న స్థానం 'ఇదీ అంటూ' ఏదీలేదు. నేను అనేది నామ మాత్రం. కాని ఈ రచన రచయితగా ఒక స్థానాన్ని బహూకరించింది.

9 ప్రపంచవ్యాప్తంగా దేవుళ్ళపై, మతాలపై అపోహలు తొలగిపోవటం జరగాల్సి ఉంది. ఈ రచన ఏ మేరకు దానిని సాధించగలదో, రచన యొక్క అభిలాష ఏ మేరకు సాధ్యపడుతుందో, కాలం ఇచ్చే ఫలితాలు నిరూపిస్తాయి.

10 ఈ గ్రంథం ఎంతవరకు ఉపయుక్తము, ఎంతవరకు కాదు, అనెడి దానిపై నాకు ఎట్టి ఆందోళన లేదు, ఎట్టి ఆవేశము లేదు. మానవులకు అతీతమైన దేవుడు అదృశ్యరూపంలో ఉన్నారు. ఈ ప్రపంచ భవిష్యత్తు గూర్చి ఆ దైవము ఆలోచిస్తుంటారు. తమ ఆలోచనను ప్రత్యేకితమైన వ్యక్తులలో ప్రేరేపిస్తూ ఉంటారు. ఆ యదార్థత నాకు నిశ్చింతను అందిస్తుంది. ఏదైనా సాధించాలి, ఎలా అన్న ఆందోళన, నా జీవితంలో నాకు కలగదు. జరగవలసింది జరుగుతుందన్న ధీమా ఉంది. ఇందుకు కారణము దైవము. మన శ్రేయస్సును ఆకాంక్షించే దైవము మనందరికి ఉన్నారు. అదే నాకు తృప్తి, అదే నాకు ఆనందము.

# • పాపపుణ్యాలు

1) ఏది ధర్మం, ఏది అధర్మం - ఏది న్యాయం, ఏది అన్యాయం - ఏది సమంజసం, ఏది అసమంజసం - ఏది తప్పు, ఏది ఒప్పు అనేది. విభజన దృష్టినుండి పాపపుణ్యాలను ప్రవేశపెట్టారు. పురోహితవర్గం తమ స్వార్థం కొరకు పుణ్యకార్యాలంటూ మతాచారాలను ఏర్పరచారు. (2) నరకభీతి పాప భీతితో మానవులను అదుపు చేయాలని, పాపపుణ్యాల స్వర్గనరకాల భావనలను మతాలు కల్గించాయి. దుష్ట స్వభావాలచే దుర్గుణాలచే ఇతరులను వ్యథల పాల్జేయకుండా నిరోధించేందుకు, తనని తాను నియంత్రించుకునే సాధనంగా, పాపపుణ్యాల భావనను నమ్మించారు. (3) దైవ ప్రేమ భక్తి భావం పూజలు వంటివి దైవ సంబంధంగా పరిమితం చేసి, సంపాదనకు కోరికలకు అవినీతి, వంచన, అక్రమం, హింస పాటించదగ్గవిగా భావించ టంచే, దైవ విశ్వాసం, పాపపుణ్యాల విభజనను కాపాడలేకున్నది.

2) మానవ సమాజంలో అపార విజ్ఞానం ఉంది. తమకున్న విజ్ఞానంతో మంచి చెడులను నిర్ణయించుకోగల అవగాహన ఉంది. తమ సమాజం, తమ జీవితం అనుభవాన్ని ఆలోచనను ఇస్తోంది. ఇలాంటప్పుడు పాప పుణ్యాలు ఏవో ఏమిటో నిర్ణయించాల్సిన అవసరం దేవునికి లేదు. తమ మనుగడతో బాటు, తమ తోటివారి మనుగడకొరకు ఏర్పరచుకున్న పాప పుణ్యాలు దేవుడు ప్రవేశపెట్టినవి కావు.

3) పాపం పుణ్యం మానవుల కొరకు మానవులు ప్రవేశపెట్టుకున్నవి. తమని తాము నియంత్రించుకుందుకే పాపపుణ్యాలు. సంఘర్షణను నివారించి తోటివారితో సామరస్యం కొరకే పాపపుణ్యాలు. తన తప్పులవల్ల తనకే కాకుండా, తనపై ఆధారపడ్డవారికే కాకుండా, తన సమాజానికి హాని కల్గించకుండా, నిరోధించబడేందుకే పాపపుణ్యాలు. పాపంవల్ల ఇతరులచే చట్టాలచే శిక్షింపబడుతున్నారు. ఒకరు చేసే పాపం వారినే దుఃఖింప జేస్తుంది. వ్యక్తుల పాపపుణ్యాల ఖాతమెంతో లెక్కించాల్సిన అవసరం దేవునికి లేదు.

4) ఏ రోజున ఏ గంటలో ఒకరు ఏమేమి పాపాలు చేశారో, ఏవేవి పుణ్యాలు చేశారో, పాపాలెన్నో పుణ్యాలెన్నో ఏమి శిక్ష విధించాలో పుణ్యాలకేమి ఫలితాలనివ్వాలో ఈ లెక్కలన్ని ఒక పట్టాన తేలేనా ? ఒక్కని విషయంలోనే ఎంతో గందరగోళం ఉండగా వందల కోట్ల ప్రజల పాపపుణ్యాల విభజన సాధ్యమా? పాపులెవరో వారి పాపాలేమిటో, పుణ్యాత్ములెవరో వారి పుణ్యాలేమిటో, ఇలా పాపపుణ్యాలను పరిశీలిస్తుం డటం కన్నా, వేరే వివేకవంతమైన పనులు దేవునికో పరలోక సిబ్బందికో లేకున్నవా? కోట్లాది ప్రజానీకం యొక్క నీతిమాలిన చేష్టలను, పాపాలను కనిపెట్టుకు కూర్చుంటారా పరలోక సిబ్బంది ?

5 ఈ అనంతకాలంలో భూమిపై మనుగడ గడిపే మానవుని కాలం నీడిబుడగ వంటిది. ఈ లెక్కింపలేని కాలంలో జీవించే మనిషిపై పాపాల పేరుతో శిక్షించాల్సినది దేవునికి లేదు. ఒకని జీవిత చరిత్ర మరణంతో ముగుస్తుంది. మరణంతో ముగిసిపోయే జీవితంపై, మరణం తదుపరి శిక్షించాల్సిన కాఠిన్యం దేవునికి ఉండదు. పాపపుణ్యాల భావనకు ఈ సిరి సంపదలకు మానవ స్వభావాలకు అతీతము దేవుడు.

6 సత్క్రమ నడవడిక సద్భావం సద్గుణం దయ సహనం వంటివి

ఏప్పుడైనా అలవరచుకోవలసినవి కాని వాటి ఆచరణవల్ల పుణ్యంరాదు. సత్కార్యాలవే స్వర్గంరాదు. నీతి నిజాయితీగా జీవించటం ప్రతి ఒక్కని కర్తవ్యం. సంఘ జీవనంలో శాంతిసౌఖ్యాల కొరకు, తమ బ్రతుకుబాటలో ఎలాంటి కష్టనష్టాలు పీడించకుండా ఉండేందుకు, తమకోసం తాము పాటించాల్సిన విధులు అనేకం. మంచి జీవితమో మంచిజన్మో మోక్షమో కొరకు కాదు; బ్రతకాలంటే పాటించక తప్పదు.

7) తాము కోరుకున్న దానికన్నా ఎక్కువగా ఆహారధాన్యాలు కాయగూరలు పాలు నెయ్యి వస్త్ర ఇలా నిత్యావసర వస్తువులన్ని, ఎంతకాలం నుంచో అందరికీ అతి చౌకలో లభ్యమవుతున్నాయనుకోండి. ఏ ఒక్కరు వాటి కొరకు తపించరు. వాటికొరకు ఎలాంటి ఆందోళన ఉండదు. అవి లభ్యమవటాన్ని ఎవరూ అదృష్టంగా భావించరు.

8) పైవలా లభ్యపడకుండా అన్నింటికి కొరతలు ఏర్పడిన పరిస్థితులు ఉంటే. పైవి ఉపయోగించుకుందుకు పడే ఆందోళన నిరాశా నిస్పృహలలో కొందరికి సౌఖ్యం మరికొందరికి అసౌఖ్యము ఏర్పడటానికి గల కారణం, కర్మప్రభావమని పాపపుణ్యాల ఫలితాలని నమ్మిస్తుంటే, ఆ నమ్మకం అలా స్థిరపడుతుంది. తమ కోరికలను నెరవేర్చమని దేవుని వేడుకోవటము సహజమవుతుంది.

9) ప్రతిఒక్కరూ కమ్మనికలలు కంటారు. అవి రూపుదాల్చాలని వాంచిస్తారు. అలాంటి జీవితం గడపాలనేది మనిషి కోరిక. తమ సుందర స్వప్నంకోసం పడే తాపత్రయంలో ప్రయత్నాలలో, అనుకొన్నవి జరగకపోవటం. తామనుకున్నట్లుగా జీవితం లభ్యమవకపోవటం జరుగుతుంటుంది. తామనుకున్నట్లుగా జీవితాన్ని మలచుకోవటం సాధ్యమని అనిపిస్తుంది. సాధ్యం కాకుండాను పోతుంది.

10) ఒకరికి లభ్యపడటం మరొకరికి లభ్యపడక పోవటం, ఒకరు

అనుభవించటం మరొకరు అనుభవింపలేక పోవటం, ఒకరికి ఒనగూరిన సౌకర్యాలు మరొకరెంత ప్రయత్నించినా ఒనగూరక పోవటం, ఒకరికి లాభిస్తున్న వ్యాపారం మరొకరికి నష్టాన్ని కల్గించటం, ఒకరికన్నా ఎక్కువగా శ్రమపడినా తక్కువ సంపాదించటం వంటి వాటివల్ల, పాపపుణ్యాల ప్రభావం వలనే తమకెంత ప్రాప్తించాలో అంతే ప్రాప్త మవుతోందన్న భ్రమలోకి పడిపోవడం జరుగుతుంది.

11) మనం నివసించే సమాజంలో ఒకరు ఎన్ని మంచిపనులైనా చేసి వుండవచ్చు. ఒక నేరం కనుక చేసినట్లయితే ఆ నేరానికి కోర్టులో విచారణ శిక్ష ఉంటుంది. దేవుని దృష్టిలో అయినా అంతే. ఏలనంటే మనం చేసే పుణ్యకార్యాలు ప్రతిఫలాపేక్షతో చేస్తున్నవి. భోజనం చేసిన తదుపరి చేతికి అంటుకున్న ఆహారాన్ని కడిగివేయడం ఎంతో, మనం చేసే దానధర్మాలు మానవ శ్రేయస్సుకు శ్రమించే కాలము అటువంటిది. మానవ సమాజానికి మనం చేస్తున్న త్యాగం ఏదిలేదు. మానవశ్రేయస్సుకు మనం పడుతున్న ఉద్విగ్నత కార్యాచరణ ఏదిలేదు. కాబట్టి పుణ్యఫలం అన్పించే పుణ్యకార్యాలేవి చేయటంలేదు.

12) అధికారులకు లంచాలిస్తూ నేరాలుచేస్తూ నేరాలనుండి తప్పించుకుంటే, పెద్దమనుష్యులుగా చెలామణిఅవుతున్నవారు ఏనేరాలు చేయనట్లు ఎలా అవదో, అలాగే ప్రార్ధనలు, కానుకలు, కర్మకాండ, దానధర్మాలు వల్ల పాపరహితులు కాలేరు. స్తోత్రాలకు ఆరాధనలకు ఆచారాలకు పాప నివృత్తి చేస్తుంటే, భూమిపై నివసించే ప్రజలు పాపులవల్ల వ్యధలపాలవుతారు. పాపాలు క్షమించబడుతుంటే దుర్బుద్ధి, వంచన నశించవు. నేరం చేసినవాడు నేరస్థుడవడు. పాపాలను క్షమించటమంటే పాపాలను ప్రోత్సహించటమే. ఇలాంటి సహింపు ధోరణి అధర్మ మవుతుంది. ఏ ప్రయోజనాన్ని ఆశించి పాపాలకు శిక్షలను విధిస్తున్నారో, అట్టి ప్రయోజనం జరగకుండా పోతుంది. కాబట్టి పాపులను పాపులు కారని దేవుడు ఆమో

ఉంపరు. పాపనివృత్తి కొరకు ప్రచారంలోఉన్న ఆచరణలన్నీ నిష్ప్రయో జనం కాదా?

13) దైవము న్యాయనిర్ణేత కాబట్టి పక్షపాత వైఖరికి తావుండదు. ఎవరేపాపం చేస్తే ఆ పాపం క్షమించబడదు. పాపపుణ్యాలు డబ్బులు వంటివికావు. ఫలానా పాపాలకు ఇంతశిక్ష, ఫలానా పుణ్యాలకు ఇంత పుణ్యఫలం, అని లెక్కించి లెక్కలు వేయటం కుదరనిది. కూరగాయల లాగ పుణ్యాలు కొనుక్కునేవి ఇతరులకు బదలాయించేవి కావు.

14) మనం ఆమోదించుకున్న విలువల్ని బట్టిసైతం తప్పొప్పులు నిర్ణయమవుతుంటాయి. కొందరికి తప్పు అయినది మరికొందరికి కాకపోవచ్చు. కొన్నింటిలో ఇవిలా మారుతుంటాయి. కాలంతోబాటు దేశంతో బాటు మారే ఈ తప్పొప్పులవల్ల పాపపుణ్యాల నిర్ధారణ క్లిష్టం. ఒకరు చేసిన పాపంవల్ల ఎవరికెంత కష్టం కల్గిందో నష్టం కల్గిందో అంచనా వేయటం సాధ్యపడనిది. ఒకే తప్పు చేసిన నేరస్థులకైనా ఒకే విధమైన శిక్షను విధించే వీలులేదు. సాంఘిక విలువలకు ఇచ్చే ప్రాధాన్యతలలోని తేడాలవల్ల, ఓద ధనిక తేడాలవల్ల, పాపులవల్ల కలిగే కష్టాలకు. అనేకులు అనుభవించే బాధావేదనలలో వ్యత్యాసాలుంటాయి. ఒకే విధమైన కష్టానికి పలువురు వ్యక్తులు పలువిధాలుగా స్పందించటం ఉంది.

15) తప్పుచేసిన వ్యక్తికి తాను చేసిన తప్పు స్వల్పమే ననిపించవచ్చు. ఎవరెలాంటి కష్టం పొందింది అనుభవించినవారికే తెలుస్తుంది. కాబట్టి పాపాలకు శిక్షలను విధిస్తున్నప్పుడు ఏయేపాపాలు చేశారనిగాక, ఏయే పాపాలకు ఎవరెవరికి ఎంతటి మానసిక క్షోభ కలిగిందో, దానినాధారంగా శిక్షలు విధించాలి. ఇలా శిక్షలు విధించాలంటే దేవునికి సైతం సాధ్య పడదు. ఇలా శిక్షలు విధించకుంటే న్యాయమనిపించుకోదు.

16) ఎవరివల్ల ఎవరికి కష్టం నష్టం కల్గిందో వారే నేరస్థులకు శిక్షలను

విధించాలి. పాపులకు శిక్షలను దేవుడు విధించకూడదు. పాపివల్ల కష్ట నష్టాలు పొందినవారి అభీష్టానికి అనుగుణంగా దేవుడు శిక్షలను అమలు పరచాలి, అప్పుడే అది ధర్మం. ఈ కారణంగా పూజలు కర్మకాండ ఆచరించారని పక్షపాత దృష్టిని వహించి, పాపాలను క్షమించి విడిచి పుచ్చేందుకు వీలులేదు.

17) స్వర్గంలో స్థానం కొరకు లేదా పాపనివృత్తి లేదా సుఖసంతోషాలతో నిండిన పునర్జన్మకొరకు, పుణ్యం చేసుకొనెడితాపత్రయం ఏర్పడడంచే, సత్కార్యాలు పరోపకారం దానధర్మాలు సాధ్యపడినవి. ఎవరు చేసిన పాపాలకు వారు పరలోకంలో శిక్షలు అనుభవించక తప్పదనెడి భీతి పాపరహితమైన జీవితం గడపాలనెడి ఉద్దేశ్యము సక్రమ నడవడికకు దోహదపడి ఉంటుంది. తమకు జరిగిన చెడుకు ప్రతిగా జరిగే కలహాలను నిరోధించి, సహనాన్ని సాధ్యపరచి ఉండవచ్చు. మంచిచెడుల విభజన కొరకే పాపపుణ్యాలు ప్రవేశపెట్టబడినవి. మంచిచెడుల ప్రభావం ఉండటం వల్ల పాపపుణ్యాల భావన స్థిరపడ కల్గించి.

18) తప్పొప్పుల విభజనను భగ్నపరచుకుంటే కష్టనష్టాల పాలయ్యేది ఎవరు? దానిని నివారించేందుకే పాపపుణ్యాలు ప్రవేశపెట్టారు. ఏవి చేయవచ్చో ఏవిచేయకూడదో పాపపుణ్యాలద్వారా అదుపు చేశారు. తప్పొప్పుల విభజన శాస్త్రీయంగా లేనప్పుడు, పాపపుణ్యాల విభజనలో తప్పులుంటాయి. ఏదిపాపం ఏదిపుణ్యం అని నిర్ధారించినవి సరికానట్టివని తెలుస్తుంది. అందుచే ఒకప్పటి సంఘం మతగ్రంధాలు నిర్ణయించిన ఈ పాప పుణ్యాలను వదిలేసి, ఏదితప్పో ఏదిఒప్పో శాస్త్రీయంగా విశదీకరించిన వాటిని అనుసరిద్దాం. ఏవిపాపం ఏవిపుణ్యం అనేవి నైతిక శిక్షణ దైవారాధన కొరకు ప్రవేశపెట్టబడ్డవని గుర్తించి, మతపరమైన ఉద్దేశాలను విడవాలి.

19) జీవితంలో మనిషి పొందుతున్న మంచిచెడులకు అసమానతలకు అశాంతి ఆందోళనలకు కారణం, పాపపుణ్యాల ఫలితాలన్న నమ్మకం ఉంటోంది. ఈ నమ్మిక మత ప్రభావమేకాని, పాపపుణ్యాలాధారంగా ఫలితాలు ఉండే అవకాశం ఎలా వుండదో, మరోరీత్యా అర్థం చేసుకోవచ్చు.

20) దేశ దేశాలలోని పాపులపై ఆగ్రహంకలిగి వర్షాలు కురిపించకుంటే పంటలు పండించకుంటె, క్షామం తాండవింపజేస్తే, నీటికి కటకట ఏర్పరిస్తే పశువులు మరణిస్తుంటే, దానివల్ల బాధలు పాపుల కుటుంబాలకే పరిమితం కాక, మానవాళి అంతా కష్టాల పాలవుతుంది. 2. పాపులను శిక్షించేందుకుకని పాపుల పొలాలలో పంటలు పండకుండా చేయాలన్నా, వారి ఫ్యాక్టరీలలో ఉత్పత్తులు తయారీకి ఆటంకాలను కల్గిస్తూ నష్టపరుస్తుండాలన్నా, వీరి పశుసంపదను మరణింప జేయాలన్నా ఇదీ కుదరదు. 3. తగినంత ఉత్పత్తి లేకుంటె ధరలు ఆకాశాన్నంటుతాయి. కల్తీ తప్పుడు తూకం యథేశ్చగా కొనసాగుతాయి. అక్రమ నిల్వాలు, ఆర్జన పెరుగుతుంది. అధిక ధరలు కొరతలవల్ల, కొనలేక తినలేక అశాంతి అలజడి చెలరేగుతాయి. దొంగతనాలు ప్రబలుతాయి. వీటన్నింటివల్ల అంతటా భయాందోళనలు వ్యాపిస్తాయి.

21) పాపులను వ్యాధుల పాల్జేశారనుకోండి. ఎన్ని హాస్పిటల్స్ ఉన్నా చాలవు. ఎక్కడ చూసినా రద్దీ. హాస్పిటల్స్‌లో పడకలు పరికరాలు మందులు వంటివే కాకుండా, డాక్టర్ల కాలమంతా వీరికోసం కేటాయించవలసి వస్తుంది. మందుల కొరత, పరికరాల కొరత, రద్దీవల్ల. మిగతా ప్రజలకు వైద్యచికిత్స సాధ్యపడకుండా ఉంటుంది. ఎవరిపైన తగిన శ్రద్ధను కనబరచలేకుంటారు. హాస్పిటల్స్‌లో చేరలేనివారుంటె వీరివల్ల అంటువ్యాధులు వ్యాపిస్తాయి. ఇతరులు అనారోగ్యం పాలవవలసి ఉంటుంది. 2. పాపులను అనారోగ్యంతో బాధిస్తుంటే ఎంతతిన్నా బలహీనులై పోతారు. ధారుఢ్యం నశిస్తుంది. ఏపని సరిగా చేయలేరు. అందరూ

ఆరోగ్యంగా ధారుఢ్యంగా ఉంటూ తమతమ పనులు చేస్తున్నప్పుడే కదా, పొలాలనుండి పరిశ్రమలనుండి ఉత్పత్తులు అందగలవు.

22) పాపులకు వివేచనను తెలివిని లోపింపజేసినా, అసమర్థులు అజ్ఞానుల్ని చేసినా, వీరుచేసే పనులన్ని అవకతవకగా ఉంటూ, వారితో పనులున్న ప్రజలందరికి కష్టనష్టాలు కల్గుతుంటాయి. కలహాలు, వివాదాలతో కాలం గడపవలసి ఉంటుంది. రైతు, కూలి, కార్మికుడు ఫ్యాక్టరి యజమాని ఇలా పై వాటిచే ఎవరిని బాధించాలన్నా కుదరదు. దిగుబడి సాధించలేని రైతులవల్ల మార్కెట్లోకి సరకు తగినంత రాదు. వస్తూత్పత్తికి అయ్యేఖర్చులు పెరుగుతుంటే అధిక ధరలిచ్చి కొనాలి. ఇంకా నాణ్యత లోపించి నాసిరకం తయారవుతుంది. శ్రామిక నైపుణ్యం లేకున్నా శ్రామికుల కొరతవున్నా సకాలంలో ఏపని జరగదు.

23) దుర్వ్యసనాలు దురలవాట్లు పరులుగా జేసి శిక్షించాలన్నా కుదరదు. దుర్వ్యసనాలు దురలవాట్ల రొంపిలోకి, వీరు తోటిప్రజానీకాన్ని దించేస్తుంటారు. 2. గూండాలు దొంగలు బందిపోట్లు మనస్తత్వాన్ని ప్రేరేపించి శిక్షించాలంటే, వీరివల్ల ఇతరులకు వ్యధలు కల్గుతాయి. 3. దారిద్ర్యం కటిక దారిద్ర్యం పాపఫలితా లనుకుంటే, ఆ దారిద్ర్యం బాధపడలేక, అరాచక పరిస్థితుల్ని సృష్టిస్తారు కాబట్టి ఇది వీలపదు.

24) పాపులంటూ ప్రత్యేకింపజేసి వీరిని శిక్షించుట సాధ్యపడదు. పాపులను శిక్షించాలంటే దుష్ఫలితాలు సమాజంపై పడతాయి. కాబట్టి వారిని జైళ్ళలోనైనా పెట్టాలి లేదా మరణం పాల్జేయనైనా చేయాలి లేదా పరలోకంలోనైనా శిక్షించాలి. ఇలాకాకుండా మనం ఉద్దేశ పడుతున్న రీతిలో పాపాలకు ఫలితాలను ఇస్తుంటే, సమస్యలు అందరిని వేధిస్తాయి కాబట్టి పాపాలకు శిక్షలను ఇహంలో దైవము విధించుటలేదని గుర్తెరగాలి.

25) అవ్యవస్థలు దారిద్ర్యము కొనసాగుతుండగా, ఫలానా తప్పుచేశావు

కాఠిన్య ఫలానా శిక్షలతో కూడిన జీవితాన్ని అనుభవించమని శాసించరు. ఎప్పుడో ఎక్కడో పాపాలు చేశారని, ఆ పాపాలన్నీ లిఖించి శిక్షించాల్సినంత ప్రతీకారం దేవునికి వుండదు. మీరు చేసిన పాపాలకు ఇవి శిక్షలని వినోదించే స్వభావము వుండదు. ఒకరంటే ఇష్టత మరొకరంటే అయిష్టత దేవునికి వుండబోదు.

[illegible]) ఆకలితో అమ్మా అని అలమటిస్తుంటే, తాను తినకుండా తన పిల్లల క్షుద్బాధను తీరుస్తుందే తల్లి. వ్యాధితో బాధపడ్తుంటే ఎంతకష్టం దాపురించిందిరా అని కలత చెందుతామే! దుస్సంఘటనలైనా దురాదృష్ట సంఘటనలకైనా తోటిమనిషి మనస్సే అయ్యో అని అలమటిస్తుందే! ఈ దురాదృష్ట సంఘటనలు తిరిగి పునరావృత మవకుండా, పరిష్కారమార్గాలకై మానవుని మనస్సే ఆతురత చెందుతుండగా, ఇట్టి ఆతృత దేవునికి ఉండదా? దయకు, ప్రేమకు నిలయమైన ప్రభువు పాపాలపేర కర్మల పేర తన బిడ్డలను వ్యధల పాల్జేయునా?

[illegible]) పుణ్యం ఆధారంగా ఫలితాలను ఎక్కువ ఇవ్వడము సాధ్యపడదు. దేవుని దృష్టిలో న్యాయదృక్పథమేకాని పుణ్యాలు కావు. సరైన అవసరాలు కోరికలు తీరేంత సంపాదన ఈ ప్రపంచంలో ఎవరికయినా చాలు. దానికి మించిన సంపాదనను దేవుడు అంగీకరిస్తే ఆడబ్బంతా ఆడంబరాలకోసం వ్యర్థమవుతుంటుంది. ఎందరెందరో శ్రమ నిష్ప్రయోజనం అవుతుంటుంది. మనకే సమ్మతం అన్పించని భోగలాలస జీవితాన్ని దైవమెలా అంగీకరిస్తాడు?

[illegible]) ఒకరికి ఎక్కువ భూములు, ఒకరికి ఎక్కువ పరిశ్రమలు, ఒకరికి ఎక్కువ వ్యాపారావకాశాలు సమ్మతం కావు. ఆస్తులు పెరిగేకొద్దీ వాటిని సక్రమంగా నిర్వహించడం, దుర్వినియోగాన్ని అరికట్టడం సాధ్యపడదు. వ్యక్తుల సంపదలన్నీ కలిస్తే దేశంయొక్క సంపదలలో బాగం అవుతాయి.

దేశంలోని సంపదల ద్వారా, ప్రజలందరికి రక్షణ సంరక్షణ ఎలా జరపాల నేది, దేవుని దృష్టిలో ఉంటుందికాని, ఈ సంపదలను ఏ కొందరికో ప్రాప్తింపజేస్తూ మిగతా ప్రజలందరి ప్రయోజనాలను భగ్నం చేయరు.

29) అధికారం హక్కు పెరిగేకొలది, బాధ్యతలు పెరుగుతాయి. బాధ్య తలు పెరిగే కొలది నిర్వహణా సామర్ధ్యం తగ్గిపోతుంది. అధికారము హక్కులయొక్క సద్వినియోగం లేకుంటే తోటి ప్రజానీకానికి దుష్ఫలి తాలు కల్గుతుంటాయి. ఈ కారణంచే ఆస్తులను అధికారాలను, పదవులను, వృత్తులను కేంద్రీకరించరు. అంటే వ్యక్తులకు అవి అవసరానికి ప్రయోజ నానికి మించి ప్రాప్తించవు.

30) వృత్తులు వ్యాపారాలు పదవులు ద్వారా అధిక సంపాదన ఉందంటే ఇదంతా అక్రమం. ఏదైనా పనిచేయడం, ఏదైనా కొనడం, ఏదైనా అమ్మడం, ఏదయినా ఉత్పత్తి వంటివాటికి అధికంగా డబ్బును వసూలు చేయబట్టి అధికంగా సంపాదన ఉంటుంది. ఈ అధిక సంపాదన అంతా తోటి ప్రజానీకం అవసరాలు ఆధారంగా వసూలు చేసినట్టి మొత్తం. అధిక సంపాదన అంటే అక్రమ సంపాదన, అంటే దోపిడీ. కొందరికి అధి కంగా సంపాదనను సౌకర్యాలను ప్రాప్తింపజేస్తూ, రాజభోగాలను అనుభ విస్తుండని అనేది, దేవుడు అనుమతించనిది.

31) సరైన దృక్పధం, సరైన నిర్ణయం, సరైన ప్రణాళికలు, సరైన నిర్వహణ మరియు ఖర్చు, సత్ప్రవర్తన, నిజాయితి ప్రతిభ శ్రమించుట వంటివి ప్రాముఖ్యత గలవి. ఇవిలేకుంటే కష్టాలు ప్రాప్తిస్తాయి. పరిమి తికి మించిన ఆస్తులు అధికారాలు పదవులు వల్ల, ఈ సరైనట్టిది తొలగి అపసవ్యమైన పద్ధతులు చోటు చేసుకుంటాయి. ఒక సమాజంలో నెలకొని ఉండాల్సిన సరయిన పరిస్థితులకు బదులు, చెడు పరిస్థితులు చెడుధోరణి

ప్రబలుతుంది. కాబట్టి ఈ సరయిన స్థితిగతులను భగ్నపరచే పరిమితులకు మించినవేవి దేవుడు అంగీకరించరని తేలికగా గుర్తింపవచ్చు.

32) విలాసవంతమైన జీవితం అదృష్టమని భావిస్తుండటం వల్ల, దైవం ప్రాప్తింపగలదిగా తలంచుతున్నాం. నిజానికి విలాసవంతమైన జీవితం అంటే ద్రోహం చేస్తున్నట్లు. సంఘజీవితాన్ని కలుషిత పరచటానికి కారణంగా ఉన్న వేవైనా, దేవునికి అనంగీకార మవుతాయి. విలువలు ముఖ్యం. సామాజిక శ్రేయస్సు ముఖ్యం. ప్రజలందరి రక్షణ సంరక్షణ ముఖ్యం. ఇందు కనుగుణమైన పద్ధతులు ఏవో అట్టివి దైవము అనుమతించును గాని, సత్కార్యాలు ఏవో చేశారని పుణ్యకార్యాలు ఆచరించారని వీరి పుణ్యాలు అధికమని, న్యాయదృక్పధంలేని సిరిసంపదలను గాని, పదవులనుగాని హక్కులనుగాని దైవము ఎవరికి ప్రాప్తించరు.

33) మంచి చెడులు ఆధారంగా పాపపుణ్యాలు అధారంగా స్వర్గనరకాలు లెవు. మన సమాజమే ఒకరి పాపాలకు శిక్షలను విధిస్తోంది, తనసౌఖ్యం కొరకే తాను మంచిగా జీవించాలి లేకుంటే జీవితంలో కష్టాలను అనుభవించాల్సి వుంటుంది.

34) వ్యాపారాలలో తదితర వృత్తులలో నష్టాలు, అనుకోని అవాంతరాలు, శారీరక మానసిక బలహీనతలు, వ్యాధులు, ప్రమాదాలు, అకాల మరణాలు, అందవికారము, అంగవైకల్యము, అననుకూల దాంపత్యము తెలివిహీనత, వ్యసనత వంటివి పాపాలు చేస్తున్నారని ఆగ్రహంతో విధిస్తున్నా-ఆస్తులు అంతస్తులు, అధికారము పదవులు అధికలాభాలు పెద్ద వేతనాలు విలాస జీవితంవంటివి పుణ్యాలు చేసినవారికి అనుగ్రహంతో ప్రాప్తిస్తున్నా - జీవితం అనెడి ప్రయాణంలో ఒక్కొక్కరు మోయవలసిన బరువు ఎక్కువయి పోతుంది. ఇలా కాకుండా జీవితం అనెడి ప్రయాణాన్ని హాయిగా కొనసాగింప జేయాలంటే, పుణ్యాలాధారంగా సిరిసంపదలనుగాని, పాపాలాధారంగా కష్టనష్టాలుగాని ప్రాప్తించే వీలులేదు.

35) ధనవంతులు కోరికలు తీర్చుకోవడం కొరకు తాపత్రయ పడుతుంటారు. వీరికి జీవితం వినోదం. కనీసావసరాలు తీరక బీదలు బాధపడుతుంటారు. వీరికి బ్రతుకు భారం. పుణ్యం చేశారని ఒకరి జీవితాన్ని వినోదంగాను, పాపం చేశారని వేరొకరి బ్రతుకును కష్టాలతోను నింపరు. 2. మనం ఊహించే అదృష్టాలను పుణ్యాలనుబట్టి కొందరికి ప్రాప్తింపజేస్తే, మిగతావారు ఈ ధనికుల అవసరాల కోరికల భారాన్ని మోయాల్సి వుంటుంది. ధర్మ స్వరూపుడయిన దేవుడు ఎవరి భారాన్ని వారి చేతనే మోయిస్తుంటారు. దేవుని యొక్క ఔన్నత్యపు టంచులను గుర్తింపక, లేనిపోని అపోహలను నమ్ముతున్నాం.

# 2. జ్యోతిష్యం

1) ఒక అవసరం గూర్చి ఒక కోర్కె గూర్చి, ఒక పనిగూర్చి ఒక విషయం గూర్చి తనదయిన ఆలోచన నిర్ణయం వుంటుంది. ఇది నెరవేరటం, నెరవేరకపోవటం అనేదానిపై, తామనుకున్నట్లు జరగటం జరగకపోవటం అనేది ఏర్పడుతుంది. జరగని వాటికి తమ అధీనంలో లేదు అనుకుంటారు. దుష్ఫలితాలు అనుకోని కష్టాలు అడ్డంకులు వంటివి ఎవరూ కోరరు. అయినా ఇవి వేధిస్తుంటాయి. ఇలా వేధింపబడటాన్ని అధిగమించలేరు! ఈ అధిగమించలేని పరిస్థితిని, జాతకం రీత్యా జరగవలసినది జరుగుతోందని భావిస్తున్నారు.

2) కేవలం ప్రయత్నం వల్ల అన్ని సమకూరవు. ఒక స్వప్రయత్నం ఫలించాలంటే అందుకు సమకూర వలసినవి ఎన్నో వుంటాయి. ఇదిలేనప్పుడు ప్రయత్నం విఫలమవుతుంది. ప్రతి మనిషికి ఉన్న ఆశలు, కోరికలు పెరుగుతున్నాయి. ఇవయితే ఎంతవరకయినా పెరగగలవు కాని, ఇవి నెరవేరవు. ఈ నెరవేరని స్థితికి దైవానుకూలం లేదనుకుంటాడు. ఆశ నిరాశ - ఓటమి విజయము - లాభము నష్టము - అనుకూలత అననుకూలత - తప్పు ఒప్పు - మంచి చెడు - సత్ఫలితము దుష్ఫలితము వంటివి వనులకు వుంటాయి. దీనిచే తన అధీనము పరాధీనము అన్న భావన కలుగుతుంది.

3) జీవితంపై ఎన్నింటో అదుపు వుంది. జీవితం పరస్పరాధారంపై ఆధారపడి ఉంది. ఈ పరస్పరాధారంలోనే పరస్పర అదుపు ఉంటుంది. అదుపు అంటే నియంత్రణ. వ్యక్తులు సమాజము నిరంతరమైన అదుపులో వున్నారు. ఈ అదుపే ఆధీనము. మానవ జీవితం ఈ ఆధీనంలోనే వుంది.

4) ఒక మనిషి భవిష్యత్తు దేశప్రజల ఆధీనంలో ఉంది. దేశ ప్రజల భవిష్యత్తు దేశ ప్రజలందరి ఆధీనంలో అమరి ఉంటోంది. ఒక మనిషి వేటి అధీనము ? మనస్సు ఆధీనము. ఈ మనస్సో భావాల అధీనము. ఈ భావాలో అవసరాల కోరికల అధీనము. ఇవో పరిస్థితుల అధీనము. ఈ పరిస్థితులో పద్ధతుల అధినము. (2) వ్యక్తి, జీవితం ఆధీనం. జీవితం వేటి అధీనము? సమాజంయొక్క అధీనము. సమాజమంతా పద్ధతుల విధానాల అధీనము. సమాజంలో భాగమే కుటుంబము. దానిచే కుటుంబము సమాజంయొక్క అధీనము. (3) కుటుంబము కుటుంబ సభ్యుల అధీనము. కుటుంబ సభ్యులు ఒడంబడిక యొక్క అధీనము. వివాహం నియమ నిబంధనల ఆధీనం. వేటి నియమ నిబంధనలు అయినా సాంఘిక శ్రేయస్సు అధీనం. ఈ సాంఘిక శ్రేయస్సు భవిష్యత్తు అధీనం. ఈ భవిష్యత్తు స్వయంకృషి-సాధన అధీనం. (4) మనిషికున్న మనస్సువల్ల స్వేచ్ఛగా ఆలోచిస్తాడు. ఈ స్వేచ్ఛను అరికట్టడం అసాధ్యం. అందుకే జ్ఞానం యొక్క ధర్మము యొక్క కర్తవ్యం యొక్క బాధ్యతల యొక్క విలువల యొక్క తన అనేదాని యొక్క ప్రేమయొక్క సమభావం యొక్క సమదృష్టియొక్క దయార్ద్రిత యొక్క అధీనము చేస్తుంటాం. ఈ అధీనతను ప్రభుత్వం సక్రమంగా కాపాడలేనపుడు, స్వేచ్ఛ అపసవ్య దిశలలోకి పోతుంటుంది. వీటి అధీనం అవుతుంటారు. పాలకులు వ్యక్తులు దుష్టశక్తుల అధీనంలోకి వెళ్ళినపుడు, తదనుగుణ ప్రవర్తన ఉంటుంది. వ్యక్తి

సమాజము ప్రభుత్వము వేటి వేటి అధీనంలో ఉంటే, వాటి వాటి నియంత్రణ సాగుతుంటుంది. తమ అవసరాల కోరికల నిమిత్తమే, మనుష్యులు కొన్నింటి అధీనంకి లోబడి జీవిస్తున్నారు. వేటి అధీనంలో అయితే మానవులు ఉన్నారో, ఆ మానవుల భవిష్యత్తును అవి రక్షిస్తున్నాయి. ఇలా ఒకని భవిష్యత్తు, ఒక సమాజం యొక్క భవిష్యత్తు, ఎన్నింటి అధీనంలోనో ఉంది. వేటి అధీనంలో మనం ఉన్నామో, అవి మనల్ని తల్లిదండ్రులకువలె సంరక్షించేవి అవునో కాదోనన్న పర్యవేక్షణ మానవులది. మనం అధీనం అయినవి, మనకు రక్షణను సంరక్షణను కల్గించేవయేట్లు చూసుకోవాలి.

5) జీవుడు కర్మప్రభావం జ్యోతిష్యానికి బలమైన స్థానాన్ని కల్పించాయి. పాపపుణ్యాల ఫలితాలు ఉంటాయన్న గాఢవిశ్వాసం, జ్యోతిష్యం నిలద్రొక్కుకుని ఉండేందుకు తోడ్పడింది. ఎవని జీవితం వాని అధీనంలో లేకపోవటం, అందరి అనుభవంలోకి రావటంచే, అంతా దైవాధీనం అన్న నమ్మకం సరైనదనిపించింది. ఈ నమ్మకం జ్యోతిష్యాన్ని బ్రతికిస్తోంది.

6) అదుపాజ్ఞలకొరకు శాసనాలు నియమ నిబంధనలు వంటి వెన్నో అమలు పరచేందుకు, దేశమంతటా ప్రభుత్వ యంత్రాంగం విస్తరించి ఉన్నప్పటికి, అధికులు అదుపుతప్పి ప్రవర్తిస్తుండటం మనం చూస్తున్నదే. ప్రత్యక్షంగా ఇంత తతంగం నిత్యం ఉంటున్నా, అదుపు చేయలేకపోవటం ఉంది. అలాంటప్పుడు పాపపుణ్యాల ఆధారంగా మనుష్యులకు జాతకాలు వ్రాస్తే అవెలా జరగగలవు?

7) ప్రతిరోజు ప్రతిగంట ఎలా జరుగుతున్నదో, ఎందరు తమ తమ డైరీలలో వ్రాసుకుంటున్నారు. గతం నుండి తాము వ్రాస్తున్నదేమిటో ఎందరు చదువుతున్నారు? తమ గూర్చి తాము పరిశీలించుకుంటానికి మనుష్యులకు ఆసక్తిలేదుగాని, ఈ మనుష్యుల జీవిత చరిత్రలన్ని వ్రాస్తుండాల్సిన అవసరం దేవునికి ఎందుకు ఉంటుంది ?

8) పుట్టినది మొదలు మరణించేంతవరకు, ఏదెలా జరగాల్సి ఉందో అదంతా లిఖించటం జాతకం. ఒకోమనిషి జాతకం ఒకో గ్రంథం అవుతుంది. ప్రపంచం అంతటా ప్రతి నిమిషానికి వేలకొలది పుడుతున్నారు. ఇలా ఎందరు పుడుతున్నారో అంతమందికీ, ఒక్క నిమిషంలో జాతకాలు వ్రాయటం ఎలా సంభవం? మనిషి మనిషికి జాతకాన్ని వ్రాస్తూ వీటిని సమన్వయ పరచేదెట్లు? ఆలోచించి వ్రాయాలంటే ఒకోసారి నిమిషంలో ఒక్క వాక్యంకూడా పూర్తికాదు. జాతకాలు ఏమైనా నవలలా, ఏదో ఒకటి వ్రాసి పారెయ్యడానికి?

9) జాతకాలను కనుక దేవుడు వ్రాస్తుంటే, వాటిని అమలు జరిపే శక్తి సామర్థ్యాలు గలవారై ఉండాలి. ఆ శక్తి సామర్థ్యాలు ఉండబట్టి మానవుల ప్రయత్నాలు ఎలాగుఉన్నా, వారికి ఏవి ఏ రీతిలో ప్రాప్తించాలో అంత వరకే ప్రాప్తిస్తున్నాయి. మంచి జరగాలో చెడు జరగాలో నిర్ణయించిన ప్రకారం జరుగుతోంది. అంటే ఒకనికి మరొకడు అపకారం చేయాలన్నా నష్టపరచాలన్నా సాధ్యపడదు. మనుష్యులు తామనుకున్నట్లు ఏది చేయలేరు. అంతా దైవాధీనం. అలాంటప్పుడు వంచన అధర్మం వివిదాలైన పాపాలు జరగకుండా నియంత్రించవచ్చు కదా! అప్పుడు పాపాలు ఉండవు. పాపాలు లేనందుచే అమితశ్రమతో కూడిన, ప్రతిరోజు ప్రతి ఒక్కరి పాపపుణ్యాల లెక్కింపు అవసరం ఏర్పడేదికాదు. ఇది వదలి కాలంతో బాటు అవిశ్రాంతితో కూడిన భారాన్ని దేవుడు కల్గించుకోరు కాబట్టి జాతకాలు అబద్ధం.

10) పాపపుణ్యాలు ఆధారంగా జాతకాలను నిర్ణయించాలంటే, ప్రపంచంలోని సంఘటనలన్ని కళ్ళముందు కనిపిస్తున్నా చాలదు. మనఃస్తత్వంలో వ్యక్తిత్వంలో సామాజిక ఆర్థిక రాజకీయ పరిస్థితులలో, ఎలాంటి మార్పులు వస్తున్నాయో తెల్సినా చాలదు. ఏ 70 100 సంవత్సరాల తదుపరి ఈ ప్రపంచం ఎలా ఉంటుందో స్పష్టపడినా చాలదు. ఎందుకంటే జాతకం సినిమా ఇతివృత్తంకాదు.

11) సినీ రచయిత చెప్పినట్లు పాత్రధారులు ఆలోచిస్తారు. మాట్లాడతారు. నిర్ణయాలు గైకొంటారు. పనులు చేస్తుంటారు. కాబట్టి ఇతివృత్తంలో ఉన్న సంఘటనలు ఏర్పడుతుంటాయి. ఆ సంఘటనలకు అనుకూలంగా హావభావాలను ప్రదర్శిస్తుంటారు. అలా పాత్రధారుల జీవితాలు జరుగుతుంటాయి. ఇదంతా నటన. రచయిత నిర్ణయించినట్లు అన్నీ ముందుగా నిర్ణయింపబడ్డాయి కాబట్టి పాత్రధారుల జీవితాలలో అన్నీ అనుకున్నట్లు జరుగుతుంటాయి. వినోదంకొరకు సృష్టింపబడిన పాత్రలు సంఘటనలు కాబట్టి, వినోదంకొరకు నటిస్తుంటారు. నటిస్తున్నంత సేపే, ఆ తదుపరి ఎవరికివారే.

12) జీవితం సినిమావంటిదికాదు. కొద్దిమంది పాత్రధారులలో తానొకడు కాదు. తమదేశంలోని కోట్లాది జనసంఖ్యలో తాను ఒక వ్యక్తి. తన వ్యక్తిత్వం ప్రవర్తన సమాజ సంబంధము. తనజీవితం తనకే కాకుండా తనవారికి సంబంధించినది. జీవితం అవసరాలు కోరికలకు సంబంధించినది. వీటికొరకు నిరంతర ప్రయత్నం చేస్తుంటాడు. ఈ ప్రయత్నాన్ని నిరోధించలేరు. తన ప్రయత్నంకొరకు తన వాటికొరకు తెగింపు ధైర్యంతో ప్రవర్తిస్తాడు స్వల్పసంఘటనలకి సైతం స్పందిస్తాడు. తన శ్రమను ఇతరులు దోస్తున్నా, ఇతరులు హింసిస్తున్నా, ఎవరివలనో కష్టం నష్టం కల్గుతున్నా, ఎవరివలనో అశాంతి ఆందోళన పాలవుతున్నా, వేటివల్లనైనా అవాంతరాలు ఏర్పడ్డా, ఎదుర్కొంటాడు పిల్లలు ఆడించినట్లు ఆడే ఆట బొమ్మకాదు మనిషి. సినీ రచయిత చెప్పినట్లు ప్రతిదిచేసే పాత్రధారికాదు మనిషి. అందువలన సినీ ఇతివృత్తంలో నిర్ణయించిన సంఘటనలకువలె, అంతా ముందుగా నిర్ణయింపబడినట్లు, సంఘటనలు జరగవు. ఇలా జరపటం అసాధ్యం కాబట్టి జ్యోతిష్యం అబద్ధం.

13) యంత్రం ఎక్కడ ఉండమంటే అక్కడ ఉంటుంది. ఏపని చేసేందుకు దానిని తయారుచేస్తే ఆ పనిని అది చేస్తుంది. విత్తు ఎక్కడనాటితే

చెట్టు అక్కడ స్థిరపడి ఉంటుంది. మనుష్యులు చెట్లు యంత్రాలు వంటివి కావు. అందుచే జాతకాలు లిఖించే నిష్ప్రయోజనమైన పనిని దేవుడు చేపట్టరు. ఎన్నో దేశాలు. దేశదేశాలనిండా క్రిక్కిరిసిన ప్రజానీకం. వారి నుదుట ఏ నిముషం ఎలా జరగాల్సి ఉందో లిఖించినా, యంత్రాలకువలె మనుష్యులను నియంత్రించటం సాధ్యపడదు. జ్యోతిష్యం యంత్రాలకు చెట్లకు పనిచేస్తుంది కాని, మానవుల కొరకు కాదు.

14) దేవుడు అలా జరగాలి అంటే అలా జరిగిపోవడం ఎలా? నిత్య జీవితంలో జరిగే సంఘటనలు అన్ని దైవం లిఖించినట్లు జరగాలంటే ఇదెలా సాధ్యం? జీవితం స్పందన ప్రతిస్పందనలతో కూడివుంది. ఏది ఆలోచించినా ఏది నిర్ణయించినా తనకొరకు తనవారి కొరకు చేస్తుంటారు. జంతువును దెబ్బకొడితే భరిస్తుంది. మనిషి అయితే నువ్వెవరవని నిలవరిస్తాడు. దేవుడు ఒకరికి కష్టం కల్గించాలన్నా మరొకరికి నష్టం కల్గించాలన్నా, వారు చూస్తూ భరించక ఎదుర్కొంటారు. అంటే కష్టాల నుంచి తప్పించుకుంటారు.

15) ఫలానా వారికి ఫలానావి ప్రాప్తించాలన్నా సాధ్యపడదు, ఎందుకంటే ఒకపని జరగాలన్నా అది ఎందరితోనో ముడిపడి ఉంది. వర్షం కురవాలి అనగానే వర్షం ఎలాపడదో, అలాగే ఫలానావి ప్రాప్తించాలి అన్నా అవి చేకూరవు. దేవుడు కొందరికి ఐశ్వర్యం రాజభోగాలు ఇవ్వాలన్నా సమాజం అంగీకరించదు. అసమర్థులకు అవివేకులకు గొప్ప పదవులు అంటకట్టాలన్నా, కొందరికి అధిక పొలాలను ఇవ్వాలన్నా, మరి కొందరిచే ఎక్కువ పరిశ్రమలు స్థాపింప చేయాలన్నా, ఎందరికో అధి సంపాదనను చేకూర్చాలన్నా, సమాజం అంగీకరించకపోతే అవి నెరవేరవు.

16) కొందరికి ఉన్న ఆస్తులు లేకుండాపోవాలని జీవితమంతా దుఃఖించా

లని లిఖిస్తే, ఆకొందరు ఆస్తి ఉంటేనేమి లేకుంటేనేమి, ఏదోఒక పని చేస్తూ హాయిగా బ్రతకగలము అనుకుంటే దుఃఖమేలేదు. 2. ఆ కొంద రికి ఉన్న ఐశ్వర్యం అంతా తగ్గిపోవాలని లిఖిస్తే, ఆ తగ్గిన ఆస్తులతో సంతృప్తి పడితే బాధ అనేది ఉండదు. 3. దుర్మార్గులైన సంతానంతో అష్టకష్టాలు పడండని కొందరికి లిఖిస్తే, ఆ కొందరు తమ సంతానంతో తెగత్రెంపులు చేసుకుంటే, కష్టాలుపడే స్థితి తప్పిపోతుంది. 4. ఫలానా వ్యాధులతో పీడింపబడుతూ మరణించండని కొందరికి లిఖిస్తే, ఆకొందరు వైద్యచికిత్సతో మరణాలనుంచి తప్పించుకోవచ్చు, 5. దుర్మార్గులయిన భర్తలతో చిత్రహింసలు పడండని లిఖిస్తే, ఆ భర్తలకు విడాకులిస్తే ఆ చిత్రహింసలు లేవు. 6. భర్తల ప్రాణాలను లాగివేసి కొందరు స్త్రీలను దుఃఖింపజేయాలంటె అదీ కుదరదు. వేరే మగాళ్ళను పెళ్ళాడతారు.

17) పాపాలవారీగా దుఃఖాలతో పీడించాలన్నా సాధ్యపడదు. ఎందు కంటే ఎవరికి వారు తమకు సాధ్యమైన రీతిలో కష్టాలనుండి విముక్తిని పొందుతారు. పుణ్యాలవారీగా అధిక ఫలితాలను ప్రాప్తింప జేయాలన్నా, ఈ అసమానతలను సమాజం ఒప్పుకోదు. పాపాలకు పుణ్యాలకు వేర్వేరు ఫలితాలు ఇవ్వాలన్న నిర్ణయానుసారమే జ్యోతిష్యం. ఇదేమో నెరవేరని దవుతోంది. ఇట్టి నిరర్ధకమైన పనులు దేవుడు తలపెట్టనివి కాబట్టి జ్యోతిష్యం అనేది లేదు.

18) ఎవరినైనా ఇది చేయి అనగానే చేయరు. ఇది వద్దు అనగానే మానరు. తాము చేయదలచుకున్నట్లయితే, తమ ప్రయత్నం నెరవేరే మార్గాన్వేషణ చేస్తారు. ఫలించడం ఫలించకపోవడం వేరేసంగతి. నిద్ర లేచింది మొదలు పడుండే వరకు, మనుష్యులలో తమ ప్రయత్నాలకు అను గుణమయిన ఆలోచన, కార్యక్రమం కొనసాగుతుంది. ఇదేకదా జీవితం. ఈ జీవితాన్ని వ్రాసుకుంటున్నది కొనసాగించు కుంటున్నది మానవులు.

కాబట్టి జీవితంలో జరిగే సంఘటనలకు కారణం మానవులు. జీవితంలో జరిగేది ప్రతిదీ సంఘటనే. ఈ సంఘటనలు అనేవి మానవులకు ఉన్న ఆలోచన కార్యాచరణబట్టి ఏర్పడుతున్నాయి. అంటే జీవితాలలో జరుగుతున్న సంఘటనలు, దేవునివల్ల కాదు. కాబట్టి జాతకాలు అబద్ధము.

19) మనిషి పుట్టకముందే మరణించేంత వరకు, అంతా నిర్ణయింపవలసిన అవసరం దేవునికి ఎందుకు వుంటుంది? దైవము ఒకప్పుడు ఉండి మరొక్కప్పుడు లేకపోతేకదా? ముందుగా శాసించాల్సిన పరిస్థితి ఏర్పడి ఉంటుంది. తాను నిర్ణయించిన విధంగానే జరగాలనేటి పట్టుదల దేవునికి ఉండనిది. కష్టనష్టాలను అధిగమించడానికి దేవుడు తోడ్పడతారుగాని, వాటి వలయంలో పడి దుఃఖించమని శాసించరు కదా !

20) కష్టనష్టాలు ఉండడంవల్ల భయాందోళనలు ఉంటున్నాయి, ఈ కారణంచే తమ భవిష్యత్తు ఎలాగ వుంటుందోననే ఆరాటం సహజం. ఏది ఎప్పుడు ఎలా జరగాల్సి ఉందో అంతా నిర్ణయింపబడి వుందని, తన ఉనికి కోసం జ్యోతిష్యం నమ్మింప జేస్తోంది.

21) ఒకరివల్ల మరొకరికి, కొందరివల్ల మరికొందరికి కష్టాలు నష్టాలు కల్గుతున్నాయని చెప్పటానికి బదులు, కర్మప్రభావమని గ్రహగతుల ప్రభావమని జ్యోతిష్యం నమ్మిస్తోంది. కష్టసుఖాలన్నీ పాపపుణ్య ఫలితాలని నమ్మటంవల్ల, జ్యోతిష్యానికి స్థానం ఏర్పడింది. మనచేతుల్లో మన భవిష్యత్తు లేదని నమ్మించటమే జ్యోతిష్యం చేసిన ద్రోహం.

22) తమకున్న అర్హతలు శక్తిసామర్థ్యాలు ఆధారంగా వృత్తులు రాబడి ఉన్నప్పుడు సంపాదనావకాశాలను ఆస్తులను ఆదాయాలను పరిమిత పరిధిలోనే అనుమతిస్తున్నప్పుడు, వ్యవసాయ పారిశ్రామిక వ్యాపార రంగాలలో లాభనష్టాల జూదం లేకున్నపుడు, లాభనష్టాల ప్రమేయంలేని తమ కష్టార్జితంపై దైవములేదా వేరేవాటి ప్రభావమోనని భ్రమచెందటం జరగదు.

23) కర్మననుసరించి జీవితం నడుస్తోందన్నా, పాపపుణ్యాలాధారంగా ఫలితాలు ఉంటున్నాయని అనుకున్నా, అదృష్టదురదృష్టాలు చేకూరుతున్నా యనుకున్నా-ఇవి కల్పిస్తున్నది కల్గిస్తున్నది నేటి వ్యవస్థ. అవి లభ్యపరచ గల వ్యవస్థకోసం పోరాడట మొక్కటే మార్గం.

24) ఇంతవరకు అనేకమైన కష్టనష్టాలను భరిస్తున్నారు. ఇక వీటిని అధిగమింపజేసే లక్ష్యసాధనకు ఉపక్రమించాలి. కొందరికి కష్టం కల్గించా లన్నా నష్టం కలిగించాలన్నా, తోటివారివల్ల కలిగించాలి. కష్టనష్టాలు కల్గించాలన్నా వారుండే సమాజం నుండి ప్రాప్తింపజేయాలి. మానవులు ఆలోచనాపరులు. తమకు కష్టం కల్గించేవారిని, తమకు నష్టం కలిగించే సమాజాన్ని ఎదుర్కొంటారు. ఇందుండే నూతన తరహా సమాజం సాధ్య పడుతుంది. మానవమస్తిష్కం ఇందుకు ఆత్రుతపడే సమయానుకూలతను బట్టి, అపూర్వ దైవముచే సాధ్యపరచ బడుతుంది.

25) దేవుని ఔన్నత్యాన్ని తెలుసుకోక కష్టసుఖాలు దైవనిర్ణయమని అపోహ చెందారు. జీవితం ఒక ప్రణాళిక. ప్రణాళికాబద్ధమైన జీవనం మానవ అధీనం. ఈనాడైనా కర్తవ్యోన్ముఖులై ఆనందప్రదమైన భవిష్యత్తును లిఖించుకోండి.

# 3. అసమానతలు

1) అసమానతలకు దైవము కారణం కాదన్నది ఇక్కడి విషయం. వ్యక్తిగత ఆస్తి హక్కుగా వుండాలని మనం కోరుకొంటున్నాం కాబట్టి వ్యక్తులపేర ఆస్తులు ఉంటున్నాయి. ఇట్టి సమాజంపై మనకు ఉన్న అంగీకారం వలనే పెట్టుబడిదారీ సమాజం తరహాతో పరిపాలన సాగుతోంది. 2. వ్యక్తిగత ఆస్తులు అవసరంలేదు, అంతా ఉమ్మడి ఆస్తిగాచేసి పరిపాలించండి అని ఓటుహక్కు ద్వారా అంగీకరిస్తే, అప్పుడు కమ్యూనిజం పరిపాలన సాగుతుంది. 3. ఎవరికైనా ఆస్తులు వుండడం, ఎవరికయినా లేకుండా పోవడం అనేదంతా మన అంగీకారంపై ఆధారపడిఉంది. ఆర్థిక పరమయిన ఈ అసమానతలు దైవమువల్లకాక మన అంగీకారము పైన వుంటున్నాయి. 4. అంగీకరింపగలవి అంగీకరింపకూడనివి మన ఇష్టాఇష్టాలతోగాక ప్రగతి కొరకు అంగీకరింపవలసిన వాటితోబాటు, ప్రకృతిపరంగా ఏర్పడిన అసమానతలు ఉన్నాయి.

2) వయోబేధం, శారీరక మానసిక ఆరోగ్యం, అవకాశాలు, అనుకూల అననుకూల పరిస్థితులు, అనుభవం మరియు పూర్వానుభవం. నేర్పు నైపుణ్యము, ఒకపనిని చేయటం చేయలేకపోవటం, లభ్యమయ్యేడి పనులు వాటికి వెచ్చించే సమయము, పనులనుబట్టి మారే వేతనాలు, పెట్టుబడి

4)

మరియు భాగస్వామ్యము ఉండటము లేకపోవటము, సమిష్టిగా కలసి నిర్వహించుకొనుట లేకపోవుట, వుత్పత్తులకు అవరోధంగాలేని పరిస్థితులు, వృత్తులకు కల్పించెడి సదుపాయాలు. ప్రభుత్వం అనుసరించెడి విధానాలు మరియు పరిపాలన మొదలగువాటిని బట్టి ఆర్థికపరమైన అసమానతలు ఏర్పడుతున్నాయి.

3) వ్యక్తిగతమైన కోరికలు అనేకం. తమకు ఉండే కోరికలు, ఇతరులకు వుంటాయని, ఆవేకోరికలు దేశప్రజ లందరికి వుంటాయని అందు కొరకు అందరు ప్రయత్నింస్తుంటారని మరస్తుంటారు. ఎంతకి తనకోరిక నెరవేఃటం గూర్చిన ప్రయత్నము ఆందోళనతో సరిపెట్టుకుంటూ, అసమానతలకు కారణాలుగా మతపరమయిన ఉద్దేశాలను నమ్ముతున్నారు.

4) అందరూ మనుష్యులు. మనుష్యులందరికి సమాన అవకాశాలు హక్కులు ఉన్నాయి. కాని అందుకనుగుణంగా అందరికీ అన్ని లభించవు, కోరుకున్నవి అందరికి లభ్యపడవు. వేటిల్లోనైతే సమాన హక్కులు అవకాశాలు స్త్రీపురుషులందరికి ఉండాలో, వాటిని ప్రభుత్వాలు అమలు పరచనపుడు అసమానతలు వుంటాయి. వ్యవస్థలోని లోపాలు అసమానతలను ఏర్పరుస్తాయి. ధర్మానికి న్యాయానికి ప్రాధాన్యమివ్వని రాజ్యాంగం వల్ల లేక రాజ్యాంగము సవ్యమైనదైనా దానినిఅమలుపరచే ప్రభుత్వం కానందు వల్ల అసమానతలకు స్థావరం ఏర్పడి వుంటుంది.

5 గాలి. నీరు, ఉప్పు వంటివి అపారంగా ఉన్నాయి. ఎవరికి కావలసినంత వారు వాడుకోగలరు. కోరుకున్నంత లభ్యపరచుకో గలరు. ఒకరికి లభించిందే నాకు లభించలేదే అన్నప్రశ్న తలెత్తదు. ఇది వినియోగించుకోవటాన్ని ఎవరూ అదృష్టంగా భావించరు.

6) భూమిఅంతా ఒకేరీతిలో లేదు. కొన్ని ప్రాంతాలలో సారవంతమైన భూములు, మరికొన్ని ప్రాంతాలలో సేద్యోపయోగం కాని భూములు,

విస్తృతంగా వ్యాపించిన ఎడారులు, అతి తక్కువ అతి ఎక్కువ వర్ష పాతం, అతిశీతలము, అతివృష్ణము వంటి వాటివల్ల అనుకూల అననుకూల వాతావరణం వంటివి ఏర్పడటంతోపాటు, భూమిలో లభ్యమయ్యేడి సహజవనరులు వంటి వాటివల్ల, అసమానతలు ప్రకృతిపరంగాను ఏర్పడు తున్నాయి.

7) పరిమితంగా లభ్యపడటం, పరిమితంగా వుపయోగపడటం,పరిమితావ కాశాలు ఎప్పుడయితే తప్పనిసరో: మానవాళి ఉపయోగించుకుందుకు అంద రకు అన్ని లభ్యపడవు. ఏ నిష్పత్తిలో అవి లభ్యమో ఆ నిష్పత్తిలో, ప్రజల అవసరాలు కోరికలు తీరతాయి. ప్రకృతిలో వివిధాలైన ఆహార ధాన్యాలు కూరగాయలు, పళ్ళు పండుతుంటాయి. అన్నిరకాలు అందరికి లభ్యపడవు. తమకు లభ్యమైన వాటితో సంతృప్తిని పొందక తప్పదు.

8) పొలాలలో పంటలు పండుతున్నా, పరిశ్రమలలో ఉత్పత్తులు తయా రవుతున్నా, వస్తూత్పత్తిని అమ్మేందుగా వ్యాపారులున్నా, ప్రభుత్వోద్యో గులు ఉంటున్నా, యజమానులు ఉంటున్నా. బస్సులు రైళ్ళు నడుస్తున్నా ఇవన్ని ప్రజల అవసరాలు నెరవేరుట కొరకే. పైవి నిర్వహించేందుకు కొద్దిశాతం ప్రజలు అవసరమౌతారు. ఆ కొద్దిశాతం ప్రజలకు ఆ అవకా శాలు వుంటుంటాయి. మిగతావారికి అవి లభ్యపడవు.

9) తక్కువశ్రమ ఎక్కువశ్రమ-కష్టమైనవి సుఖవైనవి-విశ్రాంతి అవి శ్రాంతి-సదుపాయాలు ఉండటం లేకపోవటం - అధికారం అనధికారం- లాభాల వేతనాల శాతంలో ఎక్కువ తక్కువలు వంటివి వివిధ వృత్తులను బట్టి ఉంటున్నాయి. వృత్తినిర్వహణలలో ఎవరువున్నా, ఎవరు మారి మరొకరందులో చేరినా పైవలా కొనసాగుతుంటాయి. కుటుంబంలోని పనులను కుటుంబసభ్యులు పంచుకుని చేస్తుంటేనే, అనుకున్నవేళకి అన్ని పనులు అవుతున్నాయి. అలాగే దేశంలో నిత్యం ఎందరో ఎన్నింటినో

నిర్వహిస్తుండడంవల్ల, మనుష్యుల అవసరాలు కోరికలు నెరవేరుతున్నాయి. దీనివల్ల అసమానతలు ఏర్పడుతున్నాయి.

10) ప్రకృతివనరుల లభ్యత, పరిశ్రమలు వాణిజ్యం ప్రభుత్వ ప్రవేటు సంస్థలు, విద్యాలయాలు, అధికారము మరియు ఆస్తుల కేంద్రీకరణ, ఆధుని కతను బట్టి, వృత్తి ఉద్యోగావకాశాలు. అచ్చట నివసిస్తున్నవారికి లభ్య మవుతున్నాయి. పల్లెలు పట్టణాలు నగరాలనుబట్టి ఆదాయ వ్యయాలలో తేడాలతో బాటు, కొందరికి సౌకర్యాలు లభించుట మరికొందరికి లభించక పోవుట జరుగుతున్నది.

11) వృత్తులు ఉద్యోగాలు వ్యాపారాలు పరిశ్రమలు భూములు పంటలు ఉత్పత్తులు వేర్వేరవటంచే, వృత్తి వుద్యోగము వ్యాపారము భూమి పరిశ్రమ వుత్పత్తి వేర్వేరయి ఆర్జన సౌకర్యము వేర్వేరవుతుంటాయి. వివిధరంగాల లోని అవకాశాలయొక్క పరిమితత్వం, కొద్దిశాతం ప్రజలకు మాత్రమే డబ్బు విద్య హోదాతో బాటు ప్రత్యేకతలను ప్రాప్తింపజేస్తోంది. తమకు ఉన్న అవకాశాలను గుర్తించలేకపోవటం, అవకాశాలు ఉన్నా సద్వి యోగం చేయగల సత్తా లేనందువల్ల బీద దనిక ఏర్పడుతోంది.

!) ఒక నెల ముందుగా ప్రయాణించినవాడు ఒక నెల ముందు చేరు ంటాడు. నేడు పుట్టి పెరుగుతున్న వారికన్నా, 25 సంవత్సరాల క్రిందట నుండి జీవిస్తున్నవారు సంపాదనావకాశాలు స్వంతం చేసుకుంటారు. జనాభా పెరిగేకొద్ది అవకాశాలు తగ్గుతుంటాయి. పిల్లలకన్నా యువకులకు, యువ కులకన్నా పెద్దవారికి అవకాశాలు అందుబాటులోకి రావడంవల్ల, బీద ధనిక ఏర్పడుతుంది.

13) అవసరాలకు అర్హతలకు ప్రాధాన్యతను ఇవ్వకుండా, అవకాశాలను అందరిముందు ఉంచడంవల్ల, ఎందరికో అంది ఉండవలసిన సంపాదనావ కాశాలు తద్వారా ప్రాప్తించే సంపదలు, కొద్ది శాతం ప్రజల చేతుల్లోకి

చేరుతుండటంవల్ల బీద ధనిక ఏర్పడి ఉంటున్నది. 1. అర్హతలనుబట్టి కొందరికి కొన్ని అవకాశాలు లభిస్తాయి. 2. అందరికి అర్హతలు ఉన్నా ఆ అర్హతలు గలవారిలో ప్రథములే అవకాశాలను పొందకల్గుతారు. 3. ప్రతిభ నైపుణ్యం అనుభవం తదితర అర్హతలు వాటంతటవి ఏర్పడేవికావు. అందుకు ఎంతో శ్రమిస్తే కాని వాటిని పొందలేరు. ఈ ప్రత్యేకతలచే అవకాశాలను పొందుతారు. 4. ఏది నేర్వాలన్నా లేక ఏది నేర్పాలన్నా కష్టమే. కష్టానికి వెరచి కొందరు కొన్నింటిలో పాల్గొనరు. ఆ కష్టమైన వాటిల్లో కొందరు పాల్గొని అవకాశాలను పొందుతారు. 5. సద్గుణాలనేవి వాటంతట అవి ఏర్పడవు. సద్గుణాలను పెంపొందించు కోవటాన్నిబట్టి, లాభాలు నష్టాలను కల్గించుకుంటున్నారు.

14) బ్యాంకులు సమకూర్చే ఆర్థిక సహాయంవల్ల పరిశ్రమలను నెలకొల్పుతారు. సంవత్సరాలు గడిచేకొద్దీ, వారు నెలకొల్పిన పరిశ్రమలు వారి స్వంత ఆస్తి అవుతుంటాయి. ఇంకా ఏటా ఆర్జన సమకూరటంతో, కొందరు మరీ ధనికులవుతుంటారు. జూదంలో డబ్బును గడించేవారు, కోల్పోయేవారు ఉంటారు. జూదంలాంటి నిర్వహణలు వివిధ రంగాల వారి ఉంటున్నాయి, దీనివల్ల ఆస్తి అంతస్తుల తేడాలు ఏర్పడుతున్నాయి.

15) వ్యక్తుల స్వంత ఆస్తికివలె వ్యాపారాలు వారి వారి అధీనమై ఉండటంవల్ల, వారు వారి సంతతి ధనికులు అవుతున్నారు. తమవద్ద ఉన్న ఆస్తిని పెంపొందించే కృషితో, వ్యాపారాభివృద్ధిని సాధించే కృషిలో,తగిన ఫలితాలు రాబట్టుకునే పలుకుబడి తదితర ప్రయత్నాలవల్ల, వారి వారి ఆస్తులు రాబడులు పెరుగుతున్నాయి. ప్రజల అవసరాలు కోరికలు ఆధారంగా, అక్రమ లాభార్జన చేయటంచే, ధనికవర్గంగా రూపొందుతున్నారు.

16) నాణ్యతగల సరకులు నాసిరకం సరకులు రెండింటి వాడకంవల్ల, లాభనష్టాలుండి హెచ్చు తగ్గులను కల్గిస్తుంటాయి. పారిశ్రామిక ఉత్పత్తులు అనేకం. వీటి వినియోగం సరిగా లేనందుచే తరచూ కొనుగోలు చేస్తుంటారు. వ్యక్తి అవసరాలకు వ్యాపార పారిశ్రామిక అవసరాలకు, తరచూ కొనుగోలు చేయటంతో, ఆదాయాలు తరిగిపోతుంటాయి.

17) కొన్ని కుటుంబాలు కోరికలకు ప్రాధాన్యత ఇస్తూ, ఆడంబరంగా జీవిస్తూ, డబ్బు ఖర్చు చేస్తుంటారు. వీరి ఆస్తులు తరిగిపోతాయి. డబ్బు ఎంత ఉన్నా దుబారా దుర్వ్యయం చేయని కుటుంబాల ఆస్తులు పెరుగుతుంటాయి. ఒకేస్థాయిలో ఆదాయాలు వస్తున్నా, ఖర్చులలోని వ్యత్యాసాలను బట్టి అంటే పొదుపు చేయటం, చేయలేకపోవటం బట్టి వ్యత్యాసాలేర్పడతాయి. జీవనవ్యయంలోని వ్యత్యాసాలువల్ల, కొందరి సంపాదనలో మిగులు ఉండదు.

18) వివిధ సమస్యలపై వివాదాల పరిష్కారంకై కోర్టులచుట్టూ తిరగడం, పంతాలు పట్టుదలలతో డబ్బును శ్రమను వ్యర్థ పుచ్చటం, కలహాలలో పాల్గొనటం వంటివి బీదరికం పాల్జేస్తాయి. వ్యాధులు అనారోగ్యాలు దుస్సంఘటనలువల్ల సంపాదన హరింపయిపోతుంది. పెళ్ళిళ్ళు అంత్య క్రియలు మతాచారాలు పండుగలు వేడుకలు అతిథి మర్యాదలు వంటివి, సంపాదనను హరింపు చేయటమో, ఆస్తులను తగ్గించటమో చేస్తుంటాయి.

19) భార్యాభర్తలకు పిల్లలు లేకుంటే హెచ్చు శ్రమించాల్సినది ఉండదు. ఉన్న ఆస్తి తరగదు. ఇద్దరు పిల్లలయితే తమకు కొంత ఉంచుకొని, మిగతాది పిల్లలకు పంచుతారు. అదే ఐదుగురు పిల్లలుంటే, మొత్తం ఆస్తిలో ప్రతిఒక్కరికి వచ్చే ఆస్తి ఎంతో తక్కువ. వాటిపై వచ్చే రాబడులు ఎంతో తక్కువ. దేశంలో దంపతులందరు కల్గిఉండే పిల్లల సంఖ్యనుబట్టి,

వారికి ఉండే శ్రద్ధాసక్తులు అర్హతలు అవకాశాలనుబట్టి, బీద ధనిక తేడాలు ఏర్పడుతుంటాయి.

20) తక్కువ ఆస్తిఉన్నా కొన్ని కుటుంబాలు మరికొంత ఆస్తిని కూడ బెట్టడం, ఎక్కువ ఆస్తి ఉన్నా కొన్ని కుటుంబాలు బీదరికం పాలవటం, ఏ ఆస్తిలేని కొన్ని కుటుంబాలు ప్రతిభతోను స్వయం కృషితోను ఆస్తి హక్కు దార్లవటం, మన కళ్ళముందే జరుగుతున్నాయి. ఒక్కొక్కరి నిర్వహణా తీరునుబట్టి, రాబడులు పెరగడం తరగడంతోబాటు, కొందరు కొన్నింటిని అమ్ముకోవటం మరికొందరు వాటిని కొనుక్కోవటం, కొందరు చనిపోగా వారి సంతతికి అవి అదనంగా సేకూరటము ఉంటాయి. దేశంలో సంపదలు పెరుగుతున్నకొద్దీ, కొందరికి అదనంగా ఆస్తులు హక్కులు లభిస్తుంటాయి. ఇలా అసమానతలు ఏర్పడుతున్నాయి.

21) గతంనుండి సాగిస్తున్న జీవితాన్నిబట్టి పరిస్థితులనుబట్టి, అవకాశాలు ఫలితాలు వస్తుంటాయి. అవి మంచికి లేదా చెడుకి కూడా కారణం కావచ్చు. ఫలితంగా హెచ్చు తగ్గులుంటాయి.

22) వంశపారంపర్య హక్కులువల్ల, ఒకరి శక్తిసామర్థ్యాలతో నిమిత్తం లేకుండా, ఆస్తి అంతస్తు సౌకర్యాలు వాటంతటవే సమకూరటంవల్ల, హెచ్చుతగ్గులుంటాయి. మేధాశక్తి ప్రతిభ సౌందర్యము శారీరక దారు ఢ్యము, రంగు ఆరోగ్యమువంటి శారీరక లక్షణాలు మరియు పరిస్థితులు పరిసరాలు, అసమానతలకు తోడ్పడుతున్నాయి. కులం మతం వర్ణం ఇవి వ్యత్యాసా లేర్పరుస్తున్నాయి.

23) ఆలోచన వివేచన సక్రమ నిర్ణయం, శిక్షణ సామర్థ్యం పట్టుదల స్వయంకృషి, అవకాశాల సద్వినియోగం, అననుకూలతలలో సైతం రాణించగల వ్యక్తిత్వంవంటి వాటివల్ల- దురాశ దుర్బుద్ధి దుశ్చేష్టలు నేర స్వభావంవంటి వాటివల్ల - కారణాలేవైనా తాము చేసే పొరపాట్లు తప్పుల

వల్ల-దురలవాట్లు దుర్వ్యసనాలువల్ల; పై విధంగా తామేర్పరచుకున్న ప్రవర్తనా రీతిచే, తదనుగుణమైన జీవితం లభ్యమవటంచే, అసమానతలు ఏర్పడుతున్నాయి.

24) దేశంలోని వనరులను వినియోగించుకోవటం, వినియోగించుకోలేక పోవటంబట్టి అధిక జనాభానుబట్టి, అభివృద్ధి దిశగా మరలటమో దారిద్ర్యపు దిశగా మరలటమో ఉంటుంది. ప్రభుత్వాలకు వ్యాపించిన శక్తిసామర్ధ్యాల వల్ల, దేశంలోని ప్రజలు బీదవారవుతుంటారు. అవసరాలు తీరక అవస్థల పాలవుతుంటారు.

25) ఆస్తి-అంతస్తు ఒక కాంక్ష. ఈ కాంక్షాసక్తిపై నిరంతర తాపత్రయం అందరికి ఉంటోంది. అనవసరమైన ప్రాముఖ్యతను వీటికి ఇవ్వటంవల్ల, ఎవరికి సాధ్యమైన రీతిలో వారు సమకూర్చుకుంటున్నారు. ఏ స్థాయిలో ఎవరికి ఎన్నెన్ని ఆస్తులు ఉంటున్నాయో, వాటినిబట్టి హెచ్చు తగ్గులు స్పష్టంగా కన్పిస్తున్నాయి. కాంక్షాసక్తులకు ఇచ్చే ప్రాధాన్యతను, వ్యక్తిత్వ వికాసానికి ఇవ్వనందువల్ల; సామాజిక అవగాహన లోపించటంచే, ఉండకూడని అసమానతలను ఎదుర్కొలేని వారయ్యారు.

# జీవుడు

1) మతభావనరీత్యా ఈ మానవ విగ్రహాన్ని జీవుడు నడుపబట్టి, మనిషి చేసే తప్పొప్పులకు పరలోకంలో శిక్షలను అనుభవిస్తోంది. మోటారుకారు శరీరమైతే, డ్రైవరు జీవుడు కావాలి. డ్రైవరు ఆదేశించినట్లు కారు నడుస్తుంది. రోడ్లు మార్గాలు గమ్యము ఆలోచన డ్రైవరు అధీనంలోవి. ఎక్కడ ఆపాలంటే అక్కడ ఆపగలడు. ఎప్పుడు ఎక్కడికి బయలుదేరాలంటే, అప్పుడు అక్కడికి చేరగలడు. తాననుకున్న రీతిలో ప్రయాణాన్ని, ప్రయాణమార్గాన్ని మార్చుకోగలడు. డ్రైవరు ఆదేశించినట్లు కారు నడుస్తోంది కాబట్టి ప్రయాణంలో ఏమి జరుగుతున్నా, కారుది బాధ్యత లేదు. డ్రైవరువలె జీవుడు శరీరాన్ని నడిపిస్తుంటే, మనిషిచేసే పాపపుణ్యాలన్నింటికి జీవుడు బాధ్యుడు.

2) నిద్రలేచింది మొదలు నిద్రించేవరకు, ఏ విషయంలోనైనా ఎలాంటి సంఘటనలలోనైనా, మనిషి తనకు తానై ఆలోచిస్తూ కార్యాచరణకు ఉపక్రమిస్తున్నాడా? లేక జీవుని ప్రమేయం ఉంటోందా ? మనిషి శరీరంపై ఆలోచనలపై నిర్ణయాలపై, జీవుని ప్రభావంఉందని నిరూపణ అవుతోందా? మనిషిపై అధికారము అదుపాజ్ఞలు నియంత్రణ వంటివి ఉన్నాయో, లేదో ఎవరి జీవితం వారికే సాక్ష్యం.

5)

3) ఎవరో చెప్పి చేయిస్తున్నట్లు మనిషి తన పనులను చేసుకుపోతుంటే, జీవుని ప్రమేయం ఉన్నట్లు, లేకుంటే లేనట్లు. ఒక దొంగతనం చేయబోతే, కాళ్ళు చేతులు మనస్సు ఏది పని చేయకుండా స్తంభించిపోవాలి. ఒకహత్య చేయబోతే ఎత్తినచేయి ఎత్తినట్లే నిలచిపోవాలి. ఎదైతే జీవునికి చేయటం ఇష్టం ఉండదో, అలాంటి ఇష్టంలేని పనులన్నింటిని నిరోధించేశక్తి జీవునికి ఉండాలి. శరీరాన్ని అదుపుచేసే శక్తి ఉన్నప్పుడు, శరీరం చేసెడి ప్రతి తప్పొప్పుకి జీవుడు బాధ్యుడవుతాడు. అలాంటిది లేదు గనుక, మనిషి చేస్తున్న పాపపుణ్యాలకు జీవుడు బాధ్యుడుకాదు. దీనిచే పరలోక భావన అసత్యమని తెలుస్తోంది.

4) జీవుడు శరీరంలో ప్రవేశించినప్పుడు ప్రాణం వస్తోంది అనుకుంటే, ప్రాణం వచ్చేయటంవల్ల శరీరంలోని ప్రతి అవయవము పనిచేస్తోంది. ప్రాణం జీవుడివలనే ప్రాప్తించినా, కళ్ళు, నోరు, జీర్ణాశయం గుండె ఊపిరితిత్తులు మెదడు వంటివన్ని, వాటి పనులను అవి చేస్తున్నాయి. కళ్ళ ద్వారా చూసిన దానిని, చెవుల ద్వారా విన్న దానిని, మెదడు గుర్తుంచు కుంటోంది. ఏపని చేస్తుంటే ఆ పనిని గుర్తుంచుకుంటోంది. కాబట్టి ఏవైనా చేయకల్గుతున్నాం. ఇదంతా మెదడుయొక్క పని. ఏ పనికైనా ఆలోచన నిర్ణయం ఉండాలి కాబట్టి, ఎవరు ఏ పనులు చేస్తున్నా, ఇవన్ని శరీరాలవి అవుతున్నాయి. ఇందువల్ల మనుష్యులు చేసే పనులకు, జీవుళ్ళ బాధ్యత లేదు. పాపపుణ్యాల సంబంధం జీవుడికి లేదు. జీవుడు చేస్తున్నదంతా ప్రాణం కల్గించటమే. దీనిచే పరలోక నమ్మిక అబద్ధమని తెలుస్తోంది.

5) శరీరంలో ప్రాణం ఉండేందుకే కాకుండా, ఏది చేయవచ్చునో ఏది చేయకూడదోనన్న విచక్షణను జీవుడు అందిస్తున్నాడు అని అనుకున్నా, జీవుడు చెప్పినట్లు మనిషి ప్రవర్తించటంలేదు కాబట్టి, జీవుడికి పాప పుణ్యాలు లేవు.

6) శరీరంలో దైవాంశ ఉండబట్టి, మనిషి బ్రతక కల్గుతున్నాడు అని అనుకుంటే, మరణం తదుపరి శరీరం నశిస్తుంది. దైవాంశ దేవునితో ఐక్యమవుతుంది. దీనివల్ల పరలోక సంబంధితమైన స్వర్గనరకాలు కల్పితమని తెలుస్తుంది.

7) ఒక స్త్రీని ఎందరో మానభంగంచేసి, చిత్రహింసలు పెట్టడంచే మరణించింది. ఇస్తానన్నంత కట్నం ఇవ్వలేదని ఒక యువతిని దారుణహింసకు గురిచేయటంచే మరణించింది. సాక్ష్యాధారాలు లభించలేదు. శరీరం మరణించింది కాని, జీవుడు బ్రతికి ఉన్నాడు కదా ! ఎవరీ నేరం చేసింది, సాక్ష్యం ఇవ్వలేని జీవుడిగూర్చి భ్రాంతి ఎందుకు? 2. ఉద్యోగి తన యజమాని చెప్పినట్లు చేశానంటాడుగాని, తానే అంతా చేస్తున్నానని అనడుకదా! జీవుడు చెప్పి చేయిస్తుంటే, జీవుడు చెప్పి చేయిస్తున్నట్లు తెలిసేదిగా ! జీవుడు అంతా చేస్తుంటే, శరీరంయొక్క ప్రసక్తిని రానిచ్చేవాడా ? ప్రతిది నేనే చేస్తున్నాను, అని ఎలా అనుకొని ఉండకలిగేవారు ? 3. శరీరంపై ఈగ వాలినా దోమ వాలినా తెలిసిపోతుంది. జీవుడంటే ఆ జీవుడు ప్రతి పనిని చేయిస్తుంటే, ఒకనికి జీవుడు ఉన్నాడన్న స్పృహ లేకుండా ఎలా ఉంటుంది? 4. జీవుడికి మతం ఇచ్చే ప్రాధాన్యత ఉంటే. నేను అనేటి స్పృహ శరీరానికి కాకుండా, జీవుడిని నేను అన్న స్పృహతో ప్రతి పని సాగేది. 5. తాను శరీరంకాదు. తాను జీవుడిని అన్న స్పృహ మనిషికి కల్గుతుంటే, జీవుడు ఉన్నాడా? లేడా? అన్న ప్రశ్న తలెత్తేది కాదు. ప్రతివాడు తాను శరీరాన్ని కాక, జీవుడిని అనుకునేవాడు. 6. శరీరం యొక్క అంతర్నిర్మాణము గురించి జీవకణాలు చేసే పనులు గురించి తెల్సుకోనందువల్ల, శరీరం జీవునిచే నడుపబడుతోందన్న నమ్మిక బలపడింది. 7. మనుష్యులవలె అవసరాలను కోరికలను జంతువులు నెరవేర్చుకోలేక పోవటంవల్ల, శరీరంలో జీవుడు ఉండబట్టే ఇలా జరుగుతోందన్న భ్రమకు స్థానం ఏర్పడింది. 8. కోతికి మనిషికి తేడా ఏమిటి? కోతికి ఉన్న రూపం

వేరు. మనిషికి ఉన్న రూపంవేరు. మనిషి వంటి మెదడు కోతికిలేదు కాబట్టి, మనుష్యులకువలె కోతులు ఏమి సాధింపలేక పోతున్నాయి. ఆలోచింపగల విశిష్టతగల మెదడును దేవుడు రూపొందించటంచే, మానవ శరీరం జీవుడిపై ఆధారపడిలేదు. ఆలోచనను ఆపివేయగల శక్తి, జీవునికి లేకపోవటంచే జీవుని ప్రభావం అన్నది అసత్యము.

8) ఆలోచించటం నిర్ణయించటం కూడా జీవుడే చేస్తున్నాడు, కోరికలు కాంక్షలు అన్ని జీవుడివలననే అని అనుకుందాం. కనీస అవసరాలు కనీస కోరికలు మానవులందరికి నెరవేరుతుంటే, పాపాలు చేయవలసిన పని ఏముంటుంది? పాపాలు చేస్తున్నారంటే, అవసరాలు నెరవేరటంలేదు. ఇవి అందరికి లభ్యపరచకుండా పరలోకంలో శిక్షించటం అన్యాయం కాబట్టి దేవుడిది తలపెట్టనిది.

9) భవంతులు కార్లు పొలాలు ఫ్యాక్టరీలు ఇలా ఆస్తులు కూడబెట్టే అవకాశము, అధికంగా ఆర్జించే అవకాశము, తప్పుడు పనులుచేసే అవకాశము, తప్పుడు కోరికలు తీర్చుకునే అవకాశము, తప్పుడు ఆలోచనకు తప్పుడు నిర్ణయాలకు అవకాశము, మనం జీవిస్తున్న సమాజంలో నెలకొని ఉంది. ఈ తప్పుడు అవకాశాలవల్ల, జీవుళ్ళ ఆలోచన నిర్ణయం తదనుగుణమైన పనులు పాపాలు అవుతున్నాయి.

10. మనుష్యులను నియంత్రించలేని సమాజంవల్ల, మనుష్యులను నియంత్రించలేని పరిపాలనవల్ల, పాపాలు చేయటం ఉంది. పాపాలకు కారణం నియంత్రణలోని లోపాలుకాని, జీవుళ్ళుకాదు. జీవుళ్ళు పాపాలు చేయకుండా, పాపాలు జరగనట్టి సమాజాన్ని పరిపాలనను ఏర్పరచితే, ప్రపంచంలో దుష్టత్వం ఉండదు. ఇట్టి ధర్మయుక్తమైన కార్యాచరణను వదలి, పాపాలు చేశారని నరకయాతనలకు గురిచేస్తారా దేవుడు? జీవుళ్ళను అపసవ్య మార్గంలోకి కొనిపోతూ, పాపాలు చేయిస్తున్న వాటిపై, దేవునికి

ఆగ్రహం ఉంటుంది కాని జీవుళ్ళపై కాదు. దీనిచే పాపపుణ్యాలు ఆధారంగా ఫలితాలు అబద్ధమని అర్థం చేసుకోవచ్చు.

11) పరలోక చింతన పెరగటానికి కారణం జీవుడు. జన్మ ఉన్నా లేక లేదని నమ్మినా జీవుడంటూ ఉన్నాడని నమ్మటంఉంది. జీవుడు ఉన్నాడన్న నమ్మకను కొనసాగించు కోవటమేకాని, ప్రత్యక్షంగా పరోక్షంగా ఎలాంటి సాక్ష్యాధారాలు లేవు. జీవుడు లేడు అనుకుంటే, కల్గుతున్న కష్టం ఎదీ లేదు. మనిషి ఎదుర్కొనెడి కష్టనష్టాలలో జీవుని తోడ్పాటు, ఏది లేక పోవటంచే జీవుడి గూర్చిన ఆలోచన అనవసరం.

12) పుట్టుక జీవించుట మరణించుట అనేవి శరీర ధర్మాలు. జీవుడనే వాని సహకారం ఏదీ లేకుండా, మనిషి జీవిస్తున్నాడు. నేనే శరీరమును అన్న యథార్థాన్ని నమ్మితే, మత భావనలు నశిస్తాయి. మరణం తదుపరి ఏమి లేదనెడి దానికన్నా, మరణానంతర జీవితం అని నమ్మించి అదుపు చేయవచ్చని, పరలోక భావనలను ప్రవేశపెట్టారు.

13) శరీరావయవాల అంతర్నిర్మాణం అవి పనిచేసే విధానంబట్టి, జంతువుల శరీరం వంటిదే మానవుల శరీరమూను. మెదడు కళ్ళు జీర్ణాశయం గుండె రక్తం వంటివి మనుష్యులకు మాత్రమే పరిమితమైనవి కాక, జంతువులకు ఉన్నాయి. జంతువు శరీరంలోనైనా మనిషి శరీరంలోనైనా జరిగే జీవప్రక్రియలు ఒకటే. చెట్టు మనిషికివలె, జంతువు శరీరం మనిషి శరీరం వేర్వేరుకాదు.

14) మెదడుయొక్క విశిష్టతతోబాటు, శరీర నిర్మాణం, నాగరికతకు అనుకూలమైనదిగా రూపొందటంవల్ల; జంతువులు పొందలేని విశ్రాంత జీవనాన్ని మనుష్యులు పొందకల్గుతున్నారు. ఈ ఒక్క తేడావల్ల జంతువుల వలెనే పుడుతూ మరణించక, బ్రతికిన కాలంలో సౌకర్యాలను అనుభవాలను పొందకల్గుతున్నాం. ఈ నాగరికత అంతా అద్భుతం. దీని ఫలితమే నేటి

మనస్సు. ఈ గతాన్ని వదలి మనస్సుకు కారణం జీవుడని అనుకోవటం వల్ల, ప్రాణంతోబాటు మనస్సుకు కారణం జీవుడన్న భ్రమకల్గుతోంది. వాస్తవంనుండి భ్రమను విడగొట్టు కోకుంటే, జీవుని వలననే అన్న నమ్మకం తొలగదు.

15) జీవుడుఉన్నా, జీవుడు ఉందని జరిపే కర్మకాండ జీవునికి అవసరం లేనప్పుడు, ఇదంతా నిరర్థకం. మనిషి అవసరాలు జీవుని అవసరాలు వేరయినపుడు, మనిషి చేసెటి పనులు జీవునికి ఉపకరించనివి.

16) లక్షల సంవత్సరాలనుంచి, మనుష్యులు మరణిస్తూనే ఉన్నారు. కోటానుకోట్ల జీవులకు అవసరాలు ఉంటే, వాటి అవసరాలను ఈ ప్రకృతి నుంచి తీర్చుకునేవి. అలా తీర్చుకోవటంలో ఖర్చయిపోయిన వాటిని పరిశీలిస్తే, వాటి అవసరాలు తెలిసేవి ప్రకృతిలో ఉండే ఫల వృక్షజాతుల ఫలాలు మన చేతికి అందేవికావు. మానవులవంటి కోరికలు ఉంటే, మానవులపై ఒత్తిడి చేసైనా తీర్చుకునేవి. అలా వాటి కోరికలు తెలిసేవి. ఇది లేదు.

17) జీవుళ్ళకు అవసరాలు కోరికలు ఉంటే, వాటిని సాధ్యపరచుకునే ప్రయత్నం చేసేవి. ఆ విధంగా వాటిగూర్చి తెలిసేది. ఒకరు బ్రతికి ఉన్నంత కాలంలో ఒక్కసారైనా, జీవునికున్న అవసరాలు కోరికలు ఏమిటో మనిషికి తెలియజెప్పక పోవటంతో, వాటికి అవసరాలు కోరికలు లేకపోవాలి లేదా మనం తీర్చలేని అవసరాలు కోరికలు అవటంచే చెప్పక పోవాలి. దీనిచే మనం చేయాల్సింది ఏదిలేదు.

18) మనిషి బ్రతకటంలోగాని, నిత్య వ్యవహారాలలో పాల్గొనటంలో గాని, జీవుని ప్రమేయం ఏదిలేదు. జీవునికి శరీరానికి మధ్య పరస్పర సహకారంగాని, పరస్పర సంబంధంగాని ఏదీలేదు. ఇదే గనుక ఉంటే, అది ప్రతిమనిషి అనుభవంలోదే అయ్యేది. ఇది లేదంటే జీవుడు వేరు, శరీరం

వేరు. మానవులనుండి ఏమైనా ఆశిస్తుంటే, అవేమిటో తెలిసేయి. ఏమీ ఆశించని ఏ అవసరమూలేని జీవుళ్ళ పేరిట, వ్యర్థమైన కర్మకాండ పిచ్చి పని. వాటిపేర మనం చేస్తున్నదంతా, మనం అలా అనుకొని, అలా చేస్తున్నది మాత్రమే.

19) జీవుళ్ళకు మరణం లేదంటే, ఎంతో గతానుభవం ఉండి తీరాలి. దీనిచే అజ్ఞానం అవివేకం జీవుళ్ళకు ఉండదు. కాబట్టి జీవితం గూర్చి మానవులు పడే భ్రమ వాటికుండదు. తెలివితక్కువ కోరికలను ఆచరణలను అపేక్షించి, ఆ ఆచరణలో నరకాన్ని ప్రాప్తించుకోవు. భ్రమాన్వితమైన ఈ ప్రపంచపు వినోదంలో, కోరవలసిందేమిలేదని ఆలోచిస్తే తెలియనిదా ?

20) గతానుభవం ఎంతో ఉందనుకుంటే, అవి ఉన్నతంగా జీవించాలి. గతానుభవం జీవుళ్ళకు ఉంటే, అజ్ఞానాంధకారాలతో అపరిష్కృత సమస్యలతో నేటి ప్రపంచం ఉండేదా ? సాంఘిక పరంగా అశాంతి ఉండేదా ?

21) జ్ఞానానికి అజ్ఞానానికిగల వ్యత్యాసమువల్లనే నాగరికత అనాగరికత ఏర్పడుతుంది. నాగరికంగా జీవించవద్దని, అనాగరికంగా జీవించమనేది దేవుని నిర్ణయం అవదు. అంటే జీవుళ్ళకు గతానుభవాన్ని తొలగించి, ఏమి తెలియని అజ్ఞానంలోకి నెట్టివేసి ఉండటంవలనే, మనుష్యులకు ఏమీ తెలియని స్థితి ఉంటుందనేది అబద్ధం. జీవుడు లేనందువలనే, నేర్వకుంటే ఏది తెలియనిస్థితి ఉంటోంది. జీవితంలో పరిపాలనలో జీవుళ్ళ ప్రమేయం ఏది లేకపోబట్టే, నేడిలా ఉంది. లేకుంటే జీవుళ్ళకుండే గతానుభవం ఈపాటికే భువిపై స్వర్గాన్ని నెలకొల్పేది. ఈ భువిని స్వర్గతుల్యంగా రూపొందుకోనీయకుండా, జీవుళ్ళ జ్ఞానాన్ని దేవుడు తొలగించరు. దీనిచే మనిషిని నడుపుతున్నది శరీరంకాని, జీవుడుకాదని గుర్తెరగవచ్చు.

22) జీవితానికి సంబంధించిన ఇతివృత్తం అయిన సినిమాలలో, పాత్ర

దారులు ఎందరో, ఎందరికో చెడు చేస్తుంటారు. ఎందరో హతమవు తుంటారు. ఇలాంటి చెడు చేశారని న్యాయవిచారణ శిక్షలు విధించే వారుం టారా? 2. పిల్లలు మట్టిబొమ్మలతో ఎన్నో ఆటలు ఆడుకుంటారు. ఆ ఆట లలో ఎన్నింటికో హాని జరుగుతుంది. ఇట్టి హాని జరిగిందని పిల్లలకు నరకంవంటి శిక్షలు విధించే వారుంటారా? 3. పిల్లలు ఏవో తగాదాలు పడుతుంటారు. ఇలా తగాదాలు పడ్డవారే తిరిగి కలసిపోతుంటారు. ఇవెలా పట్టించుకోదగ్గవి కావో, అలాగే జీవుళ్ళుచేసే పనులు అట్టివే. జీవుడినే నేను అని, అనుకుంటున్నాం కాబట్టి, శరీరం ఒక మట్టిబొమ్మ. అప్పుడు జీవుళ్ళు మట్టిబొమ్మలవంటి శరీరాలతో జీవితం గడుపుతున్నట్లవుతుంది.

23) జీవుళ్ళు ఏ విధంగా ఎంత సంపాదించినా, ఇదంతా సమాజానికి వదిలేసి పరలోకం చేరుకుంటున్నారు. అందుచే మోసగించినా, నీతిని విస్మ రించినా ఇవి తప్పుల క్రింద రావు. ఒకరిని మరొకరు హత్యజేసినా నేరం కాదు. ఎందుకంటే జీవుడు మరణించుటలేదు. జీవుళ్ళ శరీరాలు వేరు. ఇవి మానవ శరీరాల లోపల ఉంటున్నాయి. కాబట్టి వీటి కెలాంటి హానిలేదు. అందుచే ఒకరు మరొకరికి చేస్తున్న దారుణం ఏదిలేదు. ఆయువును నిర్ణ యించిన మేర, భూమిపై గడుపుతున్నారంతే.

24) జీవుళ్ళు పరలోకంనుంచి వచ్చాయి, తిరిగి పరలోకం చేరుకుంటు న్నాయి. ఈ మధ్యకాలంలో ఏవో కొన్ని అనుభవాలను పొందాయి. శరీ రాలు పొందుతున్న కష్టాలు జీవుళ్ళు పొందుతున్నవికావు. జీవుళ్ళు శరీరా లలో జేరి, శరీరాలకు ప్రాణంపోసి, పరస్పరం వినోదిస్తున్నాయి ఈ వినో దంలో ఎవరు ఎవరికి ఏమి హాని, చేసినట్లవదు. కాబట్టి తప్పులకు శిక్షిం చటం, ఒప్పులకు స్వర్గాన్నివ్వటం, ఏది సరైనదికాదు కాబట్టి స్వర్గ నర కాలు కల్పన.

25) మనుష్యులు బ్రతకటానికి తిండి బట్టలు నీరు మందులు వంటి అవ

సరాలు లేవనుకోండి. ఆ స్థితిలో ఏ మనిషి వేటికోసము తపించడు. వేటి కొరకు శ్రమించడు. ఆ అవసరాలు లేవు. ఆ అవసరాలు లేకున్నప్పుడు పట్టించుకోరు, ప్రయత్నించరు, కోరరు, అనుభవించరు, ఏవి ఉండవు. జీవుళ్ళకు ఉన్న స్థితి ఇట్టిది. దీనితోబాటు మరణంలేదు. మరణంలేదు, అవసరాలు లేవు. ఈ రెండూ లేనపుడు జీవుడికి ఏమి జరిగినా పట్టించుకోవలసింది లేదు. ఈ కారణాన జీవుళ్ళు ఏమిచేశారు, ఎలా జీవించారు అనేది దాని గూర్చి దైవం పట్టించుకోరు. ఎందుకని? ఆ జీవితం జీవుళ్ళకు కలల వంటివి.

26) జీవుడికయితే ఈ జీవితం కల, కాని శరీరానికి కాదు. మనం కలలో ఎలాంటి సంఘటనలు జరుగుతున్నా ఎలా పట్టించుకోమో, మనకు కల ఎలా వినోదమో అలాగే, జీవుళ్ళకు మానవ జీవితం కలవంటి వినోదం కాబట్టి, జీవుళ్ళకు మంచి చెడు- ధర్మం అధర్మం-నీతి అవినీతి - సత్యం అసత్యం ఇవేమి ఉండవు. జీవుళ్ళకు వీటి పరిధి ఉండదు. వీటి హద్దులు లేనప్పుడు పాపపుణ్యాల ప్రసక్తిలేదు. ఇవి లేక స్వర్గనరకాలు లేవు.

27) శరీరానికి కల వినోదమే కాని, జీవితం కలవంటిది కాదు. ఏ క్షణంలో ఏ నిమిషంలో ఏది జరిగినా, స్పందన ప్రతిస్పందన తప్పనిసరి. జీవుడికి లేని మరణం శరీరానికి ఉంది. జీవుడికి లేని అవసరాలు శరీరానికి ఉన్నాయి. తిండి బట్ట నీరు వసతి తప్పనిసరయ్యాయి. దీనిచే కావాలనేది పోరాటం సిద్ధమైంది. మరణంనుంచి నిరంతర రక్షణ అవసరమయ్యింది. శరీరపోషణ అవసరమయ్యింది. పుట్టే ప్రతివానికి ఇవి తప్పనిసరి. కాబట్టి ప్రతిఒక్కడు రక్షణ సంరక్షణ కావించుకుంటాడు. ఇంతేకాకుండా మనిషికి కోరికలు ఉన్నాయి. ఈ కోరికలు తీర్చుకోవటం కొరకు పోరాడతాడు. అందుచే జీవితం ఒక పోరాటం అయ్యింది. జీవితమంటేనే సంఘర్షణ అయ్యింది. ఇదంతా మరణము అవసరాల కోరికలువల్ల ఏర్పడిన స్థితి.

28) జీవునికి వలె శరీరం బ్రతకదు. బాల్యం యౌవ్వనం వార్ధక్యంతో మరణిస్తుంది. అందరికి ఇవి తప్పవు. మరణానికి ముందుకాలం జీవితం. బ్రతికేది స్వల్పం. ఈ స్వల్పకాలంలో అశాంతి ఆందోళన లేనట్టి జీవితాన్ని లభింపజేస్తే అందరూ సంతోషిస్తారు. జీవుడికివలె శాశ్వతత్వం లేకపోబట్టి, ఈ స్వల్పకాల జీవితమే శరీరానికి ఉన్న అవకాశము. ఈ పరిమితకాలం కష్టంతో దుఃఖంతో గడిస్తే, ఆ మనిషి అలా మరణించినట్టు. ఒకడు బ్రతికిన కాలం కష్టంతో ముగిసినట్లు. జీవుడికి అలాలేదు. ఇలాంటి స్వల్పకాలం కాకుండా, మనం లెక్కించలేనంత జీవితం ఉంది. కష్టం అనేది జీవుడు అనుభవించినా, తదుపరి ఆనందం సాధ్యము. గతంతో పనిలేదు. ఎందుకంటే మరణంలేదు. శరీరానికి అలాకాదు. కాబట్టి మానవ శరీరాలు జీవించినంత కాలం సంతోషంగా జీవింపజేయటం ముఖ్యం. ఒకే ఒక అవకాశం ఉంది. ఈ అవకాశమైనా సంతోషంతో ముగియాలి. అలాంటి సంతోషకర జీవితం లభ్యపరచేందుకే హద్దులు నియమాలు నియంత్రణ. నీతి అవినీతి, ధర్మం అధర్మం, మంచి చెడు మొదలగునవి శరీర సంబంధము. ఈ విభజన లేకుంటే, ఏ నిమిషంలో ఎవరు మరణిస్తారో, ఎవరిని ఎలాంటి దుఃఖం పీడిస్తుందో తెలియదు. కాబట్టి నియమానుసార జీవనం తప్పనిసరయ్యింది.

29) ఒకరు చేసిన నేరంవల్ల, ఒకరు హఠాత్తుగా జీవితాన్ని కోల్పోవచ్చు. ఒకరు చేసిన నేరంవల్ల ఒకరు తీవ్రంగా దుఃఖిస్తుండవచ్చు. ఇలాంటివి లేకుండా చేయాలి. మరో మనిషివల్ల ప్రాణాపాయం తదితర కష్టాలు లేకుండా చేయాలి. అప్పుడు మరణంనుంచి రక్షణ ఏర్పడుతుంది. తమ అవసరాలను ధర్మబద్ధంగా తీర్చుకుంటారు. దీనిచే ఒక శరీరం ఎంతవరకైతే బ్రతకకలదో, అంతవరకు జీవించటం సాధ్యపడుతుంది ఇట్టి జీవితం శరీరానిది. ఈ మానవశరీరం కొరకే మంచి చెడు, నీతి అవినీతి, కష్టరహితమైన జీవితం మనుష్యులకు కల్గించాలంటే, అందరు న్యాయంగా

మనుగడ సాగించాలి. ఇట్టి మనుగడ సాధ్యపడాలంటే, మంచి చెడులను పాటించాలి. ఈ మంచి చెడులను పాటింప జేసేందుకు ప్రభుత్వాలతో బాటు, మతాలు తమపైన మత భావనలు ప్రవేశపెట్టి, మనుష్యులను సన్మార్గం లోకి నడిపించే ప్రయత్నం చేశాయి. జీవుడిని ఆధారం చేసుకోకుంటే. పాపపుణ్యాలు పరలోకం వంటివేవి సాధ్యపడవు. కాబట్టి మనంచేసే ప్రతి పనియొక్క మంచి చెడులకు జీవుడ్ని బాధ్యుడిగా చేసి, పరలోక చింతన లోకి నెట్టారు. జీవుడు ఉన్నాడా లేడా అనేది సమస్యకాదు. జీవుడి పేర మతాలు ప్రవేశపెట్టినవి, నిజాలు అవునా కాదా, అని తెల్సుకుంటే అపోహాలు తొలగుతాయి.

30) జీవుడు అన్న భావన ఉండాలి అనుకుంటే, ఈ అర్థానికి మించిన ప్రాధాన్యత అనవసరం. మానవుల జీవుళ్ళ అవసరాలు కోరికలు వేర్వేరు. జీవుడు వేరు, శరీరం వేరు. మానవుని దేహం జీవునికి భవంతి వంటిది. నివాసయోగ్యమైన భవంతులలో మానవులు నివసిస్తున్నట్లుగా జీవుళ్ళు శరీరాలలో నివసిస్తున్నాయి. తాము నివసిస్తున్న మానవ శరీరాలు మరణించిన తదుపరి, వేరే దేహాలలోకిగాని, మరెచ్చటికోగాని వెళుతున్నాయి.

# 5. పరలోకము

1) పరలోకంలో పాపపుణ్యాలకు ఫలితాలను ఇస్తుంటే, ఏవి పాపమో ఏపాపాలకు ఎలాంటి శిక్షలు ఉన్నాయో, ఏవిపుణ్యమో ఏ పుణ్యాలకు ఎలాంటి ఫలితాలున్నాయో, తెలియజేసే పట్టిక పరలోకంనుంచి రాకుంటే మనకు ఎలా తెలుస్తుంది? ఒకప్పటి జీవిన విధానం నేడులేదు. మారిన దేశ కాల పరిస్థితులను బట్టి ఏదిచేస్తే పాపమవుతుందో, ఏదిచేస్తే పాపంఅవదో వివరణ ఇవ్వాలి. ఏవైనా మార్పులు ఉంటే అవి తెలియ జెప్పాలి. ఏవి తప్పో ఏవి ఒప్పో మనకు తెలియ జేయకుంటే, ఏవిచేయవచ్చునో ఏవి చేయకూడదో తెలియదు. ఏవి తెలియజెప్పక శిక్షలు విధించటం ఎలా సమంజసం?

2) ఎవరినైనా ఎందుకు శిక్షించాలి? ఇతరులకు కష్టనష్టాలు కల్గించకుండా ఉండేందుకు. సక్రమమార్గంలో నియంత్రించేందుకుకదా, పాపాలకు దండన విధించాలి. శారీరకంగా మానసికంగా ఇతరులను వ్యధల పాల్జేయని నడవడికను సాధించలేని న్యాయవిచారణ పాపపుణ్యాల లెక్కింపు నిరర్ధకం. పాపాలు చేశారు కాబట్టి నరకంలో శిక్షలకు గురిచేయటం అనేది సరికాదు. స్వర్గనరకాలు ఏ ప్రయోజనాన్ని ఆశించి ప్రవేశపెట్టబడినవి? దేవుని వినోదం కొరకా? మానవాళి ప్రయోజనంకొరకా? మానవులకు ప్రయోజనం చేకూరాలంటే, పరలోకంతో బాటు పరలోక సిబ్బంది స్వర్గనరకాల ప్రదే

శాలు కొందరికయినా కన్పించాలి. అప్పుడది హెచ్చరికగా ఉండేది. సరైన ప్రవర్తనకు దోహదపడేది. ఇలాగ లేకపోవటం బట్టి ఇది కల్పన ఎందుకు కారాదు?

3) లేని అంతిమతీర్పు లేని స్వర్గనరకాలు, ఇలా లేనివాటిపై సాక్ష్యాధారాలు వుండవు. లేనివాటిని ఉన్నవని నమ్ముతున్నాం. యదర్థానుభవంతో నమ్మింప జేసినవి కాదు. ఊహించినవి లేదా ప్రయోజనం కొద్దీ నమ్మించినవి. లేనివాటిని లేనివిగా గుర్తించాలంటే, తర్కరీత్యా విషయాలను అర్థం చేసుకోవాలి లేదా సైన్సుదృష్ట్యా అర్థం చేసుకోవాలి. ఈరెండు విధాలను వదలివేస్తే అబద్ధాలు అబద్ధాలుగా స్పష్టపడవు.

4) ప్రయోజనం నిష్ప్రయోజనం, సంభవం అసంభవం, అనేవి ఉంటాయి. ఇవిమరచి గ్రుడ్డిగా విశ్వసిస్తే అజ్ఞానం తొలగదు. తమ వివేచనలో తెలివితక్కువ పనులు అని స్పష్టపడితే, వాటిని ఎవరూ చేయరు. అసంభవమైన వాటి అమలుఉండదు. నిరర్థకమైనవి మనమే చేయ తలపెట్టము. అలాగే దైవము చేసేవి చేయనివి, సాధ్యపడేవి సాధ్యపడనివి ఉంటాయి.

5) గతం ఎలాగడిచినా దానితాలూకూ కష్టనష్టాలను మరస్తూ, భవిష్యత్తయినా సుఖప్రదంగా ఉండాలని ఆశిస్తాం. మనమే గతాన్ని మరచిపోతుండగా, వందలు వేలు లక్షల సంవత్సరాల క్రింద మరణించిన వారందరి పాపపుణ్యాల గతం దేవునికి పట్టిందా?

6) ప్రతినిమిషము వేలకొలది జనాభా మరణిస్తున్నారు. ఈ మరణిస్తున్న వారందరి పాపపుణ్యాల గ్రంథాలు దేవునికి పరిశీలించటంకాని, న్యాయవిచారణ జరపటంకాని ఎలాసాధ్యం? ఒక్కనిమిషం పరిస్థితే ఇలావుంది. నిమిషాలు రోజులు సంవత్సరాలు దాటి, లక్షల సంవత్సరాలలో కోట్ల సంవత్స

రాలో గడచిన తదుపరి, ఈ అసంఖ్యాక జీవుళ్ళ అసంఖ్యాక పాపపుణ్యాల గ్రంధాలు, పరిశీలన తీర్పు ఎలా సంభవం?

7) పుట్టేవారు పుడుతున్నారు. మరణించేవారు మరణిస్తున్నారు. ఇలా కాలం గడుస్తూంది. ఇలా ఎంతకాలం గడచిన తదుపరి అంతిమ తీర్పు? వంద లేక వేలు లేక కోట్లకొలది సంవత్సరాల క్రిందట చేసిన పాపాలకు, దేవుడు విచారణ జరిపి ఏమి సాధిద్దామని? పాపులు మరణించడం తోనే, వారిపీడన నుండి ఇతరులు విముక్తులు అవుతున్నప్పుడు, ఈ పాపులను శిక్షించినా శిక్షించకపోయినా ఒకటే. పాపాలను పాపులను నిరోధించేశక్తి, విచారణ శిక్షలవల్ల కల్గుతుంటె, అదికదా ప్రయోజనకరం.

8) మతరీత్యా పాపపుణ్యాల లెక్కింపు కథాంశము. పట్టణ నగరాలంతా క్రిక్కిరిసిన జనాభా. రోజుకి 24 గంటలున్నా చాలక, పనులను త్వర త్వరగా ముగించాల్సివుంటోంది. కొందరికయితే తీరికగా తినటానికికూడా సావకాశం లేనంత పనుల వత్తిడి. ఇలాంటి పనులలో పాల్గొనే ప్రజానీకం ఎవరెక్కడ ఏమేమి చేస్తున్నారో, ఇదంతా గమనిస్తూ, పాపపుణ్యాల నిర్ధారణ చెయ్యాలంటె ఇదసలు సాధ్యపడే విషయమేనా? వందలకోట్ల జనాభా ప్రతిరోజు చేస్తుండే పాపపుణ్యాల లెక్కింపుకు, వందలకోట్ల పరలోక సిబ్బంది పని చెయ్యకుంటే.ఈ పాపపుణ్యాల లిఖితం సంభవమా? ఇదెంత అవిశ్రాంతిగల భారమైన పని? రోజు ఇలా చేస్తున్నా, రోజూ ఇలా పని వుంటుంటే? ఇలా ఓపికతో ఎంతకాలం పరిశీలిస్తుండాలి? ప్రపంచజనాభా పాపపుణ్యాల నిర్ధారణ పరలోక విచారణ, ఎంతటి నిష్ప్రయోజనమైనపనో ఇదెంతటి అబద్ధమో గుర్తింపలేనంత స్థితిలో ఉన్నామా?

9) తప్పులను పాపాలను లిఖించాల్సినది, దేవుడో పరలోక నిబ్బందిపనో కాదు. వీరి బాధ్యతకాదు. పాపులను శిక్షింప చేయించాల్సినబాధ్యత, పాపుల వల్ల బాధింపబడ్డవారికి మాత్రమేఉంది. పీడిత దుఃఖిత ప్రజలుపాపుల నేరా

లను నిరూపింపచేస్తూ, తగినంత శిక్షపడేట్లు శ్రద్ధాసక్తులను వహించాల్సిన బాధ్యత వారిది. నేరస్తులందరి తప్పులను లిఖిస్తూ న్యాయస్థానాలలో నిలబెట్టించి, తిరిగి పాపాలు చేయకుండా అరికట్టితే అది ప్రయోజనం. దీనివల్ల మిగతా ప్రజలకు కీడు తలపెట్టలేని వారవుతారు.

10) నేరస్తులు తప్పించుకోకుండా శిక్షింప జేయించుకోవలసిన బాధ్యత ప్రజలది. తమ భద్రతగూర్చి ప్రజలకు పట్టనప్పుడు, ఇట్టి ప్రజలకోసం పరలోక సిబ్బందితోబాటు దైవము అపారశ్రమకు ఏలలోనవ వలె?

11) కోట్లాది పాపులు ఎన్నిపాపాలు చేస్తున్నా, వీటివల్ల పరలోక సిబ్బందికిగాని, దేవునికిగాని ఎలాంటి హానిలేదు. అలాంటప్పుడు నరకయాతనల ప్రతీకారం ఎందుకు? కోట్లాదిపాపులు నిరంతరం పాపాలు చేస్తున్నా, ఒక కుటుంబానికి లేదా ఒకనికి ఎలాంటికష్టం ఉండక పోవచ్చు. పాపులున్నారో లేదో కూడా తెలియనంతగా, కొందరి జీవితం సాగిపోతుండవచ్చు. కాని కోట్లాది పాపులవల్ల నిరంతరం బాధలనుభవించేది కోట్లాది ప్రజలు. తప్పు చేసే ప్రతివాడి వల్ల ఒకరో కొందరో దుఃఖిస్తున్నారు. పాపివల్ల దుఃఖిస్తున్నది కొందరు. ఈ కొందరి దుఃఖం తొలగాలంటే, తప్పులు చేయనీయకుండానే నియంత్రించాలి. అప్పుడు తప్పులుచేసే అవకాశం లేక, ఎవరికి దుఃఖం ఉండదు. ఇది వదిలేసి పరలోకంలో శిక్షలు అంటే చిన్నపిల్లలు నమ్మాల్సిన కథాంశమవుతుంది. పిల్లలు నమ్మాల్సిన విషయాలను పెద్దవారైన మనం నమ్మటం చిత్రం.

12) – భూమిపై నేరాలు చేసిన వారిపై, బ్రతికుండగా న్యాయవిచారణ జరిపి శిక్షింపకుండా, వారిమరణం తదుపరి వారుచేసిన పాపాల లిస్టంతా కోట్లకొలది గ్రంథాలలో భద్రపరచి ఉంచితే, వాటినిబట్టి దేవుడు శిక్షిస్తారు కదా। దీనిని ఆమోదిస్తారా? ఇలాంటివిచారణ: ఇలాగ గ్రంథాలలో లిఖించటం నిరర్థకం అని ఎంత అజ్ఞానానికయినా తెలుస్తుంది. ఇదే పనిని పరలోక సిబ్బంది చేస్తున్నా పైవలెనే నిరర్థకం కాదా?

14 పాపాలు చేస్తున్న వారిని నిరోధించడమో లేక శిక్షించటమో చేయ నందువల్ల, వారలా పాపాలు చేస్తూఉంటారు. వీరివల్ల ఇతరులు బాధలను పొందుతుంటారు. ఈ కష్టాలు తొలగాలంటే పాపులను సన్మార్గంలో కన్నా తేగలాలి, లేదా పాపులను మరణింప జేయనైనా చేయాలి. ఈ రెండు విధాలా కాకుండా, పరలోకంలో శిక్షించడం నిష్ప్రయోజనం కాదా!

14) భూమిపై న్యాయవిచారణ జైళ్ళు లేకుంటే, మనుష్యులంతా దుఃఖ ముతో గడపాల్సి ఉంటుంది. సంపదలు సౌఖ్యాలు అన్ని తమకేనని బల వంతులు బలహీనుల్ని తరిమివేస్తారు. దావనీయక బ్రతకనీయక నానా అవ స్థల పాల్జేస్తూ, బానిసలుగా బ్రతకమంటారు. ఇలా జరపకుండా సాంఘిక న్యాయాన్ని నెలకొల్పి, ఎవరు చేస్తున్న నేరాలకు వారిని శిక్షిస్తున్నారు కాబట్టి, అందరికి రక్షణ ఉంటోంది. నేరస్తులను శిక్షించేందుకు దేశమం తటా నెలకొన్న మానవ సిబ్బంది పనిచేస్తుండగా, ఇదేపనికొరకు పర లోక సిబ్బంది పనిచేయటం నిరర్థకం. భూమిపై నేరస్తులను శిక్షిస్తున్న ప్పుడు పరలోకంలోను శిక్షించటం ఎలా సమంజసం?

15) పరలోకంలో నివసించే జీవుళ్ళు అక్కడి నియమ నిబంధనలను పాటించకుంటే, అక్కడశిక్షిస్తే, అక్కడ శాంతిసౌఖ్యాలు నిలచిఉంటాయి. భూలోకంలో నివసిస్తుంటే భూమిపైన శిక్షలు విధిస్తుంటే, భూమిపై శాంతి సౌఖ్యాలు ఉంటాయి. శాంతిసౌఖ్యాలు ఏర్పరచలేని విచారణలు శిక్షలు పనికి రానట్టివికదా!

16) చిన్నపిల్లలు తప్పుచేస్తే, అదేతప్పు తిరిగిచేయకుండా వెంటనే దండి స్తారు. ఇలా దండించకుండా కొన్నినెలల క్రిందట లేదా కొద్దిసంవత్సరాల క్రిందట; ఫలానా తప్పు చేశావని నేడు శిక్షించే తల్లిదండ్రులున్నారా? శిక్షింప దలచుకుంటే, తప్పుచేసినపుడే శిక్షించాలి. అందుచే తప్పుచేసిన వ్యక్తులకు, తమ తప్పులు ఏమిటో తమను ఎందుకుశిక్షిస్తున్నారో అర్థమవు తుంది. శిక్ష విధించేవారికి ఏప్రయోజనం ఆశించి శిక్షిస్తున్నారో తెలుస్తుంది.

17) భవంతులు, పొలాలు, ఫ్యాక్టరీలు, డబ్బు ఎంతగా ఎన్ని ఉన్నా, మనిషి ఏం చేసుకో కల్గుతున్నాడు? అయినా అదేపనిగా కూడబెడుతున్నాడు. ఈ నిష్ప్రయోజనమైన పనికి బ్రతికినంత కాలం పోరాడుతూ అవిశ్రాంతితో మరణిస్తున్నాడు. ఇట్టి తాపత్రయంలో మంచిచెడులు విస్మరించారని శిక్షించాలా? జీవితపరిమితి దృష్ట్యా నియంత్రించాలా? నిష్ప్రయోజనమైన పాపపుణ్యాల లెక్కింపు పరలోక విచారణ ముఖ్యమా? నియంత్రణ ముఖ్యమా? సరైన జ్ఞానము సరైన నియంత్రణకు సంబంధించిన దైవసహకారం కదా, అందరికి ప్రయోజనం.

18) పాపులు భూలోక పరిస్థితిని బట్టి పాపాలు చేసిఉండవచ్చు. ఇక్కడి లాంటి పరిస్థితులులేని పరలోకంలో, పాపులకు అక్కడి జీవితాన్ని ఇవ్వకుండుట సరయినదా? ఇక్కడి పాపులు పరలోకంలో ఉన్నతంగా జీవించరనేదేముంది? పాపాల పుణ్యాల తీసివేతలు పోగా, పుణ్యాత్ముల కింద లెక్కలోకి వచ్చినవారు, పరలోక జీవితానికి విరుద్ధంగా ప్రవర్తించరనేదేముంది?

19) భూమిపై నివసించేకాలం అతిస్వల్పం. ఇట్టి స్వల్ప జీవితంలో చేసిన పాపాలకు, నరకయాతనలతో కూడిన నరకంలో పడెయ్యటం, న్యాయం కాదనుకుంటే పాపులు నరకంలో శాశ్వతంగా దుఃఖించాలా? భూమిపై గడపిన స్వల్పజీవితంలో చేసిన పుణ్యాలకు, స్వర్గసౌఖ్యాలు న్యాయం కాదనుకుంటే, ఆస్వర్గం అలా శాశ్వతమా? ఎంతమాత్రమూ న్యాయంకాని వీటిని, దేవుడు నిర్వర్తించునా? ఇవి మతపరమైన కల్పనలు కాదా?

20) నిత్యమూ పాపపుణ్యాల లెక్కింపు లేదా పాపుల పుణ్యాత్ముల విభజనతో వీరికి స్వర్గనరకాల కేటాయింపు లేదా పునర్జన్మను ప్రాప్తిస్తూ కర్మ

ప్రభావంగా నుదుటి వ్రాతలు వ్రాసి భూలోకం పంపటం వంటి నిరర్థకమైన పనులు చేయకుండా, ఈభువినే పాపులకు నరకంగా, పుణ్యాత్ములకు స్వర్గముగా భాసింప చేయవచ్చుకదా! అలా ఎవరి పుణ్యాలకు వారు సంతోషకరమైన జీవితం గడుపుతారు. ఇలాచేస్తే పరలోక సిబ్బంది, దేవుడు అపార శ్రమకు లోనవ వలసినది ఉండదు. ఇట్టి ఔచిత్యము వివేకవంతము అయిన లక్ష్యమును దేవుడు నెరవేరుస్తారు కాబట్టి, శిష్టరక్షణ దుష్టశిక్షణ బాధ్యతను ప్రజలకే అప్పజెప్పుతారు. ఇంక పాపపుణ్యాల లెక్కింపు స్వర్గనరకాలు లేవు. ఈభూమిని స్వర్గతుల్యం చేసుకోవడం ఇంక మన బాధ్యత.

# 6. ఆచారాలు, సాంప్రదాయాలు

1) దైవము - ప్రకృతి- జీవుడు - ప్రార్థనలు_ఆరాధనలు - భక్తివిశ్వాసములు -ఉపవాసనులు - దానధర్మములు - దేవాలయాలు- మతాచార్యులు పౌరోహిత్యం - సన్యాసము - యాత్రలు - పండుగలు - వేడుకలు- ఉత్సవాలు- జాతరలు- క్షుద్రశక్తులు- మంత్రతంత్రాలు - జంతుబలులు-జ్యోతిశ్శాస్త్రము- శుభఅశుభములు- వృత్తివ్యాపారం వంటి కార్యారంభము-శంఖుస్థాపనలు- కట్టడనిర్మాణాలు- గృహప్రవేశము - కార్యసాఫల్యత - సంతానప్రాప్తి – ఆరోగ్యము- అంటువ్యాధులు చీడలు తెగుళ్ళ నివారణ-స్త్రీపురుష సంబంధము- వివాహం- కట్నకానుకలు- దాంపత్యం- విడాకులు - వస్త్రధారణ అలంకరణ- గృహసంబంధం- ఆహారపు అలవాట్లు - వంటలు పిండి వంటలు- విందులు వినోదాలు- గౌరవ మర్యాదలు- అతిధి సత్కార్యాలు- బంధుత్వం - ఆస్తిపంపకం - వారసత్వపు హక్కులు - అంత్యక్రియలు- శ్రాద్ధకర్మలు- వ్యవసాయం- వ్యాపారం - వృత్తులు - పరిపాలన - సభలు సమావేశాలు- శిల్పము- నృత్యము- సంగీతము - సాహిత్యము - కులం- వర్ణం- వర్గం-ఇలా ఎన్నింటికో సంబంధించిన ఆచారాలు సంప్రదాయాలు ప్రజల జీవన విధానంలో నిలిచిఉన్నాయి. ఒక్కో ప్రాంతీయుల అలవాట్లు అభిరుచులు, అభిప్రాయాలు వీటి ఆచరణలు సంప్రదాయాలుగా వేర్వేరవటంచే, వేర్వేరయిన సంస్కృతికి కారణమయ్యాయి.

2) అనేకులు అనేక విధాలయిన వ్యాపార ప్రకటనలు చేస్తున్నారు. వాటి ఉద్దేశ్యం కొనుగోలుచేయించి లాభాలను పొందాలనే అపేక్ష. అలాగే మత పూజారివర్గం జీవుడు దేవుడు అన్న భావనలతో కర్మకాండలను ప్రవేశ పెట్టి, తద్వారాడబ్బుతో బాటు విలువైన సామగ్రిని పొందాలనే అపేక్ష నుంచి, రకరకాలయిన నమ్మకాలను మెదడులోకి ప్రవేశపెట్టారు. ఏమీ అవసరంలేని దేవునికి జీవుడికి, తమ జీవన భృతికోసం మతవర్గం ఏర్పాటు చేసిన వాటిని, యదార్థాలుగా భావించటంచే కల్గిన అనర్థమే మనం జరిపే కర్మకాండ.

3) మన తాతముత్తాతలు ఆచరించినందు వలనో, లేక కోట్లకొలది ప్రజ లవి ఆచరిస్తున్నందు వలనో, ఒక ఆచరణ సరైనది అవ్వదు. ఎంత సంఖ్యాబలం ఉన్నా ఎంత గతచరిత్ర ఉన్నా, సరైనవికాని వాటికి స్థానం ఉండరాదు. శాస్త్రజ్ఞానం లోపించినవారిలో ఆలోచనలో వైవిధ్యం ఏర్పడక ఒకనాడెప్పుడో ప్రవేశపెట్టిన ఆచారాలను నేడు పాటిస్తున్నారు. ఇదే శాస్త్ర జ్ఞానం గతకాలంలో లోపించినందువల్ల, అర్థరహితమైన ఆచారాలెన్నిం టికో స్థానం ఏర్పడింది. శాస్త్రజ్ఞానం నేడు లేకుంటే, ఈనాటి ప్రపంచం యావత్తు తమ తాతముత్తాతలనే అనుసరిస్తుండేవారు.

4) ఎవరికి వారు తమ పెద్దలు చెప్పారనో, తమపెద్దలు అలా చెప్పి చేయించారనో, శాస్త్రాలలో అలా చేయమని చెప్పి ఉందనో, గ్రుడ్డిగా అనుసరిస్తున్నారు. మన తాత ముత్తాతలు నవ్వినట్లు నవ్వి, ఏడ్చినట్లు ఏడవాలంటే, ఈనాడెలా సాధ్యం? గత కాలంనాటి వ్యక్తులపై ప్రేమ ఉంటే ప్రేమించండి, ఎవరు కాదన్నారు. పూర్వీకుల ఆచరణల జోలికి పోవటం ఎందుకు? వాటిని పాటించాలనే పట్టుదలలు ఎందుకు? తమలోని తప్పును తెల్సుకొని సరిదిద్దుకోరు. తాము అభిమానించిన వారిలోని లేదా తమను అభిమానించిన వారిలోని తప్పులను తెల్సుకోరు. ఒకవేళ తెల్సి

కున్నా పట్టించుకోకున్నారు. ఇదే స్వభావం ఒకనాటి సంస్కృతిపై పెంచు కుని, మా జాతి మా సంస్కృతి అంటూ విడనాడకున్నారు. గత ఆచారాల వల్ల సనాతన దృష్టివల్ల సత్ఫలితాలు ఉన్నాయో లేదో, నేటి సమాజానికి వాటి అవసరం ఉందో లేదోనని ఎందుకు పరిశీలించం?

5) సంపాదించటానికి ఎంత ఆత్రుత ఉంటుందో, అలాగే సంపాదించిన దానికి ఎలాంటి విఘాతం కలగకుండా ఉండాలని ఆత్రుత చెందుతారు. తమ ప్రయత్నాలు ఫలించేందుకు అదృష్టం ఒనగూరేందుకు, దురదృష్టం వెన్నాడకుండా ఉండేందుకు, తమకున్న అవకాశాలు లాభాలు అధికారాలు నిలబడేందుకు - ఇలాంటి ఉద్దేశాల నుండి వివిధాలైన మతాచరణలు ఆచరణ ఏర్పడింది.

6) దేవుడు సర్వశక్తివంతుడని మంచి చెడు అంతా దైవ నిర్ణయమని అనుకుంటే; మంచి జరగాలనే అపేక్షతోనే కాకుండా, చెడు జరగకుండా ఉండాలనే ముందు జాగ్రత్తకోసము మతాచరణలను ఆచరిస్తున్నారు. మంచి చెడు అనేది మనకి మనం చేసుకుంటున్నదేనని, మతపరమైన మంచి చెడులు కొందరి ఊహలలోనివని గుర్తించరు.

7) ఇహపర లోకము పాపపుణ్యాలు ఆగ్రహానుగ్రహాలు నిగ్రహం విరోధం వంటివాటి గూర్చి. మతపర ఉద్దేశాలను నమ్ముతుంటే. ఆ నమ్మిక కనుగుణమైన ఆచరణ లేకుంటే, వ్యర్థమైన మానసిక సంఘర్షణతోబాటు వ్యర్థమైన పనులు ఉంటాయి మత విధులు అతిక్రమించరానివని అను కోవటంవల్ల, సాంప్రదాయాలను విడనాడలేని బానిసత్వంవల్ల, ఇవిలా వార సత్వంగా కొనసాగుతున్నాయి. మత విధులకు ఆడంబరత్వాన్ని జోడించటంచే, ఇవెంతో భారమయ్యాయి. అనవసరమైన అలవాట్లు కోరికలు ఎలా మనుష్యుల్ని బానిసలుగా చేసుకొని, ధనాన్ని కాలాన్ని వ్యర్థపరుస్తున్నాయో అలాగే; అనవసరమైన మత విధులు జీవితంనుండి

విడదీయలేనంతగా పెనవేసుకొనిపోయి, కాలాన్ని శ్రమను నిష్ప్రయోజనం చేస్తున్నాయి. సంప్రదాయానుసారం సాగాలనే అర్థరహితమైన పట్టుదలలకు లోనవటంచే సంఘర్షణలు తలెత్తుతున్నాయి. మతాచారాలపై మనకుండే విశ్వాసం ఆచరణవల్ల నష్టపోతున్నది మనమే.

8) గ్రుడ్డిగా అనుసరిస్తున్నందువల్ల లోపాలు దోషాలు కనిపించవు. అనుసరించే వారికవి పాటింప తగ్గవిగానే వుంటాయి. దానిచే ఆ మనిషి మనస్సు ఆ పరిధిని దాటలేకుంటుంది. వేటినైతే పాటిస్తామో వాటివల్ల మంచి జరుగుతుంటే, వాటిని ముందు తరాలకు అందిస్తాము. కష్టాలు కల్గించే వాటిని త్యజిస్తాం. అభిమానించటం మంచిదే. అభిమానించే విషయం సరైనట్టిది కానప్పుడు, త్యజించాలి కాని వారసత్వంగా కొని పోరాదు.

9) గత ఆచారాలు సంప్రదాయాలు మనల్ని నడిపించాల్సిన అజ్ఞానపు దశలోలేము. నేటి ప్రచార సాధనాలవల్ల జనసాంద్రతవల్ల, అనేకానేక విషయాల అవగాహన ఏర్పడి వుంది. గ్రంథ రూపేణా ఇతరుల అనుభవాలు పరిశీలనలు అందుబాటులో వున్నాయి. దినసరి కార్యక్రమాలలోగాని, గృహ నిర్వహణలోగాని, సభ్యతా సంస్కారాలకుగాని, మతాల ప్రమేయం వాటి నియంత్రణ అవసరంలేని స్థితిలో జీవిస్తున్నాం.

10) అనుభవ జ్ఞానంవల్ల ఏది సరైనదో తెలుస్తుంది. బాలుని అనుభవం గొప్పదా? వృద్ధుని అనుభవం గొప్పదా? మతకాలంనాటి అనుభవజ్ఞానం బాలుని వంటిది. నేటి సమాజంయొక్క అనుభవజ్ఞానం వృద్ధుని వంటిది. ఏ కాలంనాటి సమాజంయొక్క నిర్ణయాలు స్వీకరింప తగ్గవి ?

11) కష్టాలు ఎలా తొలగుతాయో తెలియని స్థితిలో, సంపదలు ఎలా ప్రాప్తిస్తున్నాయో అర్థంకాని స్థితిలో, తెలియని స్థితినుండి, భయాందోళనల నుండి, మతపరంగా ఎన్నో పద్ధతులను ఆచారించారు. గతంనాటి

అజ్ఞానంలో నేటి మనం లేము కాబట్టి, జీవన విధానంలో అపసవ్యమైన అనవసరమైన ఆచార సంప్రదాయాలకు చోటివ్వవద్దు. ధరించిన దుస్తులు తేలిక పాటివిగాను, సభ్యతను ప్రతిబింబించేవిగాను వుండాలి. ఇది గుర్తించకుంటే అజ్ఞానాన్ని అధిగమించలేని వ్యక్తిత్వం అవుతుంది.

12) తాము నమ్మినవి సరైనవన్న భావన, ఆచారాలను సంప్రదాయాలను పాటింపజేస్తోంది. మతాచారాల సంప్రదాయాలకు కారణం నమ్మకం. ఒక ఆచరణే ఆచారం లేదా సంప్రదాయం. ఫలానా వాటిని ఫలానా పద్ధతిలో జరుపుకోవాలనే తలంపులే ఆచారాలు అయ్యాయి. మత విధులు పండుగలు అవేవైనా ఒక కాలంనాటి పద్ధతులు. తామేర్పరచుకున్న నమ్మిక విశ్వాసాలకు అభిరుచులకు అనుగుణంగా ఆచరించిన పద్ధతులే మత విధులు.

13) వేటిల్లోనైనా అనూచానంగా వస్తున్న గతకాలపు వాటిని లేదా గత సంబంధాన్ని సాంప్రదాయంగా భావించటం వుంది. అవసరాలనుబట్టి, అవగాహనినుబట్టి, ఏవేవో సంప్రదాయాలను ఎందరెందరో ప్రవేశ పెట్టుకొని ఉండవచ్చు. వాటినే నేటి మనం కాపాడవలసింది లేదు. ఏ నియమ నిబంధనలైనా సమాజ అవసరాలబట్టి మారేవికాని, పట్టుదలతో కాపాడుకోవలసినవి కావు. ఆచారాల సంప్రదాయాలయొక్క ఉద్దేశాలు ఏవైనా, ఆధునిక అవగాహనానుభవంవున్న మనకు గతం వాటినే కాపాడుకోవలసిన అవసరంలేదు.

14) ఒక పనిని ఏ విధంగా చేయాలో తెలియనప్పుడు అనేక విధాలుగా చేస్తాము. ఆ అనేక విధాలే సంప్రదాయాలు. ఒక పనిని ఏ విధంగా చేయాలో స్పష్టంగా నిర్ధారితమైనపుడు దానిని పాటించాలి. అప్పుడిది ముందు తరాల వారికి సంప్రదాయం.

15) సనాతనమా అధునాతనమా, దేశీయమా పరదేశీయమా, స్వమతమా

పరమతమా, స్వసంస్కృతా పరసంస్కృతా అనేది దృష్టితో కాక, ఆచరించే అనుసరించే అవలంభించే ప్రతిది, సరైనదయినట్టిదేనన్న నిర్ధారణ అయితే, అది అవలంభించాల్సిన పద్ధతి. సరికాని ఆచారాలు సంప్రదాయాలు అంటే సరికాని పద్ధతులు. ఈ సరికానివన్ని కష్టాలు ప్రాప్తిస్తాయి. వైద్యరీత్యా ఉండేవన్ని శరీర సంబంధమైన కష్టాలను ప్రాప్తిస్తాయి. ఇలా ఏ యే వాటికి సంబంధిస్తే, ఆ యా వాటి దుష్ఫలితాలు ప్రాప్తిస్తుంటాయి.

16) మత విధులన్ని మానవులచే ఏర్పరచుకున్నవిగాని, దేవునిచే నిర్ణయింపబడలేదు. అలాంటప్పుడు వేటినైనా విడనాడటానికి సంశయం ఎందుకు? మానసిక సంఘర్షణ మేలైన పద్ధతులను అనుసరింపక పోతుంటే కలగాలి గాని, మతాచారాలను తరతరాల సంప్రదాయాలను విడనాడటంలో కారాదు. ఆచారం సంప్రదాయం నియమం ఆవేవైనా, అవి సరైనవి కానప్పుడు, వాటికి శాసించే శక్తిలేదు. వాటికి లోబడి జీవించరు. నియంత్రణకు లోబడవలెనంటె, నియంత్రించేవన్నీ సరైనవి ఆవ్వాలి.

17) పరిస్థితులకు సమస్యలకు అనువైన పద్ధతులను రూపొందించుకొని, అనుసరింపమన్నదే దేవుని అభిలాష అవుతుంది కాబట్టి, ఏ మతస్థులైనా మతపరమైన నియమ నిబంధనలను పట్టించుకోవద్దు. పాచుదలలేని అపరిశుభ్రమైన నీరున్న కొలను, దేవాలయ ప్రాంగణంలో ఉందని, ఆ నీటిని త్రాగటమో ఆ నీటితో స్నానమో చేయరు. దేవాలయాలలోని పూజా ప్రసాదమైనా, నిల్వ వుండి సూక్ష్మజీవులచే చెడితే, ఉపయోగింపకుండా వదలి వేస్తారు. కష్టాల పాల్జేసే సనాతనత్వం మన కెందుకు? దురభిమానమే అజ్ఞానం. ఈ సంప్రదాయాలు నమ్మక విశ్వాసాలు మనిషి జీవితంకంటె విలువైనవా? అర్థరహితమైన వాటికి లోబడి యెందుకు జీవించాలి?

18) మత ప్రమేయం తదితరుల ప్రమేయంవల్ల, ఎన్నో ఆచరణలు మానవ జీవితంలో చోటుచేసుకున్నాయి. ఈ ఆచరణలు ఎన్నోవాటికి సంబంధించి ఉన్నాయి. ఎవరి ఆచారాలు వారివి, ఎవరి సంప్రదాయాలు వారివి, ఆలా వేర్వేరవుతున్నాయంటే మనం అనుసరించే ఆచరణలలో సరికానివి ఉన్నట్లు.

19) ఏ పనిచేస్తున్నా అవి వేటిక్రిందకో విభజితమవుతాయి. దైవము అంతరిక్షము, వ్యవసాయం ఇంజనీరింగు వైద్యం భూమి వాతావరణం ఋతువులు వంట వివాహం, ఇలా ప్రతి ఒక పని ఏదోదానికి సంబంధించి నది. ఏవి వేటికి సంబంధితమో, ఆ సంబంధిత శాస్త్రాలు లేదా ఆ గ్రంథాలు ఏమి వివరిస్తాయో, ఆ వివరణల ప్రకారంగా జీవించటమే జీవితం అవ్వాలి. ఇట్టి జీవితమే ఎవరికయినా సుఖప్రదము.

20) ఎవరు ఏదిచేస్తున్నా అది ఒక పని. నిత్యజీవితం అంతా చిన్నా పెద్దా ఏవో ఒక పనుల నిర్వహణతో కూడి ఉంది. ప్రతి పనిని నిర్వహించాలంటే, అందుకొక పద్ధతి ఉంటుంది. ఈ పద్ధతులను పాటించటంపైన, మంచి చెడు ఆధారపడి ఉంది. పరస్పర సంబంధాలలో సంతోషం అయినా విభేదాలనయినా దుఃఖాన్ని అయినా ఇవే కల్గిస్తాయి లాభనష్టాలకు కష్ట సుఖాలకు ఇవే కారణం. వీటికి ఉన్న ప్రాముఖ్యతను గుర్తింపక నిర్లక్ష్యం చేస్తున్నారు.

21) వజ్ర వైఢూర్యాలను కాలదన్నుకుంటూ, మకిలిపట్టిన నాణేలను వాడుకుంటున్నారు. సరైన పద్ధతి అనేది వజ్రం వంటిది. సరికాని పద్ధతి బొగ్గువంటిది. బొగ్గు ఎలా దహనమవుతుందో, అలాగ మానవుల జీవితాలను దహిస్తుంటాయి. సరైన పద్ధతులకు ప్రత్యామ్నాయ పద్ధతులు ఉంటాయి. ఏవయినా సరైనవే. దీనికి చెందనవి సరికాని పద్ధతులు. ఈ సరికాని పద్ధతులను మానవాళి విడిచిపెట్టడం మానవ సౌఖ్యం కొరకే.

22) పరిస్థితులు పరిసరాలు వేరయినా, సంఘటనలు వేరయినా, సరైన కార్యాచరణ అనేది ఉంటుంది. ప్రతిది ఎలా చెయ్యాలో, ఎప్పుడు ఎక్కడ ఎలా మాట్లాడాలో, ప్రతిది వివరించబడి ఉండదు. ప్రతిది వివరించి ఉంటే గాని చేయలేని యంత్రంవంటి వాడుకాదు మనిషి. వివిధ విషయాలపై ఒక స్థాయిలో అవగాహన పొందితే, ఆ అవగాహనచే ఎలాంటి పరిస్థితులందైనా సక్రమ పద్ధతులను రూపొందించుకో కల్గుతారు. స్వంత వివేచనద్వారా ఏర్పడేవన్ని సరైనవి కావాలంటే, అవగాహనను పొందటం ముఖ్యం.

23) అవగాహన ఆచరణను రూపొందిస్తుంది. అవగాహనకు ఉన్న ప్రాధాన్యతను విడనాడి, కాంక్షాసక్తుల కొరకు జీవితకాలాన్ని వ్యర్థపరుస్తున్నారే కాని, అవగాహనకు ప్రాధాన్యత ఒసంగుటలేదు. కాబట్టి సనాతనత్వంపై మోజు మొండి పట్టుదలలు కొనసాగుతున్నాయి. సనాతనత్వం ఒక ఉరిత్రాడు వంటిది. మనిషి తనంతతాను ఆ ఉచ్చును బిగించుకుంటున్నాడు. ఈ ఉచ్చు మనిషిని చంపదు. మనిషి కాలాన్ని శ్రమను పరస్పర సంబంధాలలో ఐక్యతను చంపుతుంది. ఒకోసారి మనిషిని హత మారుస్తుంది.

24) నిజానిజాలు తెల్సుకొనుటకు వివేచన ఎంతో ఉపకరిస్తుంది. ఈ వివేచనను వదలి గ్రుడ్డిగా అనుసరించటం ఉంటోంది. వివేచన ఖడ్గం వంటిది. ఉపయోగించుకోకుంటే, ఉపయోగమూలేదు.

25) నోట్లోకి ఆహారం అందించినట్లు ఆలోచన వివేచనను అందించాల్సి ఉంటోంది. ఇట్టి ఆలోచన వివేచన మేధావులచే అందించబడ్డా, దీనిని అందుకోనున్నారు. అలాగయితే మూఢనమ్మకాలు, సరికాని మతవిధులు, లోపభూయిష్టమైన పద్ధతులు తొలగేదెన్నటికి ? ఇవి తొలగందే కష్టాలు తొలగవు. కాబట్టి స్వంత ఆలోచన వివేచన చేయాలి లేదా సరియైన ఆలో

చనను వివేచనను స్వీకరించాలి. ఏదైనా మతవిధి లేదా ఆచరణకు ముందు ఎందుకొరకు? ఎవరికొరకు? దాని అవసరం ఎవరికి ? ఏ ప్రయోజనార్థం? అనేది చర్చనీయాంశంగా ఉండాలిగాని, గ్రుడ్డిగా ఆచరిస్తూ వివేచనలేని మనుష్యులుగా జీవించకూడదు. ప్రవక్తలు లేదా మహర్షులు లేదా యోగులు ఎవరేది చెప్పి ఉన్నా, ఏవి పాటించమన్నా వాటిని పాటించనవసరంలేదు. ఎందుకంటే కాలదోషం పట్టిన వాటిని ఆచరించటం అవివేకం కాబట్టి, దేవుడు వీటిని విడనాడమంటారు.

26) అసలు తెలీకుంటే సరైన పద్ధతిని అనుసరింప జేసేవని. అసలు తెలీకుంటే సరైన విషయానుభవాన్ని కల్గించేవవి. ఇలా లేదు. ఇంతకు ముందే ఆచారాల సంప్రదాయాల ద్వారా విషయానుభవాన్ని, వివిధమైన వాటిల్లో అనుసరింపాల్సిన వైఖరిని నేర్చేసుకుంటున్నారు. ఒకసారిలా నేర్వబడిన తదుపరి, ఆ ఒరవడి అలా కొనసాగుతోంది. ఏయే వాటిల్లో ఈ విధంగా గ్రహింపయ్యిందో, ఆ గ్రహింపు స్థానే సరైన విషయానుభవాన్ని, అనుసరించాల్సిన వైఖరిలో సరైన పద్ధతిని ప్రవేశపెట్టు కోలేకున్నారు.

27) ఆచారాలు సంప్రదాయాలు ఈ మస్తిష్కంలలో, విషయానుభవాలను అనుసరింపాల్సిన వైఖరులను ప్రవేశపెట్టాయి. దీనిచే ఇక ఏయే వాటిపై తెలిసి ఉందో, ఏయే వాటిపై అనుసరించాల్సిన వైఖరి నిర్ణయించి ఉందో, ఇక వాటిగూర్చి తెల్సుకోవటంలేదు. పాత ఒరవడిలో సాగుతున్నారు. గత సంప్రదాయాల సంకెళ్ళు పడ్డాయి.

28) ప్రతి పని ప్రతి ఆచరణకు సరైన విషయానుభవం సరైన పద్ధతి ఉండాలి. ఇవలా స్వీకరింపబడకుండా, ఇంతకుముందే మస్తిష్కంలో ప్రవేశపెట్టబడ్డ ఆచారాల సంప్రదాయాల వైఖరి పనిచేస్తోంది. ఆచారాలు సంప్రదాయాలు సరైన విషయానుభవాన్ని సరైన పద్ధతులను స్వీకరింపబడకుండా అడ్డుకుంటున్నాయి.

29) మనుష్యులు కూడా ఇంతకుముందు నేర్వబడినవి అనుసరించు తున్నవి, సరైన వవునా కాదా అన్న పరిశీలన సంస్కరణకు తావివ్వ కుండా, జాతి మతం సంస్కృతి పేర దురభిమానం పేర బందీలవు తున్నారు. దీనిచే పాత పద్ధతులు స్థానే, సరైన పద్ధతులను ప్రవేశపెట్టుకో మన్నారు.

30) జీవితం పరస్పర సంబంధం. స్పందన ప్రతి స్పందనలు, ఆలో చనలు, నిర్ణయాలు, కార్యాచరణలు, సంఘటనలు, పరిస్థితులు; ఫలితాలు, వంటివన్ని లింకుల వంటివి. ఒకదానికి మరొకటి కారణమవుతుంటాయి. కార్యకారణ సంబంధంయొక్క ఫలితాలలోనే, జీవితము సమాజము యొక్క రూపురేఖలు నిలచిఉన్నాయి. కార్యకారణ సంబంధాన్ని గుర్తించనందు వల్లనే, కర్మ, దుష్టశక్తులు, దైవప్రభావం అన్న నమ్మిక ఉంటోంది. వీటి ఆధారంగా ఏర్పడిన మతాచారాలు, కార్యకారణ సంబంధం యొక్క అవగాహనతో ఏర్పడనట్టివి, కాబట్టి విడనాడవలసినవి.

# నమ్మక విశ్వాసాలు

1) నమ్మక విశ్వాసాలు అనేకం. మనిషి ప్రాంతము అవగాహనబట్టి వేర్వేరుగా ఉంటాయి. కొందరికి ఉండే నమ్మక విశ్వాసాలు వారికి తోటి వారికి యెలాంటి కష్టము కల్గించనివి. ఇక్కడి వ్యాసం పరిమిత చర్చ నీయాంశం.

2) అది పాపము అనుకుని ఆపని చేయని వారున్నారు. అది పాపము కాదని ఆ పనినే నిరభ్యంతరంగా చేసే వారున్నారు. పాపమని నమ్మటం నమ్మకపోవటంవల్ల, చేయటం చేయకపోవటం ఉంది. ఆశించటం ఆశించక పోవటంబట్టి ప్రయత్నం ఉంటుంది, ఉండదు. ప్రయోజనం నిష్ప్రయో జనంబట్టి, పనిచేయటం చేయకపోవటం ఉంటుంది. సత్యము అసత్యము బట్టి, నమ్మటం నమ్మకపోవటం ఉంటుంది. మతపరమైనవి నమ్మి ఆచ రించాలంటే వాస్తవమని నమ్మింపజేయాలి లేకుంటే గుర్తించం. ఇంకా వాస్తవమనెడి నమ్మకాన్ని స్థిరం చేయాలి. మతపరమైన విశ్వాసాలు దీనికి చెందినవి. ఫలితాలు రాబట్టుకోవచ్చని, చెడుని నిరోధించుకోవచ్చని, ప్రయోజనాలు పొందవచ్చని, ఇలాగ బంధాలువేసి మత పరిధికి మనల్ని బంధింటారు.

3) ఎదటివ్యక్తి చెప్పే విషయాలు ఎంతవరకు నమ్మదగ్గవో కావో పరి శీలిస్తాం. ఇలా పరిశీలింప కల్గటానికి, ఆ చెప్పే విషయాల గూర్చి

తర్కించుకోగల జ్ఞానం ఉండటంవల్ల అది సాధ్యపడింది. దేవుడు జీవుడు మొదలగు వాటిగూర్చి ఎలాంటి ప్రచారం అమలులోవున్నా, వాటిల్లోని నిజానిజాలను విభజించుకోగల జ్ఞానం లేనప్పుడు, అనేక విశ్వాసాల వ్యాప్తి ఉంటుంది.

4) దేవుడు, జీవుడు, మంత్రతంత్రాలు, క్షుద్రశక్తులు వంటి వాటిద్వారా అవసరాలు, కోరికలు తీర్చుకోవచ్చుని, మనదృష్టిని ఆవైపుకి మరల్చారు. ఆలా మరల్చబట్టి మతవిశ్వాసం స్థిరపడింది. నమ్మక విశ్వాసాలనేకం స్థిర పడ్డాయి. అవసరాలు కోరికలను స్వయంకృషి-సాధన ద్వారానే పొంద గలం కాని, మతాలు తదితరులు వ్యాపింపజేసిన నమ్మక విశ్వాసాల ద్వారా మాత్రం కాదు. ఇది గుర్తిస్తే, ఆశించటం నిరీక్షించటం వ్యర్థమయిన పనులు ఉండవు.

5) పాపభీతి దైవభీతి ఉండాలన్నా, దైవానుగ్రహం కొరకు తపించా లన్నా నమ్మకంయొక్క ప్రభావం మనస్సుపై పనిచేస్తుండాలి. దైవము కోరికలను నేరవేర్చుతారన్న నమ్మకం, పాపాలకు తగిన శిక్షలు విధిస్తా రన్న నమ్మకం, మతం దైవవాక్కు అన్న నమ్మకం. ఈ నమ్మక ప్రభా వము మనస్సుపై పనిచేసేలాగ చేసి, మతాన్ని పాటింప జేశారు.

6) పనులు చేయటం చేయకపోవటం అనేది, నమ్మటం నమ్మకపోవటం బట్టి ఏర్పడుతుంది. దీనిచే నమ్మకంఅనెడి భావానికి ఉన్న శక్తి ఎంతటిదో గుర్తించాలి. నమ్మకం భావాలను చేష్టలను నియంత్రించగలదు.

7) సినిమాలోని కల్పిత సంఘటనలను చూస్తూ, నిజంగా జరుగుతున్న రీతిలోవలె స్పందిస్తుంటాం. ఇలా స్పదించాలంటే, యదార్థతే ఉండనవసరం లేదు. ఫలానాచోట ఫలానా విధంగా జరిగింది అన్న దినపత్రికలలోని వార్తను నమ్మి తదనుగుణంగా స్పందిస్తాం. ఇది కల్పితం అయినా పైది జరుగుతుంది.

8) గతము వర్తమానము మన కళ్ళకు కన్పించవు. కాబట్టి అనేకమైన వాటిని నమ్మటం సహజం. నమ్మింపజేయటం, తదనుగుణంగా ఆలోచింప జేయటం సాధారణమే. ఇలాగ ఎందరో ఎందరినో, నమ్మించి మోసగించటం మనకు తెలుసు. ఎవరి మనస్సులో ఏమే ఉద్దేశాలు ఉన్నవో తెలియదు కాబట్టి అలా జరుగుతుంది. మానవులలో సత్ప్రవర్తన కొరకు అని, మతాలుకొన్ని నమ్మకాలను మతాచారాలను ప్రవేశపెట్టాయి. ఆ నమ్మకాల ద్వారా ప్రవర్తించటం ఉందిగాని, యదార్థాన్ని బట్టిగాదు.

9) కేవలం నమ్మకం లేదా నోటిమాట ఆధారంగా కార్లు, ఇళ్ళు, పొలాలు వంటివి ఎందుకు కొనరు? మాటనమ్మిక మీద డబ్బును అప్పుగా ఎందుకు ఇవ్వరు? బంగారపు ఆభరణం నిసలైనదో నకిలీదో రుజువు పర్చుకోకుండా కొంటే, ఏమవుతుంది? పైరుకు తగిన ఎరువు ఏదో తెల్సుకోకుండా వాడితే ఏమి ప్రయోజనం?

10) గ్రుడ్డిగా నమ్మి విశ్వసిస్తే అనేకులు మోసగిస్తారు. కాబట్టి తమ నమ్మికకు ఆధారం చూస్తారు. తమకు ఉన్న నమ్మిక సరైనది కాకుంటే, నష్టపోక తప్పదు. కాబట్టి అబద్ధమో నిజమో పరిశీలించుకొని పనులు చేస్తారు. తాము విశ్వసిస్తున్న వ్యక్తులు నమ్మతగ్గ వారవునో ,కాదోనని సైతం పరిశీలిస్తుంటారు. తమ ఆలోచన సక్రమమైనదో కాదో పరిశీలిస్తారు. తాము గైకొన్న నిర్ణయాన్ని పునఃపరిశీలించు కుంటారు. తాము పోయేడిమార్గం సరైనదో కాదో రూఢి చేసుకుంటారు. ఇట్టి పరిశీలన లేకుంటే కష్టనష్టాల పాలవవలసి ఉంటుంది కాబట్టి ప్రతిది పరిశీలిస్తారు. తెలియని వాటిగూర్చి తెల్సుకుంటారు.

11) ఒకరి ప్యాక్టరీనుంచి విడుదల అయ్యేడి వస్తువులు నాణ్యత కలవి అయితే, వాటిని పరీక్షించి నిజమోకాదో తెలియజేయ బోతే యజమానికి అభ్యంతరం,ఎందుకు? ఫలానా వస్తువు నాణ్యత కలది అని ప్రచారంచేస్తే

నడిపోతుందా? నాణ్యత కలది, లేనిది ఎలా తెలుస్తుంది? పరీక్షించాలి. అలాగే తమకున్న నమ్మక విశ్వాసాలు నిజమవునో కాదో తెలియాలి. ఇలా తెల్సుకోవాలంటె సాధ్యపడేవి. సాధ్యపడనివి ఉంటాయి. కాబట్టి శాస్త్రీయ ఫలితాల ఆధారంతో నమ్మక విశ్వాసాలను కల్గి ఉండడం తప్పని సరి.

12) ఒకరు నమ్ముతున్నారని మరొకరు నమ్ముతున్నారు. ఆ నమ్మేవారి నమ్మకం అబద్ధమయితే-కొందరు ఆచరిస్తున్నారని మరికొందరు ఆచరిస్తున్నారు. ఆచరిస్తున్నవారి ఆచరణ నిష్ప్రయోజనమైతే; అనుసరించేవారి నమ్మకాలు ఆచరణలు నిరర్థకం కదా! ఇంతకు ముందున్న నమ్మక విశ్వాసాలు మనపై ప్రభావం జూపుతూ, తప్పుడు పంథాలోకి నెట్టుతాయి వేటిని ఎందుకు నమ్ముతున్నామో, వాటిల్లోని నిజానిజాలేమిటో తెల్సుకుంటే తప్పుడు పంథాలోకి నెట్టబడము.

13) అబద్ధాలను అసత్యాలను నమ్మితే, ఆనమ్మిక ప్రకారంగా ఆలోచన నిర్ణయం కొనసాగుతుంది. అసత్యాలతో కూడిన ఆలోచన నిర్ణయం నిష్ప్రయోజనమేకాక, కష్టాలను కల్గిస్తాయి అందుచే అసత్యాలకు మన జీవితంలో అయినా సమాజంలో అయినా స్థానం యివ్వరాదు వీటికి స్థానం ఉంటే ఇవి మస్తిష్కంలో ఉంటూ, మన ఆలోచనను నిష్ఫలమైన మార్గంలోకి నడిపిస్తాయి. కాబట్టి మనం నమ్మేడి ప్రతివిషయం నిజమో కాదో, అదె లాంటి ఫలితం ఇస్తుందో, మొదలగు వాటిపై యదార్థతను తెల్సుకుంటే, మన మస్తిష్కంలో ఉండే ప్రతివిషయం సరయినది అవుతుంది. సరైన విషయాలకే స్థానం ఇవ్వటంవల్ల సరయిన ఆలోచనే కొనసాగుతుంది.

14) ఒకనమ్మకం సరైనదయితే, దానిని పౌరులందరూ విశ్వసించాలి. ఒకనమ్మకం అబద్ధమయితే, దాని వ్యాప్తి లేకుండా ఖండించాలి. ఎవని నమ్మకము వానిది అనుకుంటే, ఆఒక్కనితోనే అది అంతం అవటంలేదు. వాని

కుటుంబ సభ్యులకే కాకుండా, మిగతావారికి వ్యాపిస్తుంది. ఒక సమాజం యొక్క నమ్మక విశ్వాసాలు ఏమిటో పరీక్షించి, ఆఫలితాల ప్రకారంగా జీవించకుంటే కష్టాలు తప్పవు. ఎవరి ఇష్టం వారిది అనుకొని మూఢవిశ్వాసాలకు స్థానం ఇస్తుంటే, ఆ మూఢవిశ్వాసాలు ఆసమాజాన్ని వేధిస్తాయి. కొందరి బ్రతుకులను బలిగొంటాయి.

15) సరికాని నమ్మకాలకు ఏదోఒక రీతిలో, ఒక సమాజం ఆదరణ ఇస్తుంటే, ఏదోవిధంగా పోషింప బడతాయి. నమ్మనపుడు ఆచరించరు. ఆచరింపనపుడు అవి నశిస్తాయి. రాబోయే తరాలవారికి బానిసత్వం తప్పుతుంది. ఎవరయినా కాలం చెల్లిన భావాలను, తమ సరికాని నమ్మకాలను ప్రచారం చేయుటం కూడనిది.

16) తమకు కొన్ని తెలుసు అన్న అహం తప్పితే, తమకు తెలియనివి తెలుసుకోవడం లేదు. తాము తెల్సుకోలేనప్పుడు, శాస్త్రవిజ్ఞానం ఏదినిర్ధారిస్తే అది నమ్మాలి. తాములా నమ్మము అంటె యదార్థతను పరిశీలించాలి. ఇదేమీ లేకుండా సనాతన భావాలకు మూఢవిశ్వాసాలకు స్థానం ఇస్తామంటే కుదరదు. ఒకనికి వుండే అజ్ఞానం, ఒకనికి వుండే మూర్ఖత్వం, ఒకనికి వుండే మూఢనమ్మకాలు-ఇలా వ్యక్తులందరివి కలిస్తే, ఒకదేశంలో ఎంతో జనాభా ఇలాంటి అసత్యాలతో కూడిన మూఢత్వాన్ని కలిగిఉండడంచే మిగతా ప్రజానీకము కష్టాల నెదుర్కొంటుంది. కాబట్టి యదార్థతను గుర్తెరగడం కర్తవ్యం.

17) జీవితంలో సమస్యలుఉండడం కొత్తగా ఏర్పడడం వుంటున్నప్పుడు మూఢనమ్మకాల ప్రభావానికి లోనవకుండా యదార్థదృష్టిని అలవర్చుకోవాలి. ఒక నిర్ధారణకు వచ్చేముందు, నిర్ధారిత విషయాలపై శాస్త్రీయ అవగాహన వుండాలి. నమ్మటం విశ్వసించటం ఆధారరహితంగా వుండరాదు.

ఒకరి లేదా ఒక దేశస్థుల నమ్మక విశ్వాసాలు సరైనవి కాకుంటే, ఆ ప్రజల యొక్క కాలాన్ని శ్రమను నిరుపయోగం చేస్తుంటాయి. ఒకరి జీవితకాలం ఇందుకొరకు కేటాయింపబడ కూడదు. ఒకరికాలం సద్వినియోగం కాకున్నా, మౌనంగా విశ్రాంతిగా గడుపుతున్నా ఫర్వాలేదు. కాని ప్రయోజనరహితమైన నమ్మకాలకు సంబంధించినవాటిల్లో గడపటం వుండకూడనిది. సరికాని నమ్మకం, సరికాని విశ్వాసం, మనిషిని మోసగింపజేస్తుంది. మనల్ని వంచించేవి, మన శత్రువులని గుర్తించకుండా, మన మస్తిష్కంలోనే వాటికి స్థానమిస్తే జీవిత సంతృప్తి సాధ్యపడని దవుతుంది? మనకుండే నమ్మక విశ్వాసాలు వర్తమానాన్ని భవిష్యత్తును తీర్చిదిద్దేవిగా ఉండాలి. హానికల్గించేవి కారాదవ్వాలంటే, శాస్త్రరీత్యా విషయాలను నమ్మాలి లేదా తిరస్కరించాలి. శాస్త్రరీత్యా విషయాలకు ఆమోదమో లేక అనంగీకారమో తెల్పాలి. జీవితకాలం, ఆస్తి పేరుప్రఖ్యాతులు డబ్బు ఎన్నింటికన్నా విలువైనది. ఈ జీవితకాలాన్ని నిష్ప్రయోజనమైన వాటిచేత హరింపు చేసుకోకూడదు. ఎందరినో నమ్మి మోసపోవటం వల్ల నష్టం ప్రత్యక్షంగా కన్పిస్తుంది. సరికాని నమ్మకవిశ్వాసాలచే వంచింపబడి ఖర్చుచేసే జీవితకాలం, కష్టార్జితంయొక్క నష్టం, గుర్తిస్తేకాని కనిపించని రీతిలో ఉంటుంది.

# 8. మతములు

1) దేవుడు, జీవుడు పరలోకం వంటి తదితర మతభావనలు నేటి మతాలకు ముందు, ఆ మతాలకు ముందు, అలా ఏనాటినుండో సమాజంలో స్థిరపడ్డాయి. ఒకమతంలోని నమ్మకాలకు కారణం అంతకు ముందున్న మత నమ్మికలు. ఈ నమ్మికలకు అంతకుముందున్న మతాలు. ఇలా గతంలోకి పోతుంటే మతాలకు అధారం, ఒకనాటి నమ్మక విశ్వాసాలు అని తెలుస్తుంది. ఈ నమ్మక విశ్వాసాలకు కారణం ఊహించలం.

2) ఊహకు ఆధారం ఊహ. ఈఊహకు ఆధారం అనవగాహన. తమకుండే అనవగాహనతో ఊహించేవారు ఈ ఊహ సరైనదో, కాదో నిర్ధారింపబడే వీలులేదు. ఎందుకంటే దేవుడు జీవుడు పరలోకం వంటివి కంటితో చూస్తున్నవికావు. తెలియనివాటిగూర్చి ఎవరేమి ఊహించి ప్రచారం చేసినా వాటికి స్థానంఉండే సమాజంలో అవేనమ్మకాలుగా స్థిరపడతాయి. ఈ నమ్మకాలు మతవిశ్వాసాలై నాగరికతా స్థాయిని బట్టి పరిణామం చెందుతు వచ్చాయి.

3) తెలియనప్పుడు ప్రతిది వింత గొలుపుతుంది. ఈ ప్రకృతి ఎన్నో అద్భుతాలతోకూడి ఉండడమేగాక, ఎన్నో సంఘటనలకు కారణమవుతుంటుంది. దీనిచే ఇవిలా జరిగేందుకు ఎవరో కారణమనిపిస్తుంది. ఈప్రకృతినంతా ఎవరో సృష్టించినట్లు మరియు నియంత్రించుతున్నట్లుండే ఊహ

నమ్మకగా ఏర్పడటము సహజం. ఈ కారణంగా, ఈ విశ్వాన్ని దేవుళ్ళు, దేవతలు, మరేవో శక్తులు పరిపాలిస్తున్నాయని భావించారు. మానవులకు ఉన్న భూలోకంవలె, దేవుళ్ళకు పరలోకం ఉంటుందని నమ్మారు. భూమికి ఆకాశానికీ, సముద్రాలకు, నదులకు, అడవులకు, పాడిపంటలకు, వర్షాలకు ఇలా అన్నిటిపై ఆధిపత్యము నియంత్రణ దేవుళ్ళకు ఉందని, వారికి ఆగ్రహం కలిగితే కష్టాలు, నష్టాలు, క్షామము,వ్యాధులు, మరణాలు ప్రాప్తిస్తాయనే భావన నమ్మకగా మారింది. తమతమ ప్రాంతాలలో నివసిస్తుండే వారు ఎలా భాషలను సృష్టించుకున్నారో, అలాగే జాతి సంస్కృతి నమ్మకాలపేర మతాలను దేవుళ్ళను సృష్టించుకున్నారు.

4) మతాలకు ముందున్న మతభావనలలో, తమకు నచ్చిన మార్పులు-చేర్పులు చేసుకొని, ఎందరో ఎన్నో మతాలను నెలకొల్పారు. అందుకే మతవిషయాలలో సారూప్యత ఉంటుంది. నేడున్న ప్రధాన మతాలను తమ విశ్వాసాలకు అనుగుణంగా స్థాపించటం వల్ల, భిన్నమైన విశ్వాసాలతో కూడిన మతవిధానాలు అనుసరింప బడుతున్నాయి. మతాన్నిబట్టి మతవిధులు మతవిశ్వాసాలు మారాయి. క్రీస్తు, మహమ్మద్, బుద్ధుడు వంటివారు మతాలను ఏర్పరచలేదు. ప్రవక్తల బోధనలు తదుపరి ఎప్పుడో మతాలుగా రూపొందాయి. ఆమత బోధనలను అనుసరించేవారు ఆమతస్థులు అయ్యారు. క్రీస్తుకుముందు మహమ్మద్‌కుముందు, ముస్లిం, క్రైస్తవ్యం వంటిమతాలు లేవు. ఈనాటి మతస్థుల పూర్వీకులకు, ఈనాటి మతాలు లేవు.

5) కొత్త మతాన్ని ప్రవేశ పెట్టకుంటే, అంతకుముందు ఉన్న మతాలు ఆ మతభావనలు అప్పటి ప్రజలలో కొనసాగుతుంటాయి. పాతమతాలను తిరస్కరించాలన్నా మరోమతంవైపు ఆకర్షింప జేయాలన్నా, పాతమతాల లోని లోపాలను సవరిస్తూ మతాకర్షణకు సంబంధించిన అద్భుతాలను ప్రవేశ పెట్టాల్సి వుంటుంది. ప్రవక్తల బోధనలు ఆధారంగా కొత్త మతాలు స్థాపించ బడి, ప్రచారం చేయబడినవంటే దీనికంతా కారణం సంస్కరణాభిలాష.

మతప్రచారాన్ని కొనసాగించకపోతే సంస్కరణభావాలు నశిస్తాయి. సమాజ శ్రేయస్సును కాంక్షించినవారు. ఒక మతస్థాపనకు, ప్రచారానికి సంసిద్ధులవ టంతో. అంతవరకూలేని మరోమతం నెలకొంది.

6) సమాజంలోవున్న లోపాలకు స్పందించి, వాటికో పరిష్కారాన్ని కనుగొనే ప్రయత్నంలో, కొత్తఆలోచన కల్గుతుంది. ఇట్టి ఆలోచనలే ప్రవక్తలద్వారా వెల్లడయ్యాయి. అంతకుముందు వున్న మతాలలోలేని విశిష్టత ఏదో ప్రవక్తల బోధనలలో వుండబట్టి, మరోకొత్త మతస్థాపనకు ఆమత ప్రచారానికి ఎందరెందరో కృషి చేయకలిగారు.

7) మనిషికి పేరులేనపుడు, ఫలానా మనిషికి సంబంధించిన ఆస్తి ఇది, అని చెప్పగలరా? అలాగే తమభావాలను, సిద్ధాంతాలను వెల్లడించాలంటే అందుకు ఏదోపేరు పెట్టాలి. అలాంటి పేర్లే యూదుమతం క్రైస్తవమతం ఇస్లాంమతం. ఇలా 500 మతాలుదాకా ఉన్నా, ఓ 10 మతాలకుమాత్రమే నేడు ప్రాధాన్యత ఉంది. రాజకీయ పార్టీలకు వలె మతాలకు, ప్రవక్తల పేర్లుగానీ, వేరేగాని పెట్టబడ్డాయి. మతగ్రంథ విషయాలు ప్రచారంలోకి ఆచరణలోకి వచ్చేందుకు, మతాలపేర వ్యాప్తి చేయబడ్డాయి.

# 2

1) రాజకీయ పార్టీలు తాము అధికారాన్ని హస్తగతం చేసుకుంటానికి, ఎలాంటి నీతిబాహ్యమైన క్రూరమైన పనులు సాగిస్తాయో అలాగే మత వ్యాప్తికొరకు ఎందరో ఎన్నోవిధాల ప్రయత్నించబట్టి, నేటి ప్రధానమతాలు వందలాది మతాలను అణగద్రొక్కివేసి, ప్రపంచవ్యాప్తంగా సుస్థిర స్థానాన్ని సాధించగలిగాయి. ఒక మతం తనస్థానాన్ని నిలుపుకోవాలన్నా, అన్యమతాల నుండి రక్షణపొందాలి. అందుచే అన్యమతాల దాడిని ఎదు

ర్కొనే శక్తిగల మతంగా, తమమతాన్ని కల్పనలతో అతిశయోక్తులతో శక్తివంతం చేస్తారు. మతాన్ని విమర్శించే ధైర్యం ఎవరికి లేకుండా, గతంలో క్రూరత్వాన్ని అవలంబించి వుండడంవల్ల, మతప్రచారంపై సమ్మకము నిర్విఘ్నంగా కొనసాగింది.

2) మతాలు మతగ్రంధాలకు ఉన్న లక్ష్యాలవల్ల అవి ప్రవక్తల బోధనలు అయినా కాకున్నా, సంఘసంక్షేమాన్ని దృష్టిలో వుంచుకుని తమ మత లక్ష్యాలకొరకు, ఎందరెందరో ఎంతెంతో కాలాన్నివెచ్చిస్తూ, తమ జీవితాలను అంకితం చేసుకున్నారు. ఎన్నో కష్టనష్టాలను భరించి ఎందరెందరో మతప్రచారంచేసి వుండబట్టి కొద్దిమతాలు ప్రపంచవ్యాప్తం కాగలిగాయి.

3) మతఅవసరం లేదని తెలిసి మతంనుండి విముక్తి కలిగించినా, ఆ స్థానంలో మరోమతం ప్రవేశిస్తుంది. ఆ విధంగా ఒకదేశ ప్రజలు మరో మతానుయాయులు అవుతారేకాని మతం తొలగదు. ఎవరికివారు తమ మతాలను స్థిరపరచే దృష్టిని విడనాడనందుచే, ప్రతిమతము తన స్థానాన్ని భద్రపరచుకునేందుకు వ్యాప్తి చేసేందుకు పోటీపడక తప్పటం లేదు.

4) బలవంతం లేదా హింస లేదా అంగీకారం ఎలా మతం స్వీకరింపజేయబడ్డా, అదలా వారసత్వపు సఖ్యాలను పెంచుతుంది. తల్లితండ్రులకున్న మతంవల్ల, పుట్టకముందే ఒక మతానికి చెందినవారవుతున్నారు. మతం వారసత్వంగా రావటంవల్ల తన అనే అభిమానాన్ని ఎవరికివారు కల్గి వుంటున్నారు. తన అనేటి అభిమానం మతాన్ని సంరక్షిస్తూంది.

5) దైవము మతము వేర్వేరని తెల్సుకోనందుచే, తమ మతాలపై అభిమానాన్ని అనుబంధాన్ని పెంచుకున్నారు. తాతతండ్రులనుంచి ఆస్తికి వలె, మతం మతసంబంధ ఆదరణలు తమవిగా సంక్రమిస్తున్నాయి. కాకి పిల్ల కాకికిముద్దు అన్న సామెతవలె, తమది ఎలాంటిదైనా మతాభిమానాన్ని పెంచుకోవటంచే, ఎవరిమతం వారికి పరిపూర్ణత కలదిగా కన్పిస్తోంది. ఇలాంటి మనస్తత్వంవల్ల పరమత సహనం లోపించింది.

6) మతమును, దైవమును విడగొట్టలేనంతగా కలిపివేయటంవల్ల, దైవ విశ్వాసమంటే మతవిశ్వాసమేనన్న భావన స్థిరపడింది. దైవముపై ఉన్న ప్రేమవల్ల ఆ ప్రేమ ప్రభావంవల్ల, మానవ జీవితంనుండి విడగొట్టలేని విధంగా రక్షణ పొందుతోంది. ఈ మత నమ్మికచే మతదృష్టి ఏర్పడి, మతం జీవన విధానంగా కూడా నిలవకల్గుతున్నది. జీవనవిధానంలో మత ప్రభావం ఇమిడిపోవటంచే మతపరమైన అభిమానము నిలచి ఉంది. దైవ సంబంధిత విషయాలకు సామాజిక వ్యవహారాలకు మత ప్రాధాన్యత నేడు ఉంది. వివిధమతాలకు ఉన్న భిన్నమైన ఆలోచనా ధోరణులవల్ల, విభిన్న మతస్థుల మధ్య భిన్నమైన జీవన విధానం ఏర్పడింది.

7) మతప్రవక్తలను ప్రేమించినందువల్ల తామొక మతానికి చెందిన వారనుకోవటంవల్ల కష్టాలులేవు. దైవాన్ని పూజిస్తున్నందువల్ల ప్రేమిస్తున్నందువల్ల ఎవరికి ఎలాంటి కష్టములేదు. కష్టనష్టాలు దైవమును ప్రేమించటంవల్లకాక, మత విధానాలు మతాచరణలువల్ల సంభవిస్తున్నాయి. శాస్త్ర విజ్ఞానం తెలియకున్నా సాంకేతిక పరిజ్ఞానం చేకూర్చిన భౌతికసౌకర్యాలను అనుభవించటానికి ఎలా అవరోధం లేదో, అలాగే సృష్టికి కర్త దేవుడే అనుకున్నా అంతా దేవుని నిర్ణయానుసారం జరుగుతోందనుకున్నా, శాంతి సౌఖ్యాలతో జీవించటానికి ఏ అవరోధమూ లేదు.

8) మానవులు విడనాడని దుష్టస్వభావాలు దుర్లక్షణాలు స్వార్థ దృష్టి వల్లనే, మొత్తం మానవాళి కష్టనష్టాల సుడిగుండంలో పరిభ్రమిస్తోంది. మతం పేర దేవునిపేర పాటించే ఆచారవ్యవహారాలు, విడనాడకూడనివని వహించే పట్టుదలలవల్ల, కష్టాలు తొలగటంలేదు. శాంతి సౌఖ్యాలను హరిస్తున్నది అజ్ఞానం. సంస్కరణలకు పురోభివృద్ధికి ఆటంకం తామే అయి, అవరోధకులవటంచే కష్టాలు నేటికి పీడిస్తున్నాయి.

9) కష్టాలనుంచి ఆవేదనలనుంచి విముక్తం అవటానికి వేటిని అనుస

రించాలో. వాటిని అనుసరించకుండా కష్టాలతోనే జీవితం గడపమనేది, దేవుని ఆదేశమవుతుందా? ఏ మార్పు లేకుండా ఏ సంస్కరణ లేకుండా గ్రుడ్డిగా జీవితాన్ని కొనసాగించుకొమ్మని దేవుడు చెప్పునా? ఎంత క్రొత్త దుస్తులు అయినా లేదా ఎంత మన్నికగలవైనా దేహానికి సరిపడనప్పుడు వదిలేస్తారు కాని, వాటినెలా ధరించగలరు?

10. శరీరం పెరుగుదలతోబాటు అనుభవాల జ్ఞానంతోబాటు పాత వస్త్రాలను పాతభావాలను వదిలేయటం సహజం. బాల్యంలోని ఉద్దేశాలు అనుభవాలు నిర్ణయాలు స్థానే, వయస్సు విజ్ఞానంతో నూతన భావాలను నూతన నిర్ణయాలను చేసుకుంటూ ముందుకు సాగుతారు. అలాంటిదే సమాజం కూడా. జనాభా పెరిగింది. అవసరాలు మారాయి. పరిస్థితులు మారాయి. అనుభవాలు పెరిగాయి. శాస్త్రవిజ్ఞానం వికసించింది. ఇట్టి సమాజాన్ని దృష్టిలో పెట్టుకొని. పరిస్థితుల కనుగుణంగా జీవన విధానాన్ని నిర్ణయించుకోకుండా, సనాతన భావాలతో గడుపుతామంటే నష్టపోయేది ఎవరు ?

# 3

1) రహదారులు లేనప్పుడు అడ్డదిడ్డమైన దారులలో ప్రయాణిస్తూ, ఎలాగోలాగ ముందుకు సాగుతూ, చెమటలు గ్రక్కుతూ గమ్యం చేరుకోక తప్పదు. అన్నివిధాలా సౌకర్యంగా ఉండే, సిమెంటు తారురోడ్లతో కూడిన రహదారులు ఏర్పడి ఉంటే; పాత రహదారులను విడిచిపెట్టేయక, తాతముత్తాతలనాటి సంప్రదాయమని అనుసరించగలరా? అలాగే గతకాలంనాటి పరిస్థితులను అధిగమించి, వివిధరంగాలలో చైతన్యవంతమైన ప్రగతిని సాధించాము. కాబట్టి మన ముందున్న శాస్త్రప్రగతిని తెల్సుకుంటూ, వివేకయుతమైన మార్గాన్ని అనుసరించాలి.

2) ఒకదేశం ఎదుర్కొనే సమస్యలు, మరొకదేశం ఎదుర్కొనే సమస్యలు వేర్వేరవుతున్నాయి. బాలబాలికలు యువకులు దంపతులు, వృద్ధులు, ఇలా వారి వారి సమస్యలు వేరుగా ఉంటున్నాయి. వివిధరంగాలనుబట్టి వివిధ వృత్తులనుబట్టి సమస్యలు వేర్వేరవుతున్నాయి. వాతావరణం సముద్రాలు అంతరిక్షవంటి వాటి సమస్యల స్వరూపం వేరవుతోంది. ఈనాటి సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితులను క్షుణ్ణంగా అధ్యయనంచేసి, అందుండి మాత్రమే మనం ఎదుర్కొనే సమస్యలకు పరిష్కారాలను కనుగొనగలం కాని, ఈనాటి పరిస్థితులకు ఏలాంటి సంబంధం లేని వందల వేల సంవత్సరాలనాటి మతదృష్టితో ఏమి సాధించగలం ?

3) వేటిల్లోనైతే మనకు శిక్షణ ఒసంగేందుకు మతం ఉద్దేశించబడిందో, ఆ శిక్షణ పరిపాలనద్వారా నెరవేరుతున్నది. చట్టాలు నియమ నిబంధనలు, మానవుల ప్రవర్తనను నియంత్రిస్తున్నాయి. మతం నిర్వహించాల్సిన పాత్ర ఏదిలేనంతగా, సమాజంనుండి శిక్షణను పొందుతున్నాం. ఈ పురోభివృద్ధివల్ల అవగాహన ఆలోచన పెరిగింది. దీనిచే మతంనుండి ఏది నేర్చుకోవలసిన పరిస్థితి ఎవరికిలేదు.

4) జీవనవిధానం ఎలా ఉండవలెనని తెలుసుకునేందుకు, దేశదేశాల ప్రజల అనుభవాలే కాకుండా, మన తోటి ప్రజల అనుభవాలు మనముందున్నాయి. ఒకని జీవితం ఒకనికి ఎన్నో జీవనసత్యాలను తెలుపుతున్నది. కాబట్టి స్త్రీపురుష సంబంధాల గూర్చి, వివాహం గూర్చి, దినసరి కార్యక్రమాల గూర్చి, పరస్పర సంబంధాల గూర్చి, మతగ్రంథాలు తెలియజెప్పితేకాని, తెలుసుకోలేని స్థితిలో నే డెవరూలేరు.

5) గతకాలంలోని ప్రజలను సంస్కరించేందుకు మతాలు ఉద్దేశించబడినాయి. ఆ సంస్కరణ ప్రయోజనం కొరకే మతాలు పరిమితం అవ్వాలి.

శాస్త్రరీత్యా సాక్ష్యాధారాలులేని కాలంలో, అశాస్త్రీయ భావాలే ప్రచారంలో ఉంటాయి. మతభావనలు సరైనవి కావని ఖండించేవారున్నా, ఖండించిన వారు శాస్త్రీయ సమాధానాలను ఇవ్వలేనట్టివారు. కాబట్టి నమ్మకాలు స్థిర పడ్డాయి. మతం సర్వస్వం అనుకుంటే, అలాంటివారి మేధస్సులో ఉండేవి సరికాని భావనలే.

3) ఎక్కడైతే వేటిపై పరిశీలన పరీక్షించటం ఉందో, అక్కడ నిజం ఎంతో అబద్ధం ఎంతో తెలిసిపోతుంది. ఇట్టి పరీక్షను ఎదుర్కొనే శక్తి మతగ్రంథాలకు లేదు. సాధారణ ప్రజానీకం ఎలా ఉన్నా, విద్యావంతుల ధాటికి అశాస్త్రీయత నిలవదు. దీనిచే మతం తప్పుడు భావాలతో కూడిఉన్న దని ప్రచారం చేస్తారు. ఇది జరిగితే ఆ మతాన్ని విశ్వసించేవారు ఉండరు. నిర్ధారణకు నిలవని విషయాలెన్నో మత గ్రంథాలలో ఉండటంవల్ల పరీక్షిస్తే అసత్యవిషయాలుగా ప్రచారమయి మతానికే ముప్పు వాటిల్లుతుందని, మత విధానాల గూర్చి ప్రశ్నించటం పరీక్షించటం దైవధిక్కారం అంటుంది.

4) మతాలకు ఉన్న లక్ష్యాలు ఏవయినా, ఆ అనుకున్న లక్ష్యాల దిశగా హీనవాళిని మరల్చినతరవాత, మరింత ఉన్నతమతంలోకి తీర్చిదిద్దాల్సింది. ఇది సాధ్యపడాలంటే, ఎప్పటికప్పుడు పరిశీలన పరిశోధనలద్వారా సంస్కరించుకునేది వీలుండాలి. దీనిని మతాలు వ్యతిరేకించాయి. తమకు తెలియని వాటిగూర్చి తెలియనట్లు కాకుండా, తమకు తెలిసిందే సర్వకాలాలకు అనుసరణీయమైనట్లు వెల్లడిస్తే, అది తెలివితక్కువ కాదా? ఆతెలివి తక్కువకే పట్టం కట్టితే కష్టాలపాలయ్యేది ఎవరు?

5) న్యాయదృష్టి స్వార్థదృష్టితో కూడిన ఆలోచన వేర్వేరు. వ్యక్తి శ్రేయస్సు దృష్ట్యా ఉమ్మడి శ్రేయస్సు దృష్ట్యా కలిగే ఆలోచన వేర్వేరు. తానువేరు ఇతరులు వేరు, తాను ఇతరులు ఒకటేనన్న, దృష్టితో కూడిన

ఆలోచన వేర్వేరు. శాస్త్రీయ అశాస్త్రీయ దృక్పథాలతో కూడిన ఆలోచన వేర్వేరు. మానవసహజమైన బలహీనతలను అధిగమించినవారు ఉండవచ్చు లేదా అధిగమించలేనట్టివారు ఉండవచ్చు. ప్రవక్తలు మానవులే కాబట్టి, వారు చెప్పిందే ధర్మమని, ఆ ధర్మాన్ని పాటించటమే కర్తవ్యమని అనుకోరాదు.

6) ఒకరు లేదా అనేకులువారు ఏర్పరచుకున్న దృష్టినిబట్టి, వారికో దృక్పథం ఏర్పడుతుంది. దీనినిబట్టి వారి ఆలోచన కార్యాచరణ కొనసాగుతుంది. మతగ్రంథాలలోను, నేటి సామాజిక ఆర్థిక రాజకీయరంగాలలోను, పైవన్నీ కలసిపోయినవి. కాబట్టి మతగ్రంథాలను వదలివేయాలి. పరిపాలనలో విప్లవాత్మకమైన మార్పులు ప్రవేశపెట్టుకోవాలి. జీవన విధానాన్ని సంస్కరించుకోవాలి.

# 5

1) మతాలు వేటిగూర్చి ఏమేమి వెల్లడించినా ఎవరూ కాదనరు ఇవన్నీ దైవవాక్కుగా ప్రచారంచేసి నమ్మించటంవల్ల, మార్పుకు సంస్కరణలకు ఆటంకమయ్యాయి. మతాలు సంస్కరణను త్రోసిపుచ్చటంవల్ల, మానవాళికి శ్రేయస్కరమైన విధానాలను ప్రవేశపెట్టుకోలేని స్థితిఏర్పడింది. దైవంపై విశ్వాసము ప్రేమ వేరు. మతవిధానాలు వేరు. వేటికవి విడిగా చూడకలిగే దృష్టిని అలవరచుకుంటే, మతమౌఢ్యం ఉండదు. మతాన్ని ద్వేషించినా విడనాడినా, అది మతానికే సంబంధము. మతాలను ద్వేషించటం, దేవుణ్ని తిరస్కరించటం అవదు. దైవ ప్రేమవేరు, మతతిరస్కారం వేరు.

2) పరలోకము జీవుడు స్వర్గనరకాలు వంటివి ఉన్నాయని, మత గ్రంథాలు చెప్పినవి కాబట్టి, అదే మననమ్మకాలకు ఆధారం. వేరేసాక్ష్యాలు

ఆధారాలులేవు. ఎక్కడా ఎవరికి ప్రత్యక్ష అనుభవంలేదు. మననమ్మకాలకు ఆధారమయిన మతగ్రంథాలు ఒక కల్పన అయితే, మన నమ్మకాలన్నీ కల్పితాలపై ఆధారపడ్డట్లు.

3) దైవము ఒక్కరే అయినప్పుడు విభిన్నమతాలు సిద్ధాంతాలు విభేదాలు ఎందుకు? మతభావనలలో ఉండే ఆ పరస్పర విరుద్ధతవల్ల, మతగ్రంథాలు కొందరి ఊహ ఆలోచన అని స్పష్టపడుతోంది. దేవునిని గూర్చి సవ్యమైన అవగాహనే చేకూర్చలేకపోయినవి మతాలు, ఇక ఆ మత వాక్కు ఎలా దైవవాక్కు కాగలదు? దైవము మతాలను మతగ్రంథాలనుకాక, ప్రపంచ పౌరులందరికి ధర్మాలను న్యాయసూత్రాలను విజ్ఞానాన్ని అందించేవాడు. అట్టి విజ్ఞానం లేదా అట్టి మతం, ఎక్కడైనా ఒక్కటిగానే ఉండేది. ఇట్టి ఏకత్వంలేదు కాబట్టి, మత విషయాలు దేవుని వాక్కుకాదు.

4) మతగ్రంథాలు దైవవాక్కు అనేందుకు ఏమిటి ఆధారం? తమకది దైవసందేశంగా వినిపించిందనో, దేవదూత ద్వారా చెప్పబడిందనో, ఆ గ్రంథాలలో వ్రాసి ఉంది కాబట్టి, అదే సాక్ష్యము. ఈ గ్రంథాలు ఆయా జాతులు ఆయా ప్రాంతాలలో కొందరిచే వ్రాయబడి, తదుపరి ఎప్పుడో ముద్రింపబడినవి కాని, పరలోకంనుంచి ఇక్కడకు రాలేదు. పరలోక సామ్రాజ్యం దేవునికి ఉన్నప్పుడు, ఆ దేవుని అధీనంలో దేవదూతలు ఉన్నప్పుడు, వారే గ్రంథరూపేణా మానవాళికి అందించే పనికదా! వందల కోట్ల ప్రజానీకం యొక్క నిమిషాలవారి గంటలవారి రోజువారి పాపపుణ్యాలను లిఖించే దేవదూతలు, మానవాళికి, మతగ్రంథాన్ని ఇవ్వలేని శక్తిలేని వారెలా కాగలరు?

5) మతగ్రంథాలవల్ల మానవాళి కష్టాల పాలవకుండా ఉంటే, దేవుని వాక్కు అయినా కాకున్నా, దానిని గూర్చి ఆలోచించాల్సింది ఉండేదికాదు. దేవుని వాక్కు అని నమ్మిస్తున్న మత గ్రంథంలోని, దాని సంబంధిత గ్రంథాలలోని మత విద్వేషాలవల్ల, కష్టాలు ప్రాప్తిస్తున్నాయి కాబట్టి. మత

గ్రంథాలు మామూలు గ్రంథాలవంటివన్న నిజాన్ని తెల్సుకున్నప్పుడే, మత భావనలు వదలిపోతాయి.

6) దేవుడు మత గ్రంథాలద్వారా మంచి ఏదో చెడు ఏదో చెప్పారంటారు. ఈ మంచీ చెడులను పాటించకపోతే, నష్టపోయేది మనం కాని దేవుడుకాదు. దేవుని నిర్ణయాలను త్రోసిపుచ్చినా దేవునికి కోపం ఉండదు. మనవల్ల దేవునికి కష్టం కల్గుతుంటే, మనచేతలకు దేవుడు ఆగ్రహిస్తారు. ఇట్టిదేది లేదుకాబట్టి ఆగ్రహం అనేది అబద్ధం. మతవిధులు మత భావనలు దైవం ప్రవేశపెట్టినవనుకున్నా, వాటివల్ల సత్ఫలితాలు లేకుంటే, ఆచరించవద్దంటారుగాని, అవే ఆచరణీయం అని చెప్పరు.

7) నిప్పును తాకవద్దు, అతిగా ఖర్చు చేయవద్దు, మితిమీరి తినవద్దు, దొంగతనం చేయవద్దు, అని ఒకరు చెప్పారనుకోండి. ఆ చెప్పినవి పాటించకుంటే. వాటి ఫలితాలు ఉంటాయి. చేయకూడనివి ఏవైతే ఉన్నాయో, వాటిని ఒకదేశ ప్రజలు చేస్తుంటే, ఆ దుష్ఫలితాలచే ఆ సమాజమే గుణపాఠాన్ని నేర్చుకుంటుంది. అలాగే దేవుడు చెప్పినవి సరైనవి అయితే. ఆ సరైనవాటిని పాటించకుంటే, కష్టాల పాలయ్యేది ప్రజలు కాబట్టి, తిరిగి సరైన వాటినే అనుసరిస్తారు.

8) ఒక ఆచరణవల్ల మంచి జరుగుతుంటే, ఆ ఆచరణవల్ల ఎవరికయినా మంచి జరుగుతుంది. కాబట్టి ఇది వివేకవంతమైన చర్య అవుతుంది. ఒక ఆచరణ నిష్ప్రయోజనంగా ఉన్నా, అది వివేకరహితమైన చర్యయే అవుతుంది. తప్పులను తప్పులుగా, లోపాలను లోపాలుగా అంగీకరించాలా? వద్దా ?

9) దేవుని ఆలోచన నిర్ణయం సరైనది. సరైన భావన ఎవరికయినా ఒకటే. సరైన నిర్ణయాన్ని ఎన్నిసార్లు పరీక్షించినా, అది సరైననిర్ణయమే అవుతుంది. సరైనవాటిని తప్పు అన్నా, ఫలితాల సమీక్ష ఉంటుంది. అను

భవాలనిబట్టి సరైనపద్ధతులు ఏవో, తప్పుడు పద్ధతులు ఏవో తెలిసివస్తాయి. దేవుని వాక్కు కాకుంటే, తప్పుడు పద్ధతులతో నిర్ణయాలతో కూడి ఉంటుంది.

10) పాలనా సౌలభ్యం కొరకు, బ్రతకటం కొరకు, ఇష్ట వృత్తులు ప్రాంతాలు ఇలా విభజించుకున్నారుకాని, ఇట్టి విభజన దేవునికి ఎందుకుంటుంది? సత్యము ఎక్కడైనా సత్యమే. ధర్మము ఎక్కడైనా ధర్మమే. ఇట్టి సత్యసంధతతో కూడిన ధర్మాన్ని సత్యాన్ని, ఎవరికి స్ఫురింపజేసినా అది ఒక్కలాగే ఉంటుంది. ఆరీతిలో మతగ్రంథాలు ఎన్నిఉన్నా, మతభావనలు ఒక్కలా ఉండాలి. ఇట్టిదిలేదు.

11) తమకు దేవదూతలు కనపడ్డారని, దేవుడు సాక్షాత్కరించారని, దేవునివాక్కు అని చెప్పుకున్నవారే, ఆ దైవ స్వరూపం గూర్చి చెప్పలేక పోయారు. దైవాన్ని గూర్చి స్పష్టమైన వివరణ ఇచ్చి ఉంటే, దైవమంటే ఏమో తెలియని రీతి, ఈనాటికి కొనసాగేదికాదు. మత ప్రవక్తలే దేవుని సందేశహరులవ్వరు. దైవము తన సందేశాన్ని ఏదో ఒక మతప్రవక్తతో అంతంచేసి, మానవాళి తెల్సుకోవలసింది ఇంకేమీ లేదని మౌనం వహించరు.

12) నేటి ప్రపంచంలో సంభవిస్తున్న ఎన్నో దుష్ఫలితాలు, అజ్ఞానంవల్ల సంభవిస్తున్నాయని మేధావులకు తెలిసినా, అజ్ఞానాన్ని తొలగించటానికి ప్రజల మనఃస్తత్వమే అవరోధంగా ఉంటోంది. వార్తా ప్రసార సాధనాలున్న నేటికాలంలోనే ఇట్టిపరిస్థితి ఉండగా, వేల సంవత్సరాల క్రిందటి ప్రజలలో ఉన్న అజ్ఞానాన్ని ప్రక్కకునెట్టి, వారికొక క్రమబద్ధమైన జీవన విధానాన్ని సాధ్యపరచాలంటే, మతాన్ని దైవ వాక్కుగా ప్రకటించుకోకుంటే, ఒకనాటి ప్రజలు మతచట్రంలోకి ఎలా రాకలిగేవారు? ఎవరెలాంటి ప్రశ్నలు వేయకుండా, మత విధానాలను అనుసరించటానికి దైవవాక్కు

అన్న నమ్మకం తోడ్పడింది. ఈ విశ్వాసం నేటికి లేకుంటే, మతం ఉంటేనేం? లేకుంటేనేం? ఎవరికి పట్టింది ? ఇట్టి పరిస్థితి ఏర్పడకుండా నమ్మించాల్సి వచ్చిందని, మనం అర్థం చేసుకోవాలి.

13) దైవంయందు భక్తిశ్రద్ధలు కల్గించేందుకు, పాపపుణ్యాలపేర మంచి చెడులను గుర్తించి అనుసరింప జేసేందుకు, సాంఘిక సంబంధాలలో ఒక క్రమపద్ధతికోరకు, మతలక్ష్యం దిశగా మానవ ప్రవర్తనను నియంత్రించేందుకు శక్తివంతమైన సాధనాలుగా, మతాలను మతగ్రంథాలను ఉపయోగించుకొందుకు, దైవవాక్కుగా, నమ్మించాల్సి వచ్చింది. కాబట్టే ప్రజలలో ఆసక్తి ఆచరణ సాధ్యపడకల్గిందని గుర్తించాలి.

14) పరిస్థితులకు పరిసరాలకు సంఘటనలకు ధర్మానికి అనుగుణంగా జీవించకుండా, ముందుగానే అన్ని నిర్ణయించేసి, మనుష్యులను మట్టిబొమ్మలుగా ఆడించటానికి దేవుడు మత గ్రంధకర్తో లేక నియంతయోకాదు. హేతుయుక్త ధోరణిని నిరసించి, తాను చూసింది తాను నమ్మింది, శాశ్వత కాలాలకు సరైనదని చెప్పేంత అమాయకత్వం, మానవునికి ఉంటుందికాని దేవునికి ఉండదు.

15) మానవాళి అజ్ఞానాన్ని తొలగించి, మానవత్వంవేపు పయనింపజేసి, విశ్వకుటుంబాన్ని సాధించి, జీవితమంతా నిశ్చింతను నింపాలన్నది మతాల లక్ష్యమని తలపోస్తుంటే, అజ్ఞానం తొలగిందా? మానవత్వం విస్ఫారిందా? కష్టాలు తొలిగాయా? ఏదీలేదే? ఈ వైఫల్యంవల్లనే, పై లక్ష్యం మతాలకు అసాధ్యమని స్పష్టపడింది.

16) లైటును ఆర్పివేస్తే అంధకారం అలముకొంటుంది. హేతుయుక్తమైన ఆలోచనను ఆపివేయటమంటే, లైటును ఆర్పివేయటంవంటిది. మత

గ్రంథాలు చేసిన నేరం ఇదే. మతగ్రంథాలు మానవులకి ఏమి నేర్పాయి? పురోభివృద్ధిని సాధింపజేశాయా ? తరతరాల అజ్ఞానాంధకారాన్ని రూపుమాపాయా? సమాజానికి పరిస్థితులకు అనుగుణమైన ప్రవర్తనా రీతిని అలవరచాయా? ఏమి నేర్పాయని వాటిని మహోన్నత గ్రంథాలుగా భావించి ఆదరించవలె?

1) మతగ్రంథాలు మతాలు నిలవాలంటే, దేవునిపై భక్తి శ్రద్ధ భయం వంటివి ఏర్పడాలి. దైవంపై ప్రేమ భక్తి కలగాలంటే, దేవుడిని సర్వశక్తివంతుడిగా, కోర్కెలు ఈడేర్చేవారుగా, అంతా దైవలిఖితంగా రూపొందించాలి, లేకుంటే దేవుడ్ని పూజించరు. దేవుడంటే భయాన్ని కల్గించకుంటే మరచుతారు. కాబట్టి జీవుడు తప్పనిసరి. శరీరంలో జీవుడ్ని ప్రవేశపెట్టడంవల్ల, ఎన్ని కల్పనలకైనా అనుకూలం ఏర్పడింది. పరలోకము స్వర్గనరకాల సృష్టికి వీలయ్యింది. మతానికి విడిగా స్థానంలేదు కాబట్టి, దేవునికి మతానికి పరస్పర సంబంధాన్ని ఏర్పరచారు.

2) ప్రజలను నియంత్రించటానికి పకడ్బందీ అయిన పథకం తయారవ్వాలంటే, జీవుడు పరలోకం దేవుడు తప్పనిసరయ్యారు. అందుకే ఏ మతమూ వీటిని విడవకుండా ఉపయోగించుకుంది. అంతకు ముందేర్పడి ఉన్న మతభావనలు, వాటిపైగల నమ్మక విశ్వాసాల ఆధారంగా, మరో నూతన మతాన్ని స్థాపించగల అవకాశం ఏర్పడింది. ఈ అవకాశంద్వారా తామనుకున్న సిద్ధాంతాలతో, తామనుకున్న పద్ధతులను, మతాలద్వారా ప్రవేశపెట్టి ప్రజలనా మతపరిధికి బంధించ కలిగారు. ఈ ప్రయోజనం కొరకే మతాలను స్థాపించారు. మతాలు ప్రవేశపెట్టిన పద్ధతులు సిద్ధాంతాలు

తప్పు కాబట్టి, వాటిని తప్పుగా నిరూపిస్తూ, సరైన సాంఘిక పరిస్థితులను నెలకొల్పుకుందుకు ఎందరెందరో ప్రయత్నిస్తున్నారు. ఈ ప్రయత్నాలను విప్రయోజనం చేసుకోవటానికిగల కారణం దైవ గ్రంథమన్న నమ్మిక.

3) ఆధునిక విజ్ఞానశాస్త్ర, సాంకేతిక పరిజ్ఞాన ప్రగతిలో జీవిస్తున్న మనం, పాపపుణ్యాలను స్వర్గనరకాలను జీవుడు పరలోకాన్ని విశ్వసిస్తున్నాం. అదృష్ట దురాదృష్టాలు దైవప్రాప్తమన్నా, అంతా విధి లిఖితమన్నా నమ్ముతున్నాం. నేటికి మతపరమైన విధులు ఉంటున్నాయంటే, పైవాటిల్లో విశ్వాసమే కదా! నేడే ఇలా ఉంటే, నేటి ప్రధానమతాలకు పూర్వం, మరెన్నో మూఢవిశ్వాసాల తదనుగుణ ఆచరణల ఊబిలోకి దిగబడి, కష్టాలపాలవటం ఉండేది అని ఎవరైనా ఊహించవచ్చు. మతభావనలు ఆధారంగా అజ్ఞానాన్ని ప్రజలలో వ్యాపింపజేసి, ఎవరిపబ్బం వారు గడుపుకునేవారు. రాజులవల్ల పురోహితవర్గంవల్ల ప్రజలు వంచింపబడుతుండేవారు.

4) అధర్మం, దురాశ, ద్రోహం, సరికాని పద్ధతులు, ప్రవర్తన వంటి వాటిచే మానవసమాజం పీడింపబడుతుండేది. మొత్తంమీద జీవన విధానం ఎన్నో ఆటుపోటులకు గురవుతుండేది. ఇలాంటి పరిస్థితులలో ప్రవక్తలు పుట్టారు. ఆనాడున్న మూఢనమ్మక విశ్వాసాలపై తిరుగుబాటు, సరికాని పద్ధతుల తొలగింపుకొరకు పాటుపడ్డారు. ప్రజలలో వివేకోదయంకై వివిధ ప్రదేశాలు పర్యటిస్తూ బోధనలుచేశారు. ప్రవక్తలలో కల్గిన దైవప్రేరణ వల్ల, వారు నివసిస్తుండే సమాజంలో, వారికి సాధ్యపడిన రీతిలో సంస్కరించారు. ఆనాటి సమాజంలోని చెడుపై దండెత్తటమంటే, ప్రాణాలకు తెగించి పోరాడటమే. ఇట్టి సాహసాన్ని ప్రదర్శించి సంఘ సంస్కర్తలు అయ్యారు. వారినే ప్రవక్తలుగా గౌరవిస్తున్నాం.

5) సంస్కరణ ఒక్కసారే జరగదు. అనేకులవల్ల క్రమరీతిలో సాధ్య పడాలి. ఇలాంటి సామాజిక సంస్కరణ సాధ్యపడకుండా, ప్రవక్తల బోధ నలు ఆధారంగా మతగ్రంథాలు రూపొందించి, వాటిని దైవ నిర్ణయాలుగా ప్రచారం చేయటంవల్ల, అజ్ఞానాంధకారాలకి బలమైన స్థానం ఏర్ప డింది.

6) వేర్వేరు మతాలలో దైవము, జీవుడు, పరలోకము, సృష్టి, సాంఘిక నియంత్రణ గూర్చి, వేర్వేరయిన అభిప్రాయాలున్నాయి. ఎవరి మత సూత్రములు వారివి. ఇందులో ఏవి సరైనవి ? ఏవి సరైనవి కాకుంటే, అన్నీ సరికానివి అవుతాయి. ప్రచారంలో ప్రవేశపెట్టబడ్డ వేర్వేరయిన సిద్ధాంతాలన్నింటికి, ఈనాటి సమాజంలో స్థానాన్ని అనుమతించలేము.

7) జీవరాశి మనుగడకు వివిధగ్రహాలు అనుకూలం కావని, వేటిల్లోను జీవరాశిలేదని రుజువయ్యింది. ఆకాశానికి అవతల ఏముందో కళ్ళతో చూస్తుండబట్టి, మతాలు చెప్పిన పరలోకం అబద్దమని తెలిసింది. 2 ప్రకృతిలో జరుగుతున్న నిరంతర ప్రక్రియలను, విజ్ఞానశాస్త్రులు విశదీక రించటంచే, దైవంవల్లనే అన్నీ జరుగుతున్నాయనేది నిజంకాదని రుజు వయ్యింది. 3 శరీరంయొక్క అంతర్నిర్మాణంతోబాటు, వివిదావయవాల కార్యకలాపాలను యంత్రపరికరాల ద్వారా స్పష్టంగా చూడటంవల్ల, శరీ రంలో ప్రాణం ఉండటం జీవుడివల్ల కాదని రుజువయ్యింది. 4 అనుభవ జ్ఞానం నిరూపించే ఫలితాలతో, మత భావనలు ఎలా తప్పో తెలియచేయ బడుతున్నాయి. 5 మనం నమ్ముతున్న ప్రతి విషయము నిజమో అబద్దమో అనేది నిరూపితమవుతోంది. ఇలాంటి యధార్థాలను తెల్సుకో నందువల్ల, మతాలకు స్థానం ఇవ్వకల్గుతున్నారు.

8) మత ఉద్దేశాలు, ఆచార వ్యవహారాలు, మతపర నిర్ణయాలు వంటివి జీవితంలో పాటిస్తుంటాము. మతగ్రంథాలు చదవలేనివారు, వీటినిబట్టి

మతం అంటే ఏమిటో, కొంత తెల్సుకోవచ్చు. మతాలకు ప్రయోజనము ఉపయుక్తత అనేవి ఉంటే, వాటంతటవి సమాజంలో స్థిరస్థానాన్ని పొందుతుండేవి. మతవర్గం దన్ను, పాలకవర్గం దన్ను లేకుండగనే, స్వయంసిద్ధమైన స్థానాన్ని మతాలు పొందకలిగేవి.

9) మతమంటే ఏమిటో మతాలలో ఏమున్నదో తెలియని, ఒక పరిస్థితికి నేటి ప్రజ వచ్చిందంటే, ఈ మతాలు నిరుపయోగమైన విషయాలు సిద్ధాంతాలతో కూడిఉన్నవి, కాబట్టి వాటిని పఠించుటలేదు. చదవాలనే ఆసక్తి, చదివించేశక్తిని అవి కోల్పోయాయి.మతగ్రంథాలు అందుబాటులో ఉన్నా అనాసక్తి.

10) వైరుధ్యభావాలు, సరికాని సిద్ధాంతాలతో కూడినవి, చదివే వారిని గందరగోళ పరుస్తాయి. చికాకుపరుస్తాయి. మతిమరుపులోకి కొనిపోతాయి. భిన్నమతాలలోని వైరుధ్యాన్నంతా అర్థంచేసుకుంటూ, లేనిపోని శ్రమను పొందటం ఎవరికి ఆసక్తి అవుతుంది? ఏదైనా ఉపయుక్తము శాస్త్రీయము అయిన విషయాలయితే, ఎవరి ప్రోద్బలము లేకుండగనే, జనాభాలో అధికులు, మతగ్రంథాలను అవగాహన చేసుకుంటూ ఉండేవారు.

11) ప్రవక్త లేదా మతగ్రంథ కర్తలపై, భిన్నమతాల సంప్రదాయాల ప్రభావం పడటంచే, మనఃస్తత్వంపై భిన్నప్రభావం ఉంటుంది. ఇదిలా భిన్నతత్వానికి దోహదపడుతుంది. భిన్నతత్వాల సంకలనం మతం. తన అనెడి మతం ఒక వారసత్వం. ఇదొక ఉమ్మడి వారసత్వం కనుక, సమాజమంతటా దీనికొక స్థానం ఉంది. సమాజంలోని వ్యక్తుల ఆచరణలు మత భావనలువల్ల, సహజసిద్ధమైన ప్రచారం వ్యాప్తి ఉంటున్నది. ఒకరు నేర్పకనే నేర్చుకోవటం అవుతున్నది. ఈ బలిమివల్ల మతాలకు ఒక స్థానం ఉంది. వీటికన్నా దైవదత్త గ్రంథాలనెడి భావన, మతాభిమానాన్ని నిలిపి ఉంచుతున్నది.

12) ఈ రచనకు అవసరమైన భావనకొరకు ఈ వ్యాసం ఈ రచన ఉద్దేశించబడింది. మతాలు అంటే ఏమిటో, మతాలు వేటినిగూర్చి వివరిస్తున్నాయో తెల్సుకోగోరేవారు, తమ ఇతర మత గ్రంథాలను చదువుతుంటే, ఏయే పేజీలలో వేటి వ్యక్తీకరణ ఉందో తెలుస్తుంది.

—o—

# • మతములు - కష్టనష్టాలు

1 ఏ ప్రాంతంలో అయితే ప్రవక్తలు పుట్టారో వారి ప్రాంతాలకో, దేశాలకో, వారి పేర ఏర్పడిన మతాలు పరిమితం కాకుండా ప్రపంచ వ్యాప్తమయ్యాయి. దీనివల్ల ఒక దేశంలో వివిధ మతస్థులు కలసి జీవించాల్సి ఉంటుంది. ప్రజాస్వామ్యంలో వున్న హక్కులవల్ల, ప్రజల అవగాహన అంగీకారము లేనిదే, మత రహితమైన పాలన జీవనం సాధ్య పడవు కాబట్టి, మతాలపై ఉదాసీన వైఖరిని అవలంభించడం తగదు.

2 మతాలు తమ మతస్థులను ఉక్కుచట్రంలో బిగించ కలిగాయి. ఇందుకెంత వరకు తోడ్పడవచ్చో అంతటి తోడ్పాటును, పాలకులు స్వార్థ పరులు తమ స్వప్రయోజనాలకోసం అందించారు. మతాలపై మతవిధులపై ఎందరో సంస్కర్తలు, హోరాహోరి పోరాడి సంఘాన్ని సంస్కరించారు. ఆ ఫలితంగా మతాలకన్నా మనుష్యులకి, మత విశ్వాసాలకన్నా మానవ జీవితానికి, ప్రాధాన్యత క్రమేపి పెరుగుతూ వచ్చింది.

3 శ్రమపడి చెమటోడ్చకుండా సంపాదించటం కొరకు మత సంబంధ వర్గం, ఒక మనిషి పుట్టుకనుండి మరణం వరకే కాకుండా, మరణించిన తదుపరికూడా కర్మకాండలను ఏర్పరచింది. కర్మకాండల పేర మానవ జాతిని నరకయాతనల పాల్జేశారు, ఇంకా చేస్తున్నారు. 2 స్వార్థ ప్రయోజనాలు లేకున్నా సాంఘిక ప్రయోజనాల కొరకు అని, కొద్దికాతం

ప్రజలు మతాలకు మద్దత్తు ఇస్తున్నారు 3 అధికులు దురభిమానాలకు లోనై మతాలను కాపాడుతున్నారు. 4 దైవ సంబంధమైన వాటి గూర్చి తమ మతాలు ఏవయితే వివరిస్తున్నాయో, వాటిని సత్యమని నమ్మటంవల్ల మతాలకు ఉన్న స్థానం నిలిచి వుంది.

5 మతరీత్యా ప్రవక్తలు వేరు వారి బోధనలు వేరు. మతరీత్యా మత గ్రంథాలు మహాపురుషులువేరు. మతరీత్యా దేవుళ్ళు ఆలయాలువేరు. మతపర మైన పండుగలు వేడుకలు పూజలు కర్మకాండ, ఏ మతం వారికవి వేరు. ఇవన్నీ ఏదోమతంపై వారికి, స్వమతాభిమానాన్ని పెంచాయి. ఎవరి ఆచా రాలువారివి గొప్ప ప్రాధాన్యత కలవిగా భావించటంచే, భిన్న మతస్థుల మధ్య వైషమ్యాలు తలెత్తుతున్నాయి. మానవులంతా ఒక్కటేననిగాని, మానవులందరికి దైవము ఒక్కడేననిగాని, మత పద్ధతులు కల్గించలేక పోయాయి.

## కుటుంబ నియంత్రణ

గర్భనిరోధాన్ని గర్భస్రావాన్ని మతాలు వ్యతిరేకించటంవల్ల, కుటుంబ నియంత్రణకు మతాలు అవరోధమయ్యాయి. పిల్లలు పుట్టడం పుట్టకపోవటం అంతా దేవుని నిర్ణయమని, దేవుడు అనుగ్రహించే పిల్లలను కుటుంబ నియంత్రణద్వారా నిరోధించటం పాపమని. ఎంతమంది పుట్టాలో అంతమంది పుట్టేంతవరకు అవరోధం కూడదని, మతాలు మానవాళిలో తప్పుడు అభిప్రాయాలను ప్రవేశపెట్టాయి. గర్భస్రావం అంటే ప్రాణ హాని చేసే పాపం అని. కుటుంబ నియంత్రణను నిరోధించి, ఆర్థిక సాంఘిక వ్యక్తిగత సమస్యలు పొడ్జేశాయి. భిన్నమతాలవల్ల, అల్పసంఖ్యాక మతాలు తమ మతస్థుల సంఖ్య పెరుగుదల కని, మతధర్మాల ఆసరాతో

కుటుంబ నియంత్రణను పాటించకున్నారు. దంపతులు మగపిల్లలు పుట్టేంత వరకు కుటుంబ నియంత్రణపై విముఖత పాటించటానికి, ఆడ మగ వివక్షణకు, మత సంస్కృతి మతాలు కారణమయి సమస్యలను సృష్టిస్తున్నాయి.

2) మతగ్రంథాల కాలంనాటి జనసంఖ్య చాలా తక్కువ. అనాడు పుట్టేవారి సంఖ్యతో మరణించేవారి సంఖ్య, సమానంగా ఉండటమో లేక మరణించేవారి సంఖ్య ఎక్కువగా ఉండటమో ఉన్నందువల్ల, నేడు అధిక జనాభావల్ల మనం ఎదుర్కొంటున్న సమస్యలు కష్టాలు, ప్రవక్తల కాలంలో లేవు కాబట్టి, వారికెలాంటి మతాభిప్రాయం ఉన్నా సమస్య ఉండేదికాదు.

3) మతాలు ఆటబొమ్మలు వంటివి. ఏవి పలికించితే ఆటబొమ్మలు అవే పలుకుతాయి. ఆటబొమ్మలకి నేటి పరిస్థితులు అర్థమవుతాయి కనుక, తాను పలికిన పలుకలను మార్చి, తిరిగి పలుకకల్గుతాయా? కాబట్టి మతాలు వేరు, దేవుడు వేరు. దైవము నిరంతర చైతన్యం. కాలంతోబాటు పరిస్థితులతో బాటు, దేవుని అభిప్రాయాలు నిర్ణయాలు ఉంటాయి. మనం స్వీకరించవలసింది దేవుని నిర్ణయాలను కాని, ఆటబొమ్మల పలుకులను కాదు.

4) గర్భనిరోధాన్ని గర్భస్రావాన్ని మన ఆధీనంలో ఉంచుకుంటూ, పిల్లల్నికంటూ కష్టాలను పెంచుకుంటూ పోతున్నది మనం. సమస్యలని కష్టాలను పెంచుకుంటూ, నరకయాతనల పాలవ్వండి అని, దేవుడు వేటినీ నిర్ణయించరు. ఎలాంటి సమస్యలను సృష్టించని పరిమిత కుటుంబంతో, జనాభాతో, సుఖశాంతులు పొందవలెనన్నది దేవుని అభిలాష అవుతుంది. గర్భనిరోధం గూర్చి మతాభిప్రాయాలు, నేటి సమాజానికి అనర్థదాయకం కాబట్టి తిరస్కరించాలి.

# పెళ్ళి ఖర్చు

1) తల్లిదండ్రులు తమ పిల్లలకు నచ్చని వధూవరులను తెచ్చి, దాంపత్యాన్ని భగ్నం చేయబూనరు. తమపిల్లలకు నచ్చిన వ్యక్తులతో వివాహం జరిపిస్తారు కాని అన్యులతో కాదు. దీనికి భిన్నంగా దైవమైనా ఎలా నిర్ణయిస్తాడు? ఆస్తి అంతస్తు కట్నాలు ఉద్యోగాలు వ్యాపారాలు ఆదాయాలు వంటి వాటికి ఆశపడి, వధూవరుల ఎంపిక జరుపుకుంటూ, అంతా దైవేచ్ఛ అంటున్నారు.

2) మత సంబంధమైన పద్ధతుల ద్వారా పెళ్ళిళ్ళు జరుపుకుంటేగాని, దేవుడు ఆశీర్వదించనని బాగా ఊది ప్రకటిస్తున్నారా? హోదాకితగ్గట్టు పెళ్ళి తంతు జరిపితేకాని దేవునికి కన్పించదా? బ్యాండు మేళం వాయిద్యాలతో ధ్వని ప్రతిధ్వనించకపోతే, దేవుని దృష్టికి తేవటం అసాధ్యమవుతుందా?

3) పెళ్ళి ముహూర్తంలోనో తదుపరో దేవుడు దీవించినంత మాత్రాన, దాంపత్యం ఆనందంగా సాగిపోతుంటే. నేటి ప్రపంచంలో ఈ కలహాలు నిరాశా నిస్పృహలు దుర్మరణాలు వైధవ్యం విడాకులు ఉండేవా? దైవాను గ్రహించే పరస్పర ఆకర్షణ, ప్రేమ, అన్యోన్యత, అనుకూల ప్రవర్తన, ఏర్పడిపోతుంటే, ఏ దాంపత్యంలోనైనా కష్టాలు ఉండేవా?

4) వైభవోపేతంగా షడ్రసోపేతమైన విందులతో పెళ్ళి చేస్తేగాని, యువతీ యువకులు భార్యాభర్తలు కాలేరా? ఆస్తులమ్ముకొని లేక అప్పులు తెచ్చి లేక పొదుపు చేసిన కష్టార్జితాన్ని ఖర్చుచేస్తేగాని దేవుడు దీవించరా?

5) ఆస్తి హోదా ప్రత్యేకతలు వెల్లడించుకుంటానికే ఈ ఆడంబరత్వం. ఒకటి లేదా రెండు రోజులలో ముగిసే ఈ పెళ్ళితంతు ఎవరికి ఎన్నాళ్ళు గుర్తుండేను? వృథా వ్యయం వృథా ప్రయాస అదే, ఈనాటి పెళ్ళితంతు. ఇందుకు దోహదపడుతోంది మతం.

6) మత విధులకు ఆడంబరత్వాన్ని జోడించి జరుపుకోవటం తెలిసింది కాని, తమ తమ తల్లిదండ్రులను అప్పుల పాల్జేస్తున్న పెళ్ళితంతును, విరమించాలని మాత్రం తెలిసిరావటంలేదు. శరీరం పెరిగినట్లు వివేకయుతమైన ఆలోచన పెరగదు. కోరికలకొరకు పడే తాపత్రయంలో ఏ కొద్ది సమయాన్ని, వివేకయుతమైన ఆలోచనకు కేటాయించినా, ఈ సమాజం ఇలా మతమౌఢ్యంతో ఉండేదికాదు.

# అంత్యక్రియలు

1) నిత్యం ఎందరెందరో మరణిస్తున్నారు. ఎవరి మరణానికైనా మనం దుఃఖిస్తున్నామా? బంధువు చనిపోతే చనిపోయాడనుకుంటాం. బంధువు కాబట్టి అదైనా కొద్దిసేపు తలంచుతాం. ఇతరులయితే ఆ తలంపు ఉండదు. అలాగే తను చనిపోయిన సంఘంన మిగతావారికి అంతే. అదో వార్త. తన బంధువు చనిపోతే తానెలా సాంఘిక మర్యాదకొరకు వెళ్ళివస్తాడో, ఇతరులు తన మరణం తదుపరి, అలా వస్తారు, వెళతారు.

2) ఫలానామనిషి చనిపోయాడన్న ఒక్క విషయం తెలియపర్చటానికి ఎంతో వ్యర్థమైన తంతు ఉంటోంది. ఒకడు మరణించి తనవారికి తనబంధువులకి స్నేహితులకి ఇబ్బందులను కల్గిస్తున్నాడు. రైళ్ళలో బస్సులలో రద్దీ ఎదుర్కోవాలి. రాకపోకలకు ఖర్చుచేయాలి. వృత్తులను తదితర పనులను వదలి హాజరవ్వాలి. ఇంకా సమాజంలోని ఉత్పత్తులను వ్యర్థపరచాలి. ఇలాంటివన్ని మనిషి శవంగా మారినాక కూడా, జరిపించుకో కల్గటానికి, మతం కారణమవుతోంది.

3) జంతువు కళేబరము ఎంతో మనిషి శవము అంతే. ఒకని శవము వల్ల ఇతరులు వ్యాధులబారి పడకుండేందుకు, ఆరోగ్య రక్షణకొరకు, దహ

నమో పాతిపెట్టడమో చేయటానికి. తననారు లేదా దహనవాటిక సిద్ధంది ఉంది. ఇంతకు మినహా శవానికి ఏమికావాలి? చూసి విని సంతోషించే ప్రాణం నశించగా శవం ఏమయితేనేం? ఎన్ని చేసినా ఏమి చేసినా శవం వింటుందా? చూస్తుందా ?

4) కుటుంబంలో ఒకరు మరణిస్తే ఆ మరణ దుఃఖం, మిగతావారికి ఉంటుంది. ఒకరిపై ఉండే ప్రేమానురాగాలనుబట్టి, బాధ వేదన కన్నీరు సహజం. ఒకప్రక్క ఈ మనోక్షోభ అయితే, మరోప్రక్క అంత్యక్రియలు శ్రాద్ధకర్మలు జరిపే తతంగాన్ని నిర్వహించాలి. ఆ పరిస్థితిలో ఎవరికి అయినా ఏ పని చేయబుద్ధి అవుతుంది. కనీసం కొద్దిరోజులు వేటిల్లోను పాల్గొనాలని ఉండదు. అలాంటిది మరణించిన క్షణం నుండి కుటుంబ సభ్యులు, ఈ అంతక్రియలు శ్రాద్ధకర్మలు ఏర్పాట్లతో గడపాలి. మరణించినవారి స్మృతులలో గడపటానికయినా వీలులేనంతగా, మతాచారాల చక్రంలో బంధింపబడటం ఎందుకు?

5) మతాలనుబట్టి ఈ అంత్యక్రియలు శ్రాద్ధ కర్మలకు అవుతున్న ఖర్చు, తన కుటుంబీకులను అప్పుల పాల్జేసేంతగా వుంటున్నది. అరె! తన మరణంతో తన వారికి ఎంత కష్టం కలుతోంది? ఇకనైనా ఇలాంటి మత బాందసత్వం, నా కొరకు జరపవద్దు, అన్న వివేచన కల్గుతుందా?

6) ఎంతో ముందు నుండి అన్ని ఏర్పాట్లు చేసుకుందుకు, పెళ్ళి ముహూర్తాలవలె మరణాలు అనుకున్నప్పుడు జరగవు కదా! అది రాత్రో పగలో వాతావరణం ఎలా ఉందో. తదితర అసౌకర్యాలు ఏమి ఉన్నాయో. ఇదంతా ఇలా ఉండగా, అంత్యక్రియలు శ్రాద్ధకర్మల కొరకు క్షణం తీరిక లేకుండా నిరర్థకమైన పనులు వేటికోసం ఆశించి చేస్తున్నారో, అవి కల్పితాలు. అసత్యాలను యదార్థమనుకొని కర్మకాండలు జరుపుతుంటే, వీటి వల్ల తనను ప్రేమించిన వారికి లేనిపోని దుఃఖాన్ని కల్గించినట్లవుతుంది. మరణ దుఃఖానికి తోడు ఇదో దుఃఖం.

7) దేవుని అనుగ్రహం కొరకు, జీవుడి మోక్షం కొరకు, పుణ్యఫలం కొరకు మతపరంగా ఏర్పడ్డ ఈ మత బాంధసత్వాన్ని తరిమికొట్టండి. దేవుడంటే ఏమో తెలియని, ఈ మతాలా మనకు నేర్పేది? ఈ మతాలా మనల్ని శాసించేది? మనోగతమైన ఆరాధన ద్వారా, దైవముతోగల అనుబంధం పెంపొందుతుందిగాని, ఇలాంటి నిరర్థకము వింత చేష్టలతో కూడిన మత కర్మకాండలవల్ల కాదు.

8) బ్రతికి ఉండగా తనవారి మంచి చెడులుగూర్చి శ్రద్ధాసక్తులు కన పరచాలిగాని, బూడిదగా మారే శవాల గూర్చిన కర్మకాండలు ఎందుకు?

## జంతు బలి

1) దైవభావం మొత్తం మానవాళికి సంబంధించినది. వ్యక్తిగత విషయంకాదు. దైవమునకుగల ఔన్నత్యానికి, భిన్నమైన ప్రవర్తనారీతి, ఎవరికి ఉండరానిది. మానవత్వపు గుణాలకన్నా ఉత్కృష్టత, దైవత్వ గుణాలకు వుంటుంది. దైవ స్వభావాన్ని ఇందుండి గ్రహించి, తదను గుణంగా ప్రవర్తించాలిగాని, వేరే రీతిలో కారాదు.

2) మానవత్వం అనేది ఒక స్పందన. మానవ జీవితం ఒక స్పందనాను భూతి. మనస్సును రాక్షస గుణాలతో నింపుకుంటే, రాక్షస చర్యలు సాధారణంగా కన్పిస్తాయి. మానవత్వంగల మనుష్యులే భరించలేని సహించలేని ఈ దారుణాన్ని, దైవత్వంగల దేవునికి ఇవెలా ప్రీతికరం కాగలవు?

3) దైవము కరుణకు ఆర్ద్రతకు ప్రేమకు చిహ్నం. అలాంటి దైవ భావం ముందు, ఆర్తనాదాలతో కూడిన బలులను, రక్తపు మడుగులను పారించుట వివేకమేనా? మానవులకు కొన్ని విలువలు వున్నాయి. విలువ లను అతిక్రమించి క్రూరంగా హేయంగా ప్రవర్తించకూడదు.

4. ఒక మనిషిని బలి ఇస్తున్న సంగతి, ఆ మనిషికి తెలిస్తే, ఎంతగా ఆక్రందిస్తాడు? ఆ ఆక్రందన ఎవరిని కదిలించి వేయదు? జంతువులైనా అంతే. మూకుమ్మడిగా బలులను ఇస్తుంటే, ఆ దృశ్యానుభవంతో అవెంతగా క్షోభిస్తాయో?

5. మొక్కను కోయటం ఏమంత శ్రమ? ఈ యాపిల్‌ను స్వంతంగా పండించాలంటే అదెంత కష్టం? విలువలకు సంబంధించిన పనులు సాధిస్తే మెప్పుదల సంతోషము వుంటుంది. మేక, కోడి, ఒంటెవంటి జంతువులను పదునైన కత్తులతో తెగనరకటం ఏమంత కష్టం? ఇలాంటి పనులకు ప్రీతి చెందునది ఎవరు?

6. హత్యలు చేసేవారు అందుకు ప్రోద్బల పరచేవారు మనకు ఆదర్శమా? బలియే ప్రీతి అయితే, పరోక్షంగా బలులను ప్రోద్బలపరచటమేనా? హంతకులు ఎలా ఆదర్శం కారో, ఈ హంతకులు అలాగే ఆదర్శులు కారు. వీరిచ్చే ప్రతిఫలం అసహ్యం కాదా?

7. దారుణహింసను అభిలషించే గుణం రాక్షసత్వం. రాక్షసగుణం ఉన్న దుష్టశక్తులకయితే ఈ బలులు ప్రీతికరం కావచ్చు. రాక్షసులని పిలుస్తాంగాని. వారికి హృదయంలోగాని ఇళ్ళల్లోగాని దేశంలోగాని చోటివ్వము. రాక్షస గుణాలున్న దుష్టశక్తులను పూజించరాదు. బలులను కోరే ఆలయాలను పునాదులతోసహా పెళ్ళగించి పారెయ్యాలి. రాక్షసగుణం రాక్షస ప్రవృత్తికి ఈ సమాజంలో స్థానం వుండరాదు.

8. ఈ బలులు అనాగరిక వారసత్వం. నాగరికతకు సిగ్గు చేటయిన విషయం. మానవత్వానికి విరుద్ధ లక్షణం.

# కొబ్బరికాయలు

1) పూజా సందర్భాలలోను, తమ భక్తిని వెల్లడించుకునే ఆచారంపేర, విగ్రహాల ముందు దేవుడి గుళ్ళముందు కొబ్బరికాయలను కొడుతుంటారు. పూజారులు విగ్రహాల ముందు పగల కొట్టినపుడు, కాయ రెండు చెక్కలు అవుతుంది. ఈ రెండు చెక్కలు భక్తునికి ఇచ్చే పద్ధతి తక్కువచోట్ల ఉంది. మిగతాచోట్ల ఒక చెక్క ఇచ్చి రెండో చెక్కని విగ్రహాల ముందుంచుతారు.

2) ఒక కొబ్బరికాయ కొంత ఖరీదు ఉంటే, అందులో సగం ఖరీదు సగం చెక్కది. నిత్యము వేలకొలది భక్తులు దేవునికి సమర్పిస్తున్న వీటిని దేవుడు తింటున్నారా? లేదు. ఇవన్నీ పూజారులు తినగలరా? లేదు. ఇవి అమ్మకానికి పోతాయి. ఆచారం పాటించటంలో ఇలా భక్తుల డబ్బు వృధా అవుతుంది.

3) భక్తులు పాటించే ఈ ఆచారంవల్ల ముదురు కొబ్బరికాయలు చాలటం లేదు. భక్తులే కాకుండా ప్రయివేటు యాజమాన్యం, బస్సుల ట్రక్కుల డ్రైవర్లచేత, తమ మూఢ నమ్మికకు అనుగుణంగా, కొబ్బరికాయలను పగల కొట్టిస్తున్నారు. ఆచారం పేర కొట్టాలి కాబట్టి ఏదో ఒకటి కొంటున్నారు. దీనిచే లేత కొబ్బరికాయలు అమ్ముడవటంచే, కొబ్బరి చెట్లనుండి లేత కొబ్బరికాయలను నరికి అమ్మకానికి తెస్తున్నారు.

4) కొబ్బరినూనె తయారీకి ఇవి ముడి పదార్థం. కూరలు చట్నీలు తయారీలో నిత్యావసర వాడకం వుంది. ఆచారాల పేర వీటిని వ్యర్థ పరచటంచే వాడకం ఎక్కువై, అధిక ధరకు మాత్రమే లభిస్తున్నాయి. వీటికి ఉన్న అధిక ధరవల్ల కొబ్బరినూనె ధర పెరిగింది. ఈ ధరకు కొన లేనివారు తలకి నూనె రాసుకోవటంలేదు. మధ్య తరగతి గృహిణులు

కొబ్బరి వాడకాన్ని బాగా తగ్గించేశారు. పోషకాహారంగా వాడుకోవలసిన కొబ్బరిని వాడుకోలేని వారవుతున్నారు.

5) పువ్వునుంచి పిందె, పిందె నెలల తరబడి క్రమేపీ పెరుగుతూ కొబ్బరి బొండాంగా, తదుపరి లేత ముదురుకాయలుగా తయారవుతాయి. తెగుళ్ళనుంచి తట్టుకొని, నెలల పర్యంతం నేల గాలి నీరు సూర్యరశ్మి నుంచి, కొబ్బరిచెట్లు తయారు చేస్తున్న పోషకాహారం కొబ్బరికాయ. పక్వానికి రాకుండా కొబ్బరి బొండాలుగాను లేత స్థితిలోను పగలకొట్టడం సమైనదా ?

6) వ్యాధుల సందర్భంలో కొబ్బరి బొండాలలో నీరు త్రాగటాన్ని ఎవరూ కాదనరు. ఆరోగ్యవంతులు దీనిని పానీయంగా వాడటంచే లక్షలాది చెట్ల శ్రమ వ్యర్థమవుతున్నది. ఆచారాల పేర లేత కొబ్బరికాయలలోని నీరు నేల పాలవుతుంది. పౌరుల అవసరాలకు అందాలంటే వ్యర్థ పుచ్చ కూడదు. ఆచారాల పేర ఆహారపు అలవాట్ల పేర వ్యర్థపుచ్చితే, దిగువ స్థాయిలోని ప్రజానీకం వాడుకోలేని వస్తువుగా మారుతుంది.

## నిమ్మపండ్లు

1) ప్రకృతిలో ఎన్నో ఫలవృక్ష జాతులు ఉన్నాయి. మానవులకు ఉప యోగపడని వాటి పళ్ళు ఏమవుతున్నా, ఏదోలా సరిపెట్టుకోవచ్చు. ఏవయినా వేటి నిమిత్తమయినా ఉపయోగపడుతుంటే, వాటిపై ఆధార పడినవి ఉన్నట్లు. ఉపయుక్తమైన వాటిని వ్యర్థపుచ్చుతుంటే, వాటిపై ఆధారపడ్డ వారికి అవి అందవు. కాబట్టి నిరుపయోగ పరచుట ఎంత మాత్రము కూడనిది.

2) ప్రకృతి పరమైన చెట్ల నుండి లభ్యపడుతున్న ఫలాలను మూఢ

నమ్మకాలకు లోనయి, తమ మూఢ నమ్మకాలను నెరవేర్చుకున్నామన్న తృప్తి కొరకు, వేలాది వాహనాల పైర్ల క్రింద పెట్టి, వాహనాలకు వ్రేలాడ గట్టి నిమ్మపండ్లను వ్యర్థపుచ్చటం ఎలా సహింపతగ్గ విషయం?

3) ప్రయాణం మొదట లేదా పూజా సందర్భంలో, ప్రతి పైరుక్రింద ఒక్కొక్క నిమ్మపండును త్రొక్కిస్తే, కాస్తంత దూరంపోతే, త్రొక్కించిన వాసన కూడా ఉండదే? త్రొక్కించారో లేదో దుష్టశక్తికి ఎలా తెలుస్తుంది? దుష్టశక్తులు నిమ్మకాయలను వాహనాల ముందు లేదా లోపల వ్రేలాడ కట్టండి, పైర్ల క్రింద త్రొక్కించండి, మేము మీ జోలికి రామని చెప్తున్నాయా? త్రొక్కించినా త్రొక్కించకపోయినా, ఈ విషయాన్ని అవెలా తెల్సుకోగలవు? ఇలా వ్యర్థపరచే మూఢ నమ్మికను దుష్టశక్తులు అయినా ఎలా అంగీకరిస్తాయి? ఇలా అంగీకరించకపోగా విచారిస్తాయి కాని, ఇట్టివి అవి కోరవు. తదితర వ్యాపారులు మరియు వ్యక్తులు, తమ మూఢ నమ్మకాల కనుగుణంగా వాడుతున్నా, వీరి వాడకం చాలా తక్కువ.

4) ఆహారపు విలువగాను ఔషధోపయుక్తంగాను వినియోగపడే నిమ్మ పండ్లను, వ్యర్థపుచ్చుతున్నారంటే వీటి వాడకం ఎక్కువైపోతున్నది. దీనిచే ఉత్పత్తి చాలక ధర పెరిగి, ఉపయోగించుకోలేని పరిస్థితి ఏర్పడు తుంది. ఇట్టి పరిస్థితికి కారణం నిరుపయోగపర్చటం. దీనికి కారణం మత పరమైన మూఢ విశ్వాసాలు.

5) మత పరమైన నమ్మక విశ్వాసాలు, ఉత్పత్తులను ధ్వంసం చేయిస్తు న్నాయి. మూఢ నమ్మకాలకు ఇలా ఎక్కడెక్కడ ఏయే వాటికి, డబ్బు ఉత్పత్తులు వ్యర్థం చేయబడుతున్నాయో పరిశీలిస్తూ, వీటికి అడ్డుకట్ట వేయాలి.

# మంత్రతంత్రాలు

1) మంత్రతంత్రాలవల్ల కావలసిన పనులు నెరవేరుతుంటే, తమ తమ పనులకు మంత్రోచ్చారణ జరుపుతూ. పనులు జరిపించుకుంటుండేవారు. మంత్ర తంత్రాలకు శక్తి ఉంటే. వీటితో ధనికులు అయ్యేవారుగాని, ఇతరులను మభ్యపరుస్తూ పొట్టగూటికి వంచించే వారుండేవారు కాదు. భూత ప్రేతాల ఉపాసన చేసినవారు మాంత్రికులు వీరు ఇతరులను భయ భ్రాంతులకి లోనుజేయటం తప్ప, అపోహాలు మూఢత్వం వ్యాప్తిచేయటం తప్ప, ఇలాంటి వారివల్ల ఏముంది మేలు?

2) ఈ మంత్ర తంత్రాలు భూత ప్రేతాలచే, వర్షాలు కురిపిస్తూ నేలను సస్యశ్యామలం చేయగలరా? చీడలు తెగుళ్ళు అంటువ్యాధులను మటు మాయం చేయగలరా? తమ మట్టుకయినా ఆకలైనప్పుడు ఆహారాన్ని, దాహం వేసినపుడు నీటిని సృష్టించుకోగలరా? రోగాలకు ప్రమాదాలకు భూత ప్రేతాలను ఉపాసించి, వైద్యుల మందుల అవసరం లేకుండా బ్రతక గలరా? ఏదో బొంకటం మభ్యపెచటంకాక, తమ మాంత్రిక తాంత్రిక శక్తుల ఫలితాలను చూపించాలి. లేకుంటే క్షుద్ర శక్తుల ఉపాసనను వదలి శ్రమించి పనిచేయాలి. అలా కాకుంటే తోటి ప్రజలపై అదనపు భారం పడుతుంది.

3) ఒక నగరంలోని జనాభాకు నీటిమక్కర కరువైతే, వారు బ్రతక టానికి బాల్చెడు నీరు సరిపోతుందా? పచ్చటి పైరులు ఎదగాలంటే ఎక్కడో ఒకచోట కొద్దిసార్లు వర్షాన్ని కురిపిస్తే సరిపోతుందా? మంత్ర తంత్రాలచే ఏ కొద్దిమందికో వ్యాధి నిర్మూలన జరిగిందనుకుంటే, ఈ ప్రపంచ జనాభాకు అనుక్షణము వైద్యసహాయం తీరుతుందా? ఒక గడ్డిపరక సృష్టింపబడితే, దానిని ప్రపంచ జనాభా పంచుకోవటం ఎలా సాధ్యపడదో, అలాగే ఈ మంత్రతంత్రాలవల్ల ఏవి సాధ్యపడవు.

4) క్షుద్రశక్తులు ఏమిచేయగలవో తెలియదుగాని, అవేమైనా చేయకల్గితే వాటి అవసరం వాటి సహకారం, మానవసమాజానికి లేదు. క్షుద్రశక్తులు అంటే మంచిగాక, చెడు చేసేవని అర్థము. గత ప్రజల అనుభవాలవల్లనే, వాటికాపేరు వచ్చినదేమో! ఈ ప్రపంచం కేవలం మానవులంకే పరిమితం కాదు. మానవులకు అతీతమైనవి ఏవైనా ఉండొచ్చు. ఉంటే వాటిమానాన అవి ఉంటాయి. వాటివల్ల మనకు అసకారములేదు. అయితే కొందరు క్షుద్రశక్తులను ఉపాసించి, కొందరిని భయభ్రాంతుల పాల్జేయటం ఉంది. డబ్బుకొరకు తమకొక గుర్తింపుకొరకు, ఇట్టి నీచ ప్రవృత్తికి దిగజారుతున్న వారివల్ల, లేనిపోని మూఢనమ్మకాలు వాటికి సంబంధించిన ఆచరణలు ఉంటున్నాయి. ఇలాంటి పీడ విరగడవ్వాలంటే, క్షుద్రశక్తుల ఉపాసన మంత్ర తంత్ర ప్రకియలను ప్రజలు చూస్తూ ఊరుకోరాదు.

5) భయం అనేది మానసికంగా, ఎన్నింటివలనో కల్గుతుంది. వేటివల్ల ఇది కల్గుతుందో, వాటిని పరిష్కరించుకోజూస్తారు. భూతప్రేతాలు మంత్ర తంత్రాలపై ఉండే ప్రచారంవల్ల, మూఢనమ్మకలు వ్యాప్తి అయిమనస్సులో తిష్టవేస్తాయి. కష్టాలకు సమస్యలకు కారణం ఇవేమోనన్న అనుమానం కల్గిస్తుంటాయి. ఇలాంటప్పుడు మాంత్రిక తాంత్రికులను ఆశ్రయించటం జరుగుతుంది. ఇలాంటి అనుమానాలకు, సంశయాలకు తావులేకుండా ఉండాలంటే, తాంత్రిక మాంత్రిక ప్రక్రియలు ఉండరాదు. ఇవి గనుక ఉంటే, ఇవి వ్యాప్తిలో ఉంటాయి. ఇవి వ్యాప్తిలో ఉన్నాయంటే,మన మనస్సును ఆ ప్రభావంలోకి లాగివేస్తూ, ఆ పనులలో పాల్గొనేట్లు చేస్తాయి.

6) జీవితాన్ని సమస్యల వలయం చేసుకున్నది మనం. ఈ జీవితాన్ని సమస్యా రాహిత్యం చేసుకోవలసినది మనమే. ఇందుకుతగ్గ ప్రయత్నంలో అందరం భాగస్వామ్యులవటం ఒకటే పరిష్కారమార్గం. మన సమస్యలకు మంత్ర తంత్రాలను, క్షుద్రశక్తులను, బాబాలను అమ్మలను ఎవరిని ఆశ్రయించినా, వేటిని ఉపాసించినా నిరర్ధకం. ఈ మంత్రతంత్రాలపై లేనిపోని

నమ్మకాలకు తావిస్తే, కార్యాచరణ తప్పుయి కష్టాలు కల్గుతుంటాయి. మానవ మస్తిష్కాన్ని వక్రమార్గం పట్టించే వీటిని భూస్థాపితం చేయాలి.

7) క్షుద్రశక్తులను దేవతలు దేవుళ్ళుగా ఆరాధిస్తూ, ఏవో పేర్లు ఏదో పూజావిధానం ప్రవేశపెట్టుకొని, మాంత్రిక తాంత్రికులు వింత అయిన తంతు చేస్తుంటారు. ఏ మంత్రమైనా కొన్ని అక్షరాల పదాల ఉచ్చారణ. అర్థంలేని పదాలు, అర్థంలేని అక్షరాలు ఉచ్చరిస్తుంటే, అర్థంలేని శబ్దాలు వినిపిస్తుంటాయి. మంత్రతంత్రగాళ్ళు ఇలాంటివే వినిపిస్తూ మభ్యపరుస్తుంటారు.

8) మహిమలవల్ల వ్యాధులు నివారణ అవుతాయని నమ్మబట్టి, ఆశ్రమాలను ఆలయాలను సందర్శించటం, దేవునిపై భారం వెయ్యటం ఉంది. మొగతా నమ్మకాలు ఎలాఉన్నా వ్యాధులకు పామునాటుకు అనారోగ్యానికి, మంత్రతంత్రాలపైగాని జాదాలపైగాని అనామోదిత చికిత్సా పద్ధతులపైగాని ఆధారపడరాదు. ఎందుకంటే ప్రాణంపోతే బ్రతుకులేదు కాలయాపనవల్ల వ్యాధులు ఒక పట్టాన తగ్గవు. కాలాయాపన ప్రాణాపాయ స్థితిని కల్గిస్తుంది. కాలయాపన మృత్యువు పాల్జేస్తుంది. శరీర ఆరోగ్యం గూర్చి ఆధునిక చికిత్స, డాక్టర్ల పర్యవేక్షణ తప్పనిసరి. వైద్యరీతులు అవేవైనా, డాక్టర్ల ఆధ్వర్యంలో జరగాలి. అప్పుడే జీవితానికి భద్రత.

9) ఇంద్రజాలికులు తమ మేజిక్కులతో, అద్భుతాలను చేస్తున్నారు. ఈ అద్భుతం జరిగే పద్ధతి తెలియక ఆశ్చర్యపరుస్తుంది. ఇదిలా మహిమల నమ్మకాన్ని బలపరుస్తుంది కాబట్టి, విషయ వివరణ ప్రజలకు తెలియనిదిగా ఉంచకూడదు. 10) యజ్ఞయాగాదులవల్ల ఏదో సాధిస్తామని అనుకునేవారు వెర్రివాళ్ళు. వీరి ఉపదేశాలను నమ్మి, వాటిని ప్రోత్సహించటం వెర్రితనం. మతపరంగా సాగే వీటిని అనుమతించకూడదు. 3 మత విశ్వాసాల

ప్రభావం పనిచేస్తుండటం, బాబాలు జ్యోతిష్కులు మాంత్రికులు పురోహితులువంటి వారిని నమ్మి మోసపోవటం ఉంది. అనామోదిత చర్యలు నమ్మకాలు ఉంటున్నాయి. భయాందోళనలు పడనవసరంలేని భద్రతగల బ్రతుకుబాటను సాధ్యపరచుకుంటే, వీటిపరంగా కదలాడే మూఢత్వం నశిస్తుంది.

10) దుష్టశక్తులు ఉన్నంత మాత్రాన, మనం అనుకున్నట్లు వాటికి హాని చేయగల సత్తాఉందా? మనిషి పురోభివృద్ధిని నిలిపివేయగలవా ? – తాము చేసే వృత్తులలో నష్టాలను కొనితేగలవా?– ధనవంతుడ్ని దరిద్రుడ్ని చేయగలవా ?–మనిషిని వ్యథల పాల్జేయగలవా ?–మనిషి ప్రాణానికి ముప్పు తేగలవా ? – దుష్టశక్తులు ఎక్కడ ఉండి తమ దుష్టత్వాన్ని ప్రసరిస్తున్నాయి?

11) దుష్టశక్తులకు మానవుల్ని పీడించేంత సత్తాఉంటే, అవి అంతటా అందర్నీ పీడిస్తున్నాయనేది రుజువులు లభ్యపడాలి. వాటి అభీష్టానికి విరుద్ధమైన రీతిలో కార్యక్రమాలు వ్యవహారాలు నిర్మాణాలు వంటివి జరుగుతున్నప్పుడు, దుష్ఫలితాలేమిటో వెల్లడవ్వాలి. వాటికి అనుకూలంగా ప్రీత్యర్థంగా వ్యవహరించినపుడు, అవి కలుగజేసే మేలు ఏమిటి ? వాటికి విరుద్ధంగా వ్యవహరించినపుడు అవి కలుగజేస్తున్న దుష్ఫలితాలు ఏమిటి? అప్పుడు అవి ఏ కారణాలకు మేలు చేస్తున్నాయో, ఏయే కారణాలకు హాని చేస్తున్నాయో స్పష్టపడుతుంది. దుష్టశక్తులకు పైవేవి సాధ్యం కానట్లయితే, వాటిమానాన అవెక్కడో ఉంటాయి. వాటితో మనకు సంబంధం లేదు.

12) ప్రచారంలో ఉన్న నమ్మకాలన్నీ అపోహాలని రుజువయితే, అపోహాలు తిరిగి నమ్మకాలుగా ఏర్పడకుండా, వాటిని ప్రచారం చేసేవారిని తీవ్రంగా శిక్షించవచ్చు. శత్రువులకు ద్రోహులకు భయపడిజీవిస్తున్నామా?

లేదే? వారి నేరాలనుబట్టి శిక్షలు విధిస్తున్నాం. దుష్టశక్తులు ఉంటే, అవెవరికైనా హానిచేస్తుంటే, ధైర్యంగా ఎదుర్కొంటాం. వాటిని తరిమి వేస్తాం. అంతేగాని పిరికిపందలుగా వాటికి పూజలు చేయము.

13) ఊహించని ఆటంకాలు అవరోధాలు, మానసిక శారీరక చికాకులు ఆందోళనలు, స్వశక్తితో అధిగమించలేని కష్టాలువంటివి దీర్ఘకాలం కొన సాగటంవల్ల, దుష్టశక్తుల ప్రభావ మేమోనన్న భ్రమలోకి పడటం ఉంటుంది. మంచిచెడులకు ఏవి కారణాలుగా ఉంటున్నాయో గుర్తిస్తే, మంచి చెడులు దుష్టశక్తులవల్లనా లేక మానవులవల్లనా అనేది తెలుస్తుంది. దుష్టశక్తులు ఉన్నాయో? లేదో? ఏమయినా అవి చేసే హానిలేదు. మనిషి మాత్రం దుష్టుడు అయ్యాడు. మనుష్యులలోని దుష్ట స్వభావాలే దుష్ట శక్తులు. మనిషి వ్యధకు కారణం మనిషి.

14) ధనాకాంక్ష. అధికార కాంక్ష, అధిక లాభాపేక్ష, భోగలాలసత, స్వార్థదృష్టి, అవినీతి, అసమర్థత, వ్యసనాలు, సరికాని కోరికలు వంటివి దుష్టశక్తులు. ఈ దుష్టశక్తులకు మానవులు తావు ఇవ్వటంవల్ల, మానవ సమాజం యావత్తూ దుష్టశక్తులచే పీడింపబడుతోంది. ఈ దుష్టశక్తుల ప్రభావంవల్ల, పాలకులకు ప్రజలకు ఉండవలసిన విశాల దృక్పథం నశిం చింది. ఇది కష్టనష్టాల వలయంలో పరిభ్రమింప జేస్తోంది.

15) జరగవలసిఉన్న మంచిని తొలగించటము, జరగవలసిఉన్న చెడును తొలగించటము, మనిషివల్ల సాధ్యపడుతోంది. అనేకులకు మంచిని కల్గిం చటము, అనేకులకు చెడును కల్గించటము, మానవులవల్లనే ఉంటోంది. ఫలితాలు అకస్మాత్తుగా చేకూరేవి, ఫలితాలు అకస్మాత్తుగా పోయేవి కాదు.

# బాబాలు, అమ్మలు

అధికారం ఐశ్వర్యం కాంక్షాసక్తులు వదలలేని స్థితిలో ఉన్న, వారికి ప్రణమిల్లటం అవివేకం. ఉన్నతమైన వ్యక్తిత్వం ఉన్నట్లు భ్రమింపజేసేది నటన. కష్టాలను కన్నీటిని తొలగించేశక్తి, మనం విశ్వసించి దర్శిస్తున్న బాబాలకు అమ్మలకులేదు. తమకున్న కష్టాలను తొలగించుకోలేని ఈ బాబాలకు స్వాములకు, మన కష్టాలను వ్యధలను తొలగించేశక్తి. వీరికెక్కడి నుంచి వస్తుంది. బ్రతికిఉండగా ఏమిచేయుటకు శక్తిలేని వీరికి. మరణించిన తదుపరి ఏమి చేయగలరని ఆలయాలుకట్టి, విగ్రహ ప్రతిష్టలుచేసి పూజిస్తున్నారు.

2) తామే దేవుళ్ళగా ప్రచారం కావించుకుంటూ, మరణించిన తదుపరి కూడా, ఆశ్రితరక్షణ భక్తుల సంకల్పాలను నెరవేర్చే మహిమాన్వితులుగా సాగే ప్రచారానికి. అవకాశాన్ని కల్పించుకుంటున్నారు. తమ సమస్యలను పరిష్కరించుకోలేని వీరు, మనలచేత దేవుళ్ళగా పూజలను అందుకుంటున్నారు. వీరిని పూజించటం ఎంత తెలివితక్కువ.

3) ఆధ్యాత్మిక సందేశాలు, ఆధ్యాత్మిక శిక్షణ, ఆధ్యాత్మికానుభూతులు, దివ్యానుభవాలు ఇవన్ని మోసపూరిత ప్రచారము. ఈ ప్రచార ప్రభావంలో వారి కడకేగి ఏదో ఆశించుటవల్ల, ఏవిప్రాప్తించవు. వీరు ఏవయినా అద్భుతాలు చేయకల్గితే, ఆ అద్భుతాలను చేయకలిగేశక్తి ఉన్నవారిగా మాత్రమే గుర్తింపు ఇవ్వాలి. అద్భుతాలను చేసినంత మాత్రాన, మానవ జీవితంలో కష్టనష్టాల తొలగింపు కాని, అదృష్టవంతుల్ని చేయటం కాని, వ్యాపారాభివృద్ధి, ఉద్యోగప్రాప్తి, లాభాలుగాని, ఏవి సాధ్యపడవు. వీరి సందర్శనవల్ల, వీరి దీవెనలు కృపవల్ల, వీరి అనుగ్రహంవల్ల, ఏవో సత్ఫలితాలు ఒనగూరుతాయనేది అబద్ధము.

4) సక్రమమైన మార్గము. సరియైన జీవనము, ఎవరి ఉపదేశామృతంవలనో సాధ్యపడవు. కష్టనష్టాల తొలగింపు, బాబాలు స్వాములు, మతగ్రంథాలు, మంత్రతంత్రాలు, గ్రహశాంతులు, క్షుద్రశక్తులు, యజ్ఞయాగాదులు, ఉపాసనలు, వీటి వేటివల్ల ఏవి తొలగవు. మానవజాతి పురోభివృద్ధికి జీవితంలో సుఖసంతోషాలకు, అవివ్వగల తోడ్పాటు ఏదిలేదు. కాబట్టి వాటిని, వారిని, ఆశ్రయించటం నిష్ప్రయోజనం. లేనిపోని కోరికలు పెంచుకొని, ఏవేవో ఆశిస్తూ వ్యర్థమైన తతంగాలు చేస్తుంటే, మిగిలేవి నిరాశా నిస్పృహలు.

# పండుగలు

1) పండుగలకి పర్వదినాలకి సంబంధించిన గాథలు అనేకానేకం. వాటిని నమ్మి వాటికో ప్రాధాన్యత నివ్వటం అవివేకం. ఒకే మతస్థులు ఒకే పండుగను తమ ప్రాంతాలలోఉన్న నమ్మకాలనుబట్టి, వైవిధ్యంతో జరుపుకుంటున్నారు. మతప్రమేయం కలవి, మతప్రమేయం లేనివి, సాంఘికపరమైనవి, ఇలా ఎన్నో పండుగలు జాతిజీవనంలో చేరిపోయాయి. 2 మత మౌఢ్యాన్ని ప్రభుత్వాలు ప్రోత్సహిస్తుండటంవల్ల, మత ప్రమేయంగల ఉత్సవాలను ఊరేగింపులను ప్రదర్శనలను భారీగా నిర్వహిస్తున్నారు. చందాలు విరాళాల పేరిట అనేకులు వేధింపబడుతున్నారు. దేశవ్యాప్తంగా లక్షలాదిపౌరులు, ఇలాంటి కార్యకలాపాలలో పాల్గొంటానికి తరలిరావటం ఉంటున్నది.

2) రోజువారి ప్రయాణాలకు రైళ్ళు బస్సులు చాలటంలేదు. రోడ్లు ఖాళీ ప్రదేశాలు ఆలయాలు వంటివి పరిమిత జనాన్ని మాత్రం భరించగలవు. రద్దీని తట్టుకునేందుకు ఎన్ని ఏర్పాట్లుచేసినా, ఇవి సరిపోక, వీటిల్లో పాల్గొనే వారు, ఎన్నో అవస్థలు పడకతప్పదు. పూజాసామగ్రి పళ్ళు ఆహారపదా

ర్థాలు వంటి వాటికి ఎంతో అధిక ధర చెల్లించాలి  ఊపిరి సలుపని రద్దీకి తోడు, దౌర్జన్య సంఘటనలు, సంఘర్షణలు ప్రమాదాలు వంటివిచే, గాయాలు మరణాలు సంభవిస్తుంటాయి అపరిశుభ్రమైన ఆహారంతో బాటు కల్తీవల్ల, తదుపరి అనారోగ్యం పాలవటము జరగవచ్చు. త్రొక్కిసలాటల్లో దురవస్థల పాలవటంతో బాటు, దొంగతనాల బెడదతో బాటు, దాహానికి మల మూత్ర విసర్జనలకు ఎంతో బాధపడాలి.



3) బాణసంచా కాల్చే వినోదంలో [1 ఏడాది పొడుగునా చిన్నా పెద్దా ఫ్యాక్టరీలు ఎన్ని పనిచేస్తున్నాయో 2 వీటికొరకు ఎంత పెట్టుబడి ఖర్చ యిందో ఖర్చవుతున్నదో 3 వీటి కొనుగోలులో ఎంత ప్రజాధనం దుబారా అవుతున్నదో 4 బాణసంచా తయారీలో ఎందరెందరు వ్యాధులు ప్రమాదాలు గాయాలు మరణాలు పాలవుతున్నారో 5 వీటి తయారీ నిల్వ అమ్మకంకొరకు ఎందరిశ్రమ నిరుపయోగం అవుతున్నదో 6 అగ్ని ప్రమాదాలవల్ల ఎక్కడెక్కడ ఎంతెంత నష్టం జరుగుతున్నదో 7 విష పూరిత రసాయనాలు మనుష్యులకు వాతావరణానికి ఎలాంటి హానిని కల్గిస్తు న్నాయో 8 ప్రమాదాలు జరిగి వళ్ళుకాలి అనారోగ్యం పాలయి ఎందరు ఆసుపత్రుల పాలవుతున్నారో — వీటన్నింటిని పరిగణించకుండా, మత సాంఘిక కార్యక్రమాలలో బాణసంచా విరివిగా వాడటం ఎలా సమం జసం ?



4) పండుగలు పేడుకలు, కులమతవర్గ వర్ణతత్వాన్ని పోషిస్తున్నాయి. ఇది బేధ భావాలకు కారణమవుతోంది. భిన్నమతస్థులకు భిన్న రీతిలో ఇవి ఉండటంవల్ల, వీటిని జరుపుకునేందుకు శలవులు ప్రకటించటం, పనిదినాల నష్టం అనివార్యం అవుతున్నది. 2 సాంఘిక హోదాగా భావించి జరుపు కోవాల్సిన పరిస్థితి అందరికి ఏర్పడటంచే, జనాభాలో అధికులు ఆర్థిక

భారంతో, మానసికంగా బాధపడాల్సి వస్తున్నది. పండుగలు జరుపుకునే వినోదంకన్నా, ఆర్థికభారాన్ని భరించలేకున్న అత్యధిక ప్రజానీకంయొక్క మానసికస్థితి ఏమిటన్నది ప్రశ్న ?

5) దుబారా దుర్వ్యయానికి ఇవి కారణమవుతున్నాయి. డబ్బు ఉత్పత్తులను అవసరానికి మించిన స్థాయిలోను, అనవసరంగాను ఖర్చు చేయవలసిరావటం, వీటివల్ల ఏర్పడుతున్నది. 2 పండుగలు ఆడంబరాన్ని ప్రదర్శించుకునే ఆరాటంవేపు మరల్చాయి. వ్యక్తులను వృథా వ్యయప్రయాసల పాల్జేస్తున్నాయి పైవాటి దృష్ట్యా మతపరమైన తదితరములైన వాటికి, అనవసరమైన ప్రాధాన్యతను ఇవ్వటం అంగీకరించరాని విషయం. సంస్మరణ, గౌరవం వంటి వాటిపేర వేడుకలు సమ్మతింప దగ్గవికావు.

6) దేవునికిగల ఔన్నత్యాన్ని అర్థం చేసుకోనందువల్లనే, మన పూర్వీకులు తాము ఊహించుకున్న దేవుళ్ళ ప్రీతికొరకు, ఎన్నో పద్ధతులను ప్రవేశపెట్టుకున్నారు. ప్రపంచంలో ఈ పండుగలను ఎక్కడెక్కడ ఏేటి పేరుతో జరుపుకుంటున్నారో, వాటి పూర్వాపరాలేమిటో, ఈ అవక తవకలతో కూడిన వీటి చరిత్ర ఎన్నో గ్రంథాలుంటాయి. ఇవి ఒక పట్టాన అర్థంకావు. నేటి మనకు ప్రకృతియొక్క విశ్వముయొక్క తదితర విషయాల గూర్చి అవగాహన ఏర్పడి ఉంది. మతాలు మానవసృష్టి అని, మతకర్తలు దేవుళ్ళులేరని, దేవుడొక్కరని తెలుసు. అలాంటప్పుడు దేవుళ్ళ పేరిట మత సంబంధం పేరిట జరిపే పండగలను. విడనాడటంతో పట్టువదలు ఎందుకు ? మనంచేసే పనులు సరైనవో కావో పరిశీలించుకోవద్దా ?

7) ప్రతి వ్యక్తిలో ఆలోచన కల్గించటం, మూఢ విశ్వాసాలను తొలగించటం. మూఢాచారాల పేరిట జరిగే ఉత్సవాలకు వేలం వెర్రిగా వెళ్ళకుండా నిలుపుదల చేయటం వంటివి సాధ్యపడవు. ఎవరికి వారు వివేచనతో

మూఢాచారాలను మూఢ విశ్వాసాలను అధిగమించ లేకుంటారు. జన సమూహంతో కూడిన ఉత్సవాలు తిరునాళ్ళు అర్థరహితమైన పండగ కార్యకలాపాలను నిషేధించటం సరైనది. దేవుని పేరిట జరుపుకోదలంచితే ఇళ్ళు ఉన్నాయి. మనస్సు ఉంది.

# మ త క ల హా లు

1) ఒకో మతం తనదైన సంస్కృతిని ప్రవేశపెట్టింది. మతపరమైన సంస్కృతి వేరవటంచే భావ సమైక్యతలేదు. భావ సమైక్యతకు దోహద పడనీయని తత్వం మతాలలో వుంది. మతపరమైన సంస్కృతి లోప భూయిష్టమైనది కొబట్టీ మతపరమైన ఉద్రిక్తతలు నెలకొంటున్నాయి. ఇవి మతిలేని హీనులుగా పరస్పరం తలపడేట్లు చేస్తున్నాయి 2 మతాలు వేర్వేరు పరిధులను గీచాయి. ఎవరి పరిధిని వారు పట్టుదలలతో కాపాడు కునేట్లు మత దురభిమానాన్ని మతతత్వ శక్తులు కాపాడుతున్నాయి. 3 తన అనే దురభిమానం నిష్పక్షపాత వైఖరితో పరిశీలించ నివ్వదు. ఆగ్రహావేశాలు ఉద్రిక్తతలు పెరిగినట్లుగా, వివేకవంతమైన ఆలోచనను పెంచుకోవటంలేదు.

2) వివిధ మతాలకు చెందిన మతతత్వ శక్తులు ముఖ్య పట్టణాలలో, నగరాలలో వున్నారు. వీరు మత పరమైన ఉద్రిక్తతలను రెచ్చగొడుతూ తమ మతస్థులను అల్లర్లలోకి హింసాకాండలోకి లాగుతున్నారు. మతా రచణలపై నమ్మిక అపనమ్మిక కుటుంబ సభ్యుల మధ్యనే ఉంటున్నది. సమాజంలో నివసిస్తుందే కోట్లాది ప్రజలమధ్య, పరమతం గూర్చిన విమర్శో అమర్యాదో లేకుండా ఉండటం సాధ్యపడదు. ఇలాంటి స్వల్ప సంఘటనలపై వివాదాలు ఏర్పడి, అదలా మత సంఘర్షణకు కారణం అవుతోంది.

3) పండుగలు పెళ్ళిళ్ళ అంత్యక్రియలకు సంబంధించిన ఊరేగింపులు వల్ల, మతంపట్ల మత దేవుళ్ళపట్ల ప్రవక్తలపట్ల అవమానం జరిగిందని, మత విశ్వాసాలను పాటించటంలేదని, మత పరమైన విధానాలకు అను గుణంగా ప్రభుత్వ విధానాలు ఉండటంలేదని ఇలాంటివిచే ఉద్రిక్తలకు లోనయి హింసాకాండకు తలపడుతున్నారు.

4) మతాచారాలపై ఉన్న ఛాందస స్వభావం, ఒకరిపై మరొకరు దాడి చేసుకుంటానికి కారణంగా వుంది. భిన్న మతస్థులకు ప్రాతినిధ్యం వహించే వారిమధ్య నెలకొన్న పాత కక్షలవల్ల, భిన్న మత సంస్థలమధ్య వివాదాల వల్ల, భిన్న మతస్థులమధ్య కులాలమధ్య నెలకొన్న పరస్పర ద్వేషం వల్ల—స్వల్ప సంఘటనలు వివాదాలకు సంఘర్షణలకు కారణ మవు తున్నాయి.

5) మతపరమైన విశ్వాసాలు వేరవటంచే, ఎవరి విశ్వాసాలను వారు కాపాడుకోవాలనే పట్టుదలలు వహిస్తున్నారు. మతమౌఢ్యం మతోన్మాదం మతావేశం మతకట్టడి పరమత అసహనం వంటివి, వివిధ మతాలవల్ల ఏర్పడుతున్నాయి. ఈ మతతత్వం అల్లర్లకు హింసాకాండకు దోహద పడుతోంది. మత కలహాలు ఎందుకు జరుగుతున్నా ఎలా ప్రారంభమవు తున్నా వీటి ఫలితాలు ఏమిటి?

6) నాటుబాంబులు తుపాకులు కర్రలు బరిసెలు కత్తులు రాళ్ళ సీసాలతో దాడి చేస్తుంటే, రక్తసిక్తమైన గాయాలతో చావు బ్రతుకులమధ్య గడ పాల్సినది ఎవరు? 2 వాహనాలు హోటళ్ళ గిడ్డంకులు ప్రభుత్వ కార్యా లయాలు వీటికి నిప్పెడుతూ తగల బెట్టుతూ ధ్వంసం చేస్తుంటే ఎవరికి నష్టం? 3 గృహాలు దగ్ధమవుతున్నా, షాపులు దగ్ధమవుతున్నా, ఇళ్ళలో షాపులలో దోపిడి జరుగుతున్నా, మానభంగాలు జరుగుతున్నా, ఆస్తులు కొల్లగొడుతున్నా, హత్యాకాండ జరుగుతున్నా, వీటి భయానక ఫలితాలను

అనుభవించేది ఎవరు? 4 ఏ కలహాలకు సంబంధంలేని వందలాది పౌరులు ప్రాణాలు కోల్పోయారన్నా, వేలాది పౌరులు గాయాలతో దుఃఖిస్తున్నారన్నా దీనికి కారణం మత కలహాలు. ఒక వ్యక్తిని కోల్పోతే వారిపై ఆధారపడ్డవారు ఎంతగా దుఃఖిస్తారు. మతపరమైన అల్లర్లతో భయ భీతావహ పరిస్థితిలో జీవించాల్సినది ప్రజలు. ఎందుకు ఈ కష్ట నష్టాలు ?

# మతము - రాజకీయము

1) మతం ఒక శక్తి. మతాభిమానం ఒక శక్తి. ఈ మతశక్తిని ఒక ఆయుధంగా గైకొని స్వప్రయోజనాలకు స్వార్థపరులు ఉపయోగించు కుంటున్నారు. 2 కుల మత పరంగా ప్రజలను కూడగట్టుకుంటానికి, కుల మత ఉద్రిక్తతలను రెచ్చగొడుతున్నారు. 3 మత చాందసత్వాన్ని ప్రేరేపిస్తూ రాజకీయాలను తమ గుప్పిట్లో పెట్టుకునేవారున్నారు. 4 విడనాడవలసిన మతపరమైన సనాతనత్వాన్ని, తమ మతస్థుల ముందు ఉంచి, మత ద్రోహం జరుగుతోంది అంటూ ప్రదర్శనలు ఆందోళనలు జరుపుతూ, ప్రజాభిమానాన్ని పొందేందుకు మతాలు సాధనాలుగా ఉపయోగిస్తున్నాయి.

2) అర్హులైన అభ్యర్థులకు అర్హతగల పార్టీకి ఓట్లు రాకుండా, పాలనలో ప్రాతినిధ్యం లభించకుండా, మత శక్తిని ఎన్నికలలో ప్రయోగిస్తూ పాలనాధికారాన్ని కైవసం చేసుకుంటానికి, మతం దోహద పడుతోంది.

3) కుటిల రాజకీయాలను మతంతో ముడివేసి, మతము రాజకీయాలు వేర్వేరు కాదన్నంతగా గందరగోళపరచి, ప్రజలను విచక్షణా రాహిత్యం లోకి కొనిపోతూ, సమస్యలను సమస్యలుగా పరిష్కరింపటానికి వీలు

లేకుండా, మత శక్తిని అవరోధంగా ఉంచుతూ, తమ ఆధిక్యాన్ని ప్రయోజనాలను పెంపొందించుకోవటానికి, మతం సాధనంగా ఉపయోగిస్తోంది.

4) స్థానికులు పాలక ప్రతినిధులు పార్టీలు ఒకరిపై మరొకరు కక్షలు వహించి, కులాల మతాలవారి విభేదాలను రెచ్చగొడుతూ, మత కలహాలకు మత శక్తిని వాడుకుంటున్నారు.

5) ఎలాగ పరిపాలన నిర్వహింపబడితే అందరి సమస్యలు పరిష్కారమవుతాయోననేది వదిలేసి, కులాలు మతశాఖలు మతాలవారి పరిపాలనలో ప్రాతినిధ్యం కొరకు ఎగబడుతున్నారు. ఇందుకు మతశక్తిని ప్రయోగిస్తూ పరిపాలనలోకి జొరబడుతున్నారు. ఇలా పరిపాలనలో చేరి తమ కులాలకు మత శాఖలకు మతాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నామంటూ, కుల మత వర్గ పరమైన కోరికలను కోరుతూ ప్రభుత్వంపై వత్తిడులుతెస్తూ, తమకు తమ వర్గీయులకు ప్రత్యేక ప్రయోజనాలను సమకూర్చుకుంటున్నారు. దానిచే భిన్న మతస్థుల మధ్య అనుమానాలు వైషమ్యాలు పెరుగుతున్నాయి.

6) వివిధ రంగాలలో కుల మత వర్గ పరంగా అవకాశాలు లేవని సదుపాయాలు లేవని వివక్షకు గురవుతున్నామని, వివాదాస్పదమైన కోరికలు కోరుతూ వీటిని ప్రభుత్వం నెరవేర్చకుంటే, కుటిల రాజనీతితో కుల మత వర్గ పరంగా అలజడులను లేవదీస్తూ సమస్యలను సృష్టిస్తున్నారు, జటిలం చేస్తున్నారు.

7) మా జాతి అనో మా సంస్కృతి పరిరక్షణ అనో మతపరమైన స్వేచ్ఛలేదనో మతం పేర ప్రత్యేకతలను కోరుతున్నారు. మిగతా రాష్ట్రాలకులేని ప్రత్యేక తరహా సదుపాయాలు కావాలంటారు. తోటి ప్రజల నుండి విడిపోతేగాని స్వతంత్ర ప్రతిపత్తి లభిస్తేగాని సౌఖ్యంగా

మనుగడ సాగించలేమని, కపట ప్రవృత్తితో హింసాకాండను అరాచకాన్ని సృష్టించటానికి, మతశక్తిని దుర్వినియోగ పరుస్తున్నారు. అల్లర్లను కల్లోలాలను సృష్టిస్తూ, మొత్తం సమాజానికి కష్టనష్టాలను కల్గించటం ఉంటోంది. కుటిలయత్నాలకు కుటిల రాజకీయాలకు ద్రోహబుద్ధితో కూడిన కాంక్షలకు, మతశక్తిని జోడించటం ఎందుకు? పదవీకాంక్ష అధికారకాంక్ష స్వప్రయోజనాలపై గల కాంక్ష.

8) మత అజ్ఞానంతో రెచ్చగొట్టేవారికి, మతంపేరుతో పేరు ప్రతిష్టలను కైవసం చేసుకునేవారికి, విశాల దృక్పధంలేని నయవంచకులకు మనం స్థానం ఇవ్వవచ్చా? సత్తాఉంటే ప్రజలకు సేవచేయాలి. దేశపురోభివృద్ధి కొరకు నిరంతరం శ్రమించాలి. ప్రజలపై ప్రేమఉంటే ప్రజలకోసం పాటు పడాలి.

9) కులం, మతం, వర్గంవల్ల పరస్పర అనుమానాలు పరస్పర అవిశ్వాసము ఉంటోంది. ఒకదేశ ప్రజలమధ్య ఉండాల్సిన సమైక్యతకు, మతాలు దోహదపడటంలేదు. భిన్నమైన మతాలవల్ల, దేశసమగ్రతకు భంగంవాటిల్లుతోంది. ఇదెంత బాధాకర పరిణామం? ఇందుకొరకయినా మతాలను పిడిచి పెట్టాలి.

## మత పాలన

1) పరిపాలన అనేది అత్యున్నతాధికారం. దీనిని కైవసం చేసుకుంటానికి స్వార్థపరుల కుటిల ప్రయత్నాలు ఉంటాయి. స్వార్థపరుల కుటిల యత్నాలకుగల అవకాశాలను నిరోధించుటకొరకే పరిపాలనలో కుల వర్గ మత ప్రమేయం ఉండరాదనేది. లేకుంటే రాజకీయ ప్రయోజనాలకోసం కులాలవారి మత శాఖలవారి వర్గాలవారి అడ్డుగోడలు అనైక్యత సృష్టింప

బడుతుంది. అధికారులు పాలకులు నాయకులు వారెంత మంచివారయినా అవకాశాలనుబట్టి స్వార్థపరులుగా మారుతుంటారు. ఇది నిరోధించ బడేందుకే మతప్రమేయం ఉండరానిది.

2) పరిపాలనవల్ల వ్యక్తి సంబంధమైన సమాజ సంబంధమైన సమస్యలు తొలగాలి. ఇట్టి పరిపాలనకు అవరోధంగా ఉన్నవాటిని తిరస్కరించాలి. ప్రభుత్వపాలనకు ప్రజలు సమస్యలను సృష్టించకూడదు. ప్రభుత్వము ప్రజలకు సమస్యలను సృష్టించకూడదు. ఈ స్థితి వేటివల్ల సాధ్యమో గుర్తించి తదనుగుణ నిర్ణయాలుండాలి.

3) వార్తాప్రసార సాధనాలు ఆధునిక యుద్ధతంత్రము ఉన్న నేటి కాలంలో ఎలాంటి పరిపాలన ఉండాలో ప్రజలు స్పష్టంగా తెల్సుకోకుంటే దేశదేశాల మధ్య ఎప్పుడూ ఏవో తగాదాలు యుద్ధాలు ఉంటాయి మతపరమైన సిద్ధాంతపరమైన విభేదాలతోను పరస్పరం తలపడుతుంటారు. ఇట్టి ప్రమాదకర పరిస్థితులు ఏర్పడకుండా ఉండేందుకు పరిపాలనలో శాస్త్రీయత ప్రపంచవ్యాప్తంగా ఉండాలిగాని, వేరే రీతిలో ఎవరూ అంగీకరించ కూడదు.

4) వ్యక్తిపరంగా సమాజపరంగా సమస్యలు ఉంటే సమస్యల పరిష్కారానికి సరైన పద్ధతులను అన్వేషించాలిగాని మతదృష్టికి స్థానం ఇవ్వరాదు. మత దృష్టిఉంటే మతంలోకి రాజకీయాలు రాజకీయాల్లోకి మతం ప్రవేశిస్తుంది. పురోగమనానికి బదులు తిరోగమనం ఏర్పడుతుంది. ప్రజలలో చీలికలు ఏర్పడి ఐక్యత నశిస్తుంది. సంఘర్షణలు చెలరేగుతాయి. కాబట్టి సరైన పద్ధతులను అవలంభిస్తే ఈ సంఘర్షణ తలెత్తదు. పరిపాలన అందరికీ సంబంధించినది అవటంవల్ల సాంఘిక ఆర్థిక పురోగతిని సాధించేట్లు అందరు సహకరించాలి.

5) మతోన్మాదం మానవత్వాన్ని నశింపజేసి క్రూరత్వాన్ని అవలంభింప

జేస్తుంది. పరమతస్థులకు నిలువ నీడ లేకుండా చేయాలంటుంది. పర మత స్థులను హింసించే రాక్షసత్వాన్ని ప్రేరేపిస్తుంది. సమాన ప్రతిపత్తిగల పౌరసత్వాన్ని ఇవ్వలేదు. కాబట్టి మతప్రమేయంతో కూడిన పరిపాలనను అంగీకరించరు.

6) నేరస్థులు ఆధునిక పద్ధతులు ఉపయోగించి పట్టుబడని రీతిలో నేరాలు చేస్తుంటారు. వారి నేరాలను రుజువు చేయకలిగే నేరస్థులను పట్టుకోగలిగే ఆధునిక పద్ధతులు పోలీసుశాఖకు ఉండాలి. ఇలా లేకుంటే నేరస్థులు ప్రజలను వ్యధలపాల్జేస్తారు. దేశంలోని వివిధ శాఖలలో కూడా అంతే. చట్ట బద్ధంగా న్యాయబద్ధంగా ప్రతిది జరిగిపోవాలంటేనాగరికతనుబట్టి మనుష్యుల మనః స్తత్వం బట్టి ప్రతిదీ ఆధునికీకరించుకోవాలి. ఈ ఆధునికీకరణను మత సంప్రదాయాలు సనాతన పద్ధతులు విరోధిస్తాయి. అందువల్ల పరిపాల నలో పాలనకు సంబంధించిన వివిధశాఖలలో మతదృష్టికి సంప్రదాయ దృష్టికి తావుండకూడదు.

7) జీవన విధానంలో స్త్రీ పురుషులకు ఏవిధమైన హక్కులు అవకాశాలు ఉండాలో నిర్ణయించుకోవలసింది మనంకాని పాతకాలంనాటి మతాలు మత పాలకులుకాదు. వర్తమాన అనుభవాలనుంచి జీవనవిధానాన్ని పాలనా విధా నాన్ని సంస్కరించుకుంటుంటే జీవితపరంగా సమస్యలు కష్టాలు ఉండవు.

8) మతాలు ఏ తప్పిదం చేశాయో తిరిగి అదే తప్పిదాన్ని మతాభిమా నంతో ప్రజలు చేస్తుండబట్టి మతపరమైన పాలనకు స్థానం ఉంటోంది. మతపాలనను అభిమానిస్తే మతానికి ఉన్న స్థానాన్ని నిలిపేందుకు మత ధర్మాలు మతసూత్రాలు పాటించేటట్లు ప్రభుత్వం నిర్బంధం చేస్తుంది. మతాలను త్యజిస్తే మతపరమైన అనుసరణలు నిర్బంధాలు ఉండవు.

9) మతపరమైన ఆంక్షలు ఆచారాలు మతపరమైన సూత్రీకరణలు సిద్ధాంతాలతో కూడినది, మతపరమైనపాలనగా జీవనవిధానంగా ఉంటుంది. పై వీటికి స్థానం లేకుండాచేస్తే, మతరహిత పాలన జీవన విధానము నెల కొంటుంది.

...o...

1) అధికారం ఆజ్ఞాపన ఎవరి అధీనంలో ఉంటుందో వారికనుకూలంగా ప్రతిది ప్రవేశపెట్టకునెడి అవకాశం ఉంటుంది. పరిపాలన పురుషులచే నిర్వహింపబడింది. మతాచారాలు సంప్రదాయాలు పురుషులచే ప్రవేశపెట్ట బడ్డాయి. మతగ్రంథాలు రచయితలచే వ్రాయబడ్డాయి కాబట్టి మతదృష్టిలో ఈ మగదృష్టి ఉంటుంది.

2) స్త్రీలకు ఇవ్వవలసిన ప్రాధాన్యతను పురుషులు విస్మరించారు. స్త్రీలు తమ చెప్పుచేతలలో ఉండేట్లు ధర్మంపేర దేవునిపేర కట్టుబాట్లు నియమాలు విధించి తమ సేవకురాళ్ళుగా చేశారు. యజమానికి బానిసవలె భార్యను భర్త అధీనం చేశారు. ఇలాంటి బానిసవిధానంలో న్యాయానికి చోటుండదు. పక్ష పాత వైఖరి సహజం. మత సంస్కృతిలో ఇదే ప్రతిబింబిస్తుంది. కాబట్టే మతం ధర్మబద్ధమైనదికాదు.

3) మతాలు పాలకులకు ధనికులకు మతవర్గానికి అనుకూలంగా మతవిధా నాలను ప్రవేశపెట్టాయి. దీనిచే పాలకుల గుప్పిట్లో ప్రజలకి ధనికుల గుప్పిట్లో పేదవారికి బానిసత్వం ఏర్పడింది. మతంపై మతవర్గంపై ప్రజ లను ఆధారపడేట్లు చేస్తేగాని మతవర్గం పిడికిలిలోకి ప్రజలురారు. మత వర్గానికి అధికారాలను ఆదాయాలను మతపరమైన భావనల ద్వారా మత కర్మకాండ ద్వారా సృష్టించారు. ఇలా మత సంకెళ్ళతో అసమానతలు బానిసత్వం ఏర్పడింది.

4) పాలకులకు ధనికులకు మత వర్గానికి పురుషులకు అనుకూలంగా మతాలు ఉండుటచే మతతత్వంపై అభిమానం ఏర్పడింది. కుటుంబరీత్యా పాలనారీత్యా పురుషులు తమకు ఉన్న అధికారాలను అవకాశాలను చేతులారా జారవిడచుకోరు కదా! అందువల్ల మతతత్వాన్ని వదుకోయకున్నారు.

5) ఒక వ్యాపారంలో ఇద్దరికి భాగస్వామ్యం ఉంటే రహస్యాలకు వ్యక్తిగత నిర్ణయాలకు తావుండదు. అధికారంలో అవకాశంలో సమానత్వం వల్ల పరస్పరం అంగీకారం ఆమోదం భాగస్వామ్యులమధ్య తప్పనిసరి. ఒకరు మరొకరిని అణచివేస్తుంటే రెండవ వ్యక్తి ఎదుర్కొంటాడు. అలాగే జీవితంలోను స్త్రీలు పురుషులను ఎదుర్కొంటారు. దాంపత్యంలో ఈ పరిస్థితి రాకుండా అణగి మణిగి పడి ఉండేట్లు మతాలు సహాకరిస్తున్నవి.

6) పురుషుల అధికారంలో స్త్రీల పరిస్థితి ఎంతో దయనీయంగా మారింది. మత ఆంక్షలను ధిక్కరించిన దేశాలలోని స్త్రీలు ఎన్నో ఉద్యమాలద్వారా చట్టపరమైన హక్కులను సాధించుకున్నారు. ఈ ప్రగతిలేని దేశాలలో స్త్రీలు మతపరమైన ఆంక్షలతో గడుపుతున్నారు.

7) మతాలు విభిన్నమన స్తత్వాలకు దోహదపడుతూ సంఘర్షణలకు కారణమవుతున్నాయి. భావాలలో రావలసిన మార్పును నిరోధిస్తున్నాయి మనుష్యుల ఆలోచనలను వక్రీకరిస్తూ కష్టాల నుండి విముక్తం అవకుండా అడ్డుకుంటున్నాయి. మానవ సౌఖ్యానికి మూలం న్యాయం. ఇట్టి న్యాయాన్ని సాధించే మార్పుకు దోహదపడని వయ్యాయి.

8) సామాజిక రాజకీయ దృక్పధాలు ఒక దాని నుండి మరొకటి దీలుదవి. లేనివి. వాటికి సంపూర్ణతను శాస్త్రవిజ్ఞానం కల్గిస్తుంది కాని, మతాలుకావు. ఆ మూడింటి పరస్పర సంబంధాలకు మతాలు విఘాతం కల్గిస్తున్నవి

పరస్పర సంబంధితమైన వాటిల్లోకి మతాలు ప్రవేశించి స్థిర ప్రభావాన్ని చూపటంవల్ల నేటికి ఎన్నో అనర్థాలను భరింవాల్సి వస్తోంది.

9) మతాలు గతంలో ఏమి సాధించాయి? మానవుల మధ్య ఐక్యతను అన్యోన్యతను పెంచకలిగాయా? తమ ధర్మాన్ని కర్తవ్యాన్ని గుర్తింప జేయించాయా? నీతి నిజాయితీగా జీవింప జేయకలిగాయా? వివిధ విషయాలపై సదవగాహనను పెంపొందించాయా? నేడు ఏమి సాధించగలవు? ఈ ప్రపంచ సమస్యలలో వేటిని పరిష్కరించగలవు? మతాలకు వున్నది ఎటువంటి శక్తి? మంచా, చెడా? మతాలు అనేక ఉచ్చులు. వాటి ఉచ్చులు మానవ సమాజంపై ఉంటే కష్టనష్టాలు తప్పనిసరి.

10) మతాలు ఎంతటి విషాదానికి ఎంతటి కన్నీటికి కారణమయ్యాయో గతకాల చరిత్ర సాక్ష్యం. ఎంతో కన్నీటిని ఎంతో విషాదాన్ని మానవ హృదయాలు స్రవించాయి. దైవవాక్కు కాదని నేడయినా తృణీకరిస్తే మత పరమైన బానిసత్వం నశిస్తుంది. మతాలు చేసిన కీడు అపారం. ఇకనైనా మతాలకు కాక మానవత్వానికి స్థానం ఇద్దాం.

11) దైవ వాక్కని నమ్మించటంచే, మతాలు చేసిన చేస్తున్న కీడు విస్మరించ బడుతోంది. దైవంపై ఉండే ప్రేమభావం క్రోధావేశాలకు తావివ్వలేదు. మత గ్రంథాలపై ఆగ్రహానికి బదులు ఆదరణ అభిమానం ఏర్పడింది. పక్షపాత వైఖరి అధర్మము అసత్యముతో కూడిన మతాలు దేవుని నుంచి వస్తాయా? జ్ఞాన స్వరూపుడైన దేవుని భావనలన్ని సత్య సంకల్పం సమ దృష్టి కష్టనష్ట రహితంతో కూడినవయి ఉంటాయేకాని అల్ప అనల్ప అజ్ఞాన వైఖరికి సంబంధించినవయి వుండవు కదా!

12) మతాలలో అజ్ఞానం వుంది. మనుష్యులలోను అజ్ఞానం వుంది. దీనిచే అజ్ఞానం అజ్ఞానాన్ని పోషిస్తుంది తప్పితే ఖండించి తిరస్కరించదు. మతాలు బొందిన స్వభావంవేపు లాగుతున్నా వివేకవంతమైన ఆలోచనలతో

బాంధసత్వాన్ని చేధించవచ్చు. ఇదిలేదు. మతాల పాత్ర ఏ రీతిలో ఉన్నా అజ్ఞానమే కష్టనష్టా లన్నింటికి కారణం. ఈనాడైనా అజ్ఞానాన్ని తొలగించుకుంటే సమస్తము శుభప్రదం కాగలదు.

...o...

మతములవల్ల కషనష్టాలు కల్గుతున్నాయి అనెడి భావనవేష్ట మరల్చటం కొరకు నామమాత్రంగా విషయాన్ని వెల్లడించాను. సమీపగతం వర్తమాన పరిస్థితులను క్షుణ్ణంగా పరిశీలించి దేశ దేశాలలో మతములవల్ల మానవాళికి కల్గుతున్న కషనష్టాలు గూర్చి పరిశోధించిన గ్రంథాల నుండి వివిధ విషయాలను గ్రహించినపుడు తామెంత నష్టపోయారో నష్టపోతున్నారో గ్రహింపవ్వుతుంది.

మత కాలంనాటి రాజకీయ ఆర్థిక సాంఘిక పరిస్థితులలో మతాలను గూర్చి అర్థం చేసుకోవాలి. ఈనాటి దేశ కాల పరిస్థితులతో మతాలను అగౌరవ పరచలేనిది. ఒక ప్రయోజనాన్ని ఆశించి మతాలను గౌరవించని పదాలను వాడవలసి ఉంటోంది.

# దైవ నిర్ణయానుసారం

1) వ్యక్తులు తీసుకుంటున్న నిర్ణయాలు, ప్రభుత్వాలు గైకొంటున్న నిర్ణయాలు, దేవుని నిర్ణయాలు కావు. అలాంటప్పుడు దైవ నిర్ణయాను సారం ఎలా కాగలదు? విలువలు-అవకాశం-అవసరం - ఆధారపడటం - ఆస్తి - అంతస్తు -కొంతైసక్తులు - దురాశ - లాభార్జన -ఆడంబరత్వం- అజ్ఞానం - నిరాశా నిస్పృహలు-వంటి వెన్నో నిర్ణయాలపై ప్రభావాన్ని చూపుతాయి నియమ నిబంధనలు శాసనాలు ప్రకారంగా నిర్ణయాలు జరుగుతుంటాయి. ఇలా జరుగుతుండెడి నిర్ణయాలన్ని, దేవునివి ఎలా అవుతాయి? ఆలోచనా ప్రవర్తన మానవులదా? దేవునిదా?

2) యంత్రాలకువలె మనిషి నిర్దుష్టంగా పని చేయలేడు. ఎప్పుడూ సరైన ఆలోచన సరైన నిర్ణయం సాధ్యపడదు. ఈ సరైనది లేనందుచే కష్టమో - నష్టమో - అసౌకర్యమో - వివాదమో - అసైక్యతో-ఏర్పడు తుంది. ఆలోచించటంలో నిర్ణయాలు గైకొనటంలో తప్పు ఉంటే, సరైన పద్ధతులను అవలంభించలేరు. మనిషి మేధస్సుపై శరీరంపై ఎన్నింటి ప్రభావమో ఉండటంవల్ల, ఆలోచన నిర్ణయం సరైనదవక పోవటంచే, కష్టాలు కల్గుతుంటాయి. ఈ కష్టాలు దైవంవల్లకాక, ఆలోచన నిర్ణయాలలోని దోష ఫలితాలని గుర్తించాలి.

3) అసత్యదృష్టి - ఒకే దృష్టి - స్వార్ధ దృష్టి - వంచనాదృష్టి -

అసమర్థత - అవివేకత - అనర్హత - దురభిమానం - మూఢత్వం - అజ్ఞానం వంటివితో కూడిన ఆలోచనలు, తదనుగుణంగా సాగెడునిర్ణయాలు కష్టనష్టాలు కలిగిస్తుంటాయి.

4) పరిశీలన - పరిశోధన - వివేచన - విషయ జ్ఞానము - యదార్థత - న్యాయబద్ధము - తర్కబద్ధము అయిన ఆలోచనలు నిర్ణయాలు కష్టనష్టాలను కల్గించవు

5) అనుకూల పరిస్థితులలో ఒకలాగ - వ్యతిరేక పరిస్థితులలో ఒకలాగ- పరాధీన స్థితిలో ఒకలాగ - సర్దుబాటు తత్వంలో ఒకలాగ - భయాందోళనలలో ఒకలాగ - అవకాశ ధోరణిలో ఒకలాగ - స్వేచ్ఛలో ఒకలాగ - అధికారంతో ఒకలాగ - నియంత్రణలో ఒకలాగ - త్యాగదృష్టితో ఒకలాగ, ఆలోచనలు తదనుగుణ నిర్ణయాలు ఉంటుంటాయి.

6) వర్తమాన రాజకీయ ఆర్థిక సామాజిక విధానాలు సరైనవి కాకుంటే, ఇవి తప్పుడు ఆలోచనా ధోరణులలోకి నెట్టివేస్తాయి.

7) విషయాలయొక్క భావనను సమన్వయించుకునెడి రీతిలేనప్పుడు, సరైన ఆలోచన సాగదు. విషయాలు అనేకం. తెలియనపుడు, తెలిసినది సరికానపుడు, దోష ఫలితం తప్పదు. విషయాలు తెలిసిఉన్నా, వాటిని సమన్వయించుకునెడి రీతి లేనప్పుడు, నిర్ణయాలు సరైనవి అవ్వవు. విషయము అనేది ఒక స్థితికి చెందినది లేదా పరిస్థితికి చెందినది. ఒక పరిస్థితికి చెందిన దాని పూర్వాపరాల పరిశీలనతో కూడిన ఆలోచన ముఖ్యం.

8) ప్రతి పనికి అవసరమైన ఆలోచననేకాక, ఒక విషయం గూర్చిన వర్తమాన స్థితి అందివ్వబడనప్పుడు, అది తెలియని స్థితికి నెట్టివేస్తుండటంచే, సరైన ఆలోచన ఏర్పడదు. ఆలోచనకు, నిర్ణయానికి, పనులకు, తగిన వ్యవధి లేనప్పుడు సరైన పంథా ఉండదు.

9) ఒక పని జరగాలంటే ఆ విధంగా తానయినా చేయాలి, ఇతరులచే

నయినా చేయించాలి లేదా ఆ విధంగా జరిపించకలగాలి లేదా దానంతటదే అవలా జరగాలి. పనులు ఎందుకు జరుగుతున్నాయో, పనులు ఎందుకు జరగటంలేదో, అనేది అనేకమైన వాటిపై ఆధారపడిఉంది. ఇదంతా సులువుగా అర్థమయ్యేదికాదు. భార్య చెప్పిన పనిని భర్త చేయకుండా నిర్లక్ష్యం వహిస్తాడు. అనుకోకుండా అస్వస్థతో పదిరోజులు గడుస్తాయి. వర్షాలు పడవలసిన సమయంకాని, పడటంలేదు. ప్రాజెక్టు పనిఎన్నాళ్ళకు పూర్తవటం లేదు.

10) తమంతట తాము చేసుకుంటూ పోవలసిన పనులకు, వ్యక్తులయొక్క లేదా పరిస్థితుల యొక్క లేదా శాసనాలయొక్క వత్తిడి ఉంటేగాని చేసుకుపోనివిధంగా. మనుష్యుల ప్రవృత్తులు మారాయి. ఒకరికి మరొకరు అవరోధం అవుతున్నారు. సామాజికపరమైన బాధ్యతలేదు. సమిష్టి కృషి పరస్పర సహకారంతోపాటు, ఎన్నో మనుష్యులలో లోపించాయి. అనుకున్నట్లుగాక వేరేవిధంగా జరగటానికి, అననుకూలతకు ఇదే ప్రధాన కారణం.

11) ఉద్యోగాలందయినా, వృత్తులందయినా ఏయేవాటిపై ఎలాంటి శ్రద్ధాసక్తులు కల్పించాలో, ఎలాంటి ప్రాముఖ్యత ఇవ్వాలో, అట్టివాటిపైగల నిర్లక్ష్యంవల్ల. అనుకున్న విధంగా జరగవు.

12) మన ఆలోచనలు నిర్ణయాలకు అనువయిన పరిస్థితి ఏర్పడి ఉంటే, వానిచే ఇతరులకు కష్టాలను కల్గించవచ్చు. కాబట్టి సరైన ఆలోచనలకు, సరైన నిర్ణయాలకు మాత్రమే అనువైన పరిస్థితులు ఉండాలి. ఇది జీవితాన్ని మన ఆధీనం చేస్తుంది.

13) వేటికయినా వైవిధ్యంతో కూడిన ఆలోచన పరిశీలన, విషయాన్ని బట్టి పునఃపరిశీలన ముఖ్యం. ఇవి లేకుండా వేటియందయినా. ఒక నిర్ధారణకు వస్తుంటే, సమైక్యత సహకారం దెబ్బతింటాయి. ఆలోచింపటం

అనేది పరిశోధనాంశాల ఆధారంగా సాగాలి. సరైన ఆలోచన నిర్ణయం వ్యక్తులకు లేకున్నా, ప్రభుత్వాలకు లేకున్నా, కాలం శ్రమ వ్యర్థమవు తుంటాయి. ఎందుకిలా జరుగుతోంది అనేది దానికి, దైవ నిర్ణయం అని అనుకోకుండా, ఆలోచనల నిర్ణయాలయొక్క ప్రభావం అని తెల్సుకోవాలి.

14) ఎందుకిలా జరుగుతోంది అనేది పరిశోధనాంశం. సామాన్య ఆలో చనకు అందదు. విషయాన్నిబట్టి, సంఘటనబట్టి, అందుకు చెందిన విషయ పరిజ్ఞానం ఉన్నప్పుడే, ఏది ఎందుకలా జరుగుతున్నదో తెలుస్తుంది. ఇది లేనప్పుడు గ్రహగతులు క్షుద్రశక్తులు వంటి కారణాలను నమ్మే వారుం టారు.

15) తమతోటి వారిచే మోసగింపబడ్డా, తమ తోటి వారి వల్లనే తమకు అన్యాయం జరుగుతున్నా, ఇతరులవల్ల కష్టాలు కల్గుతున్నాయని స్పష్టపడు తున్నా, అనర్హతగల ప్రభుత్వాలవల్ల కష్టాలు సంభవిస్తున్నా; ఏవి ఎలా జరగాల్సిఉన్నాయో, అవలా జరుగుతున్నాయన్న భ్రమ ఉంటోంది. దీనిచే తమను కష్టాల పాల్జేసే వాటిని నిర్మూలించాలనేడి, ప్రతీకారం పట్టుదల లేకుంది. అపకారం చేస్తున్నవారిని, దుఃఖింపచేస్తున్న వాటినిసహిస్తున్నారు.

16) కర్మ లేదా గ్రహగతులు లేదా దైవనిర్ణయంవలనో కష్టాలు వ్యధలు కల్గుతుంటే, వాటినుండి మనిషి తప్పించుకోలేడు. ఎంతకాలం వాటిని అను భవించాలో, అంతవరకు వాటినుండి విముక్తికలిగే వీలు ఉండదు. అలాగ ఉంటోందా? ఒకరికి ఉండెడి శక్తి సామర్థ్యాలనుబట్టి; కొందరు అధిగ మించటం, మరికొందరు అధిగమించ లేకపోవటం వుంటోంది. అంటే బాధలు కష్టాలు అధిగమించగలవి, కాకపోతే అధిగమించగల సాధనా సంపత్తిలేక, వాటిని అనుభవించవలసివస్తోంది. ఎందరో కొందరికి మంచి,

16)

ఎందరో కొందరికి చెడు, నిత్యమూ జరుగుతుండటంవల్ల; సౌకర్యము అసౌకర్యము లాభము నష్టము సంతోషము దుఃఖమువంటివి ఏర్పడటంతో ఇవి. కర్మ లేదా దుష్టశక్తుల ప్రభావంవల్ల అనెడి భ్రమను కల్గించవచ్చు.

17) న్యాయానికి అడ్డంకిగా, ధర్మానికి అడ్డంకిగా, బాధ్యతాయుత ప్రవర్తనకు అడ్డంకిగా, సహకారానికి అడ్డంకిగా, మానవత్వపు దిశకు అడ్డంకిగా-దైవము అవరోధంగా ఉంటున్నారా? పరిశీలన పరిశోధనాంశాల ప్రకారంగా సామాజిక నియంత్రణ జరగకుండా, గ్రహాలు దుష్టశక్తులు కర్మలు అడ్డుకుంటున్నాయా ?

18) సత్ఫలితాలను సమకూర్చాల్సిన ప్రభుత్వాలు దుష్ఫలితాలను ప్రాప్తింప జేస్తున్నాయన్న, యథార్థాన్ని ప్రజలు గుర్తింపకుండా ఉండేందుకు. మతాల ప్రభావం ప్రజలపై ఉండేట్లు ప్రభుత్వాలు ప్రయత్నిస్తుంటాయి. అంతా దైవనిర్ణయం అనుకుంటే, ఏదెలా జరగాల్సి ఉందో, అదలా జరుగుతోంది అని అనుకుంటే, ఎవరు చేయకల్గింది ఏముంటుందని మౌనంగా భరిస్తుంటారు.

# 1. దైవ పరిపాలన

1) మనకు ఉండవలసిన అధికారము నియంత్రణ ప్రభుత్వాల అధీనంలో ఉండటంచే, మనం అశక్తులం అయ్యాము. ఈ అశక్తతవల్ల అవరోధాలను అధిగమించ లేకుండటంచే, భవిష్యత్తు మన అధీనంలో లేదని పిస్తోంది.

2) మనం మన భవిష్యత్తును రూపొందించుకో నివ్వకుండా. ప్రభుత్వాలే అడ్డుకుంటున్నాయి. పరిపాలన పేర అధికారాన్ని కైవసం చేసుకొని. బాని సల్ని చేశారు. ప్రభుత్వం యజమాని. మనం బానిసలం. యజమానుల ఇష్టా ఇష్టాలనుబట్టి బానిసల బ్రతుకులు గడవటంవల్ల, మన బ్రతుకులను సరిదిద్దుకునే శక్తిసామర్థ్యాలు లేకుండా పోయాయి.

3) అన్నీ మనకు ఉన్నా వాటి సద్వినియోగం తెలియక. ఏమీలేనివారిలా అశక్తులులా గడుపుతున్నాం. మనదేశంపై మన సంపదలపై మన ప్రభుత్వంపై సంపూర్ణాధికారాన్ని మనం స్వీకరించాలి. మనకున్న హక్కులను బాధ్యతలను స్వీకరించాలి.

4) సమస్త విషయాలలోను పరిశోధనాంశాల ప్రకారంగా పాలనను నిర్వహించుకున్నప్పుడు, సమస్యా రాహిత్య జీవనం ప్రాప్తిస్తుంది. సమస్యా రాహిత్య జీవనంకొరకు పద్ధతులు విధానాలు ప్రవేశపెట్టుకోనీయకుండా, పాత పద్ధతులు పాతవ్యవస్థలను కొనసాగించేది ప్రభుత్వాలవల్ల భవిష్యత్తు మన అధీనంలో లేకుంది.

5) మనం అనుకున్నట్లుగా మన సమాజాన్ని జీవితాన్ని రూపొందించు కోవాలంటే, అందుకు తగిన పద్ధతులను ఆచరించాలి, అందుకు తగిన విధా నాలను ప్రవేశపెట్టుకోవాలి. ఇదంతా వదలివేయటంచే, జీవితం మన అధీ నంలో లేకుండా పోయింది.

6) ఈ ప్రపంచంలో ఏ మనిషికైనా కావలసింది ఏమిటో తెలిసి కూడా, పరిమిత దృష్టికి బదులు అపరిమిత ఆకాంక్షలకు లోనవటంచేనే. దుఃఖం కల్గుతోంది. మనకున్న కోరికలు అలవాట్లు పద్ధతులే, మనకు కష్టాలను కొని తెస్తున్నాయన్న యథార్థాన్ని వదలితే, నిజం మరుగున పడిపోవటం లేదా ?

7) తల్లిదండ్రులైనా, అత్తమామలే అయినా, భార్యా భర్తలే అయినా, యజమానులే అయినా, ఉద్యోగులే అయినా, ప్రభుత్వాలే అయినా, వీరు తమకున్న అధికారాలను హక్కులను దుర్వినియోగం చేయబట్టే, బ్రతుకు బాటలో ఆవేదన రగులుతోంది.

8) సనాతన ఆచారాలు సంప్రదాయాలు నమ్మకవిశ్వాసాలు వంటివి పాత పద్ధతులకే బందీలను చేస్తున్నాయి. పరిశోధనాంశాలను ప్రవేశపెట్టుకోనీయ కుండా అడ్డుకుంటున్నాయి. ఇలా నిరోధించటంవల్ల, మనఅధీనంలో ఉండా ల్సిన భవిష్యత్తు లేకుండోంది.

9) వ్యక్తిలోనే దోషముంది. తానేర్పరచుకున్న మనస్సుచే తానితరులకు హాని చేస్తున్నాడు. తనకు హాని చేసుకుంటున్నాడు. తమని తాము సంస్క రించుకోరు. సమాజాన్ని సంస్కరించుకోరు. వ్యక్తి ప్రవర్తన సరిగా లేదు. ప్రవర్తననే నేర్చుకోకున్నారు.

10) కష్టాలు నష్టాలవల్ల దుఃఖము వేదన కన్నీరు కల్గుతాయి. ఇలాంటి దుఃఖాలను దేవుడు కల్గించడు. మనుష్యులు తమ తప్పులను లోపాలను గ్రహించి సరిదిద్దుకుంటానికి బదులు సమర్థించుకుంటున్నారు. దీనివల్ల

భవిష్యత్తు అధీనమవకుండాఉంది. మన భవిష్యత్తును మనం రూపొందించుకునేట్లు, దేవుడు మన అధీనం చేస్తారుగాని, తన అధీనంలో ఉంచుకుంటూ కష్టాల పాల్జేయరు.

11) దేశదేశాలను పరిపాలించేటి పాలకులవల్ల పరిపాలనా విధానాలవల్ల, మనుష్యులు నిరాశా నిస్పృహలలోకి నెట్టివేయబడటమేగాక, తమకు కలిగే కష్టనష్టాలను అధిగమించలేని వారవుతున్నారు. తమని అశక్తులుగా ఉంచేస్తున్న పరిపాలనను అర్థం చేసుకోక, ఈ అశక్తతకు కారణం దైవము మరియు తదితర వాటి ప్రభావమే మోనని భావిస్తున్నారు. అనుకూలంగా ఉండాల్సిన పరిస్థితులు అననుకూలం అవుతున్నాయి. సాధారణ పనులకు ఎంతో హైరానా పడవలసి ఉంటోంది. తాము అనుకున్న విధంగా కార్యాచరణకు ఉపక్రమించలేని పరిస్థితులవల్ల, సంతోషభరితమైన జీవనం వీలవటంలేదు.

12) తమను సమాజాన్ని సక్రమంగా ఉన్నతంగా తీర్చిదిద్దుకునేటి శక్తి ఉన్నా, అట్టి కార్యాచరణకు ప్రభుత్వాలు అడ్డుగోడగా ఉండటంచే, పరిస్థితులను చక్కదిద్దుకోవటం అసాధ్యమై వేటి ప్రభావమోనని సరిపెట్టుకోవటం లేదా నమ్మటం చేస్తున్నాం. పరిస్థితులు అదుపు తప్పుతున్నప్పుడు సరిదిద్దే అవకాశాన్ని, ప్రభుత్వం తన గుప్పిటలో ఉంచుకొనటంచే, పరిస్థితులను సరిదిద్దేటి శక్తిసామర్థ్యాలు ప్రజలకు ఉన్నా నిరుపయోగం అవుతున్నాయి.

13) అధికార ధారావత్తంవల్ల మనందరి స్థితిగతులకు కారణం ప్రభుత్వాలే అయ్యాయి. అయినా దీనిని తెలియనీయకుండా, దేవుడు జీవుడనేటి భ్రమలోకినెట్టి ఉంచుతున్నాయి. ఆకలి మంటలు — దుఃఖం-మానసిక శారీరక బలహీనతలు-రోగాలు-అనారోగ్యం-అకాల మరణాలు - ప్రమాదాలు-సంఘర్షణలు-కుటుంబంలో అశాంతి-వృత్తులలో నష్టాలు-ఇలా ఎన్నో కష్టా

లకు ముఖ్యకారణం ప్రభుత్వాలు అన్న యథార్థాన్ని తెల్సుకుంటే, విప్లవ దృక్పథంతో ఆ ప్రభుత్వాలను గద్దె దింపుతారు. అధికారంకోసం తిరిగి ప్రయత్నించలేని విధంగా అణచివేస్తారు. ఈ పరిస్థితి రాకుండా తమని తాము ఎలాంటి చర్యలతోనైనా కాపాడుకుంటున్నారు. అశాంతినో లేక శాంతినో, సౌఖ్యాన్నో లేక వేదననో కల్గిస్తున్నవి ప్రభుత్వాలే. మనకు జరిగేవి మంచి లేదా చెడును ప్రభుత్వం తన గుప్పిట్లో ఉంచు కొంది.

14) అధికారాన్ని నియంత్రణను మన గుప్పిట్లోకి తెచ్చుకుంటే, అప్పుడు దేవుడు ఈ సామ్రాజ్యాలకు ఈ జీవితాలకు కర్తల్ని మనల్నే చేసి, మనకు మార్గదర్శకత్వం వహిస్తారు. మానవుల మేధాశక్తినే సాధ నంగా వాడుకుంటూ, మనందరికి సముచిత మార్గాన్ని చూపుతుంటారు. దేవుని యొక్క స్ఫురణ ద్వారా లభించే విధానాలను, మనం ప్రవేశ పెట్టుకోగల్గటానికి ఎలాంటి అడ్డంకి లేనందుచే, అది దేవుని పరిపాలన అవుతుంది.

15) అజ్ఞానం అవివేకంవల్ల పరిపాలనను దుష్టశక్తుల పాల్జేశాము. ప్రభు త్వాలు అధికార దాహానికి, కాంక్షిస క్తులకు, స్వార్థప్రయోజనాలకు లోనయి నట్టివి. ఇవి తమ స్వార్థపూరిత విధానాలద్వారా, సాంప్రదాయిక పద్ధతుల ద్వారా, పరిపాలనను సాగిస్తుండటంచే. పరిశోధనాంశాలు అణగద్రొక్క వేయబడుతున్నాయి. అంటే దేవుని పరిపాలనకు పూర్తి అవరోధంగా నేటి ప్రభుత్వాలు ఉన్నట్లు.

16) ధర్మాన్ని నెలకొల్పమని దేవుణ్ని వేడుకుంటున్నాం. ఇది మన వల్ల సాధ్యపడటంలేదు కాబట్టి, దేవుని సహాయాన్ని అర్థిస్తున్నాం. దైవము దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయవలెనని, ద్రోహులను దుర్మార్గులను సంహరింప వలెనని, పాపులను శిక్షిస్తూ న్యాయాన్ని నెలకొల్పమనేదిది మన కోరిక.

వందలకోట్ల ప్రజలకు రక్షణను న్యాయాన్ని సమకూర్చటం ఎలా సాధ్యం? ఒకవేళ సాధ్యపడినా ఇలా అదెంతకాలం కొనసాగాలి? శిక్షలు పొందిన వారు తిరిగి నేరాలు చేయరనే దేముంది? కొత్తగా నేరాలు చేసేవారుండరనే దేముంది?

17) నేరాలకు ద్రోహబుద్ధికి స్వార్థానికి అరాచకానికి తావు లేనట్టి సమాజాన్ని రూపొందిస్తే, చెడు చేసేందుకు ఒకరిని మరొకరు వంచన చేసేందుకు వీలుండదుకదా! అట్టి సమాజాన్ని స్థాపించి అందరికి ఆనందమైన జీవితాన్ని కానుకగా లభ్యపరచటం మన ప్రభువు లక్ష్యమవుతుంది మనం ఏర్పరచుకున్న వివిధ వ్యవస్థల తీరు తెన్నులబట్టే, మన జీవితాలు జరుగుతున్నాయి. మనుష్యులకు జీవితాన్ని నిర్ణయిస్తున్నది ఒక దేశంయొక్క పరిపాలన. ఈ ప్రపంచానికి మార్గాన్ని జ్ఞానాన్ని బోధించటంవరకే దేవుని బాధ్యత. దైవము అందించేడి సందేశాలను పాటించటమో పాటించక పోవటమో మనవంతు.

18) బ్రతకటమే భారమైపోయిన ఈ పరిస్థితులు మారాలి. అశాంతి ఆందోళనలు లేని బ్రతుకుబాట కావాలి. అందరూ ఆనందంగా హాయిగా బ్రతికేకాలం తరలి రావాలి. వేటిచేత ఎవరిచేత బాధింపబడని జీవితం కావాలి. అట్టి జీవితం కావాలనేడిది అందరికోరిక, అందరికోరిక తీరాలంటే దైవపరిపాలన ఏర్పడాలి. దైవం పరిపాలించేందుకు ఈ సమాజాన్ని దైవాధీనం చేయాలి. ప్రస్తుత ప్రభుత్వాలు వాటిపాలనా శాస్త్రంతోబాటు, మతాలు మతపద్ధతులను తిరస్కరించి, దైవాభీష్టంగా పరిపాలనను సాగించుకోవాలి.

19) కష్టనష్టాలతో అగమ్య గోచరమైన స్థితిలోగాని, మనకు కనువిప్పు కలగకుండా ఉంది లేకుంటే ఈనాటివరకు దైవపరిపాలన లేకుండా ఉండే వారంకాదు నేడైనా కనువిప్పు కల్గితే శాంతి సౌఖ్యాలకు లోటుండదు. మన ప్రభువుచే పాలింపబడాలనేది, అంతరంగంలో కదలాడే కోరికే అయినా, అజ్ఞానం పాలిటబడి ఈ ప్రపంచాన్ని దేశదేశాల నాయకుల చేతుల్లో

ఉంచాము. ఈనాడైనా వివేకోదయంతో దైవపాలన కొరకు ఆత్రుత చెందుదాం.

20) దేశదేశాలను పరిపాలించాలనెడి కోరిక దేవునికి ఉండదు. అందువల్ల దైవము మనలచే పరిపాలింపజేస్తాడు. మనమే పాలకులము మరియు పాలితులము. దైవస్ఫురణ ద్వారా దేవుని ఉద్దేశాలను గ్రహిస్తూ, దైవాభీష్టంతో కూడిన పద్ధతులు విధానాలతో పరిపాలించుకోవటమే దైవపరిపాలన. యజమాని ఫ్యాక్టరీవద్ద లేకున్నా, ఫ్యాక్టరీ పనిచేస్తుంది. రైతు పొలంవద్ద లేకున్నా, పొలంలో పనులు జరుగుతుంటాయి అలాగే దైవము మానవ అవతారం ఎత్తకున్నా, దైవ పరిపాలన సాధ్యము. దైవ సామ్రాజ్యం పేర, ఈ ప్రపంచాన్ని పరిపాలించుకోవలసినది మనమే.

# 2. పద్ధతులు - విధానాలు

1) పరిశీలన పరిశోధనయొక్క ప్రాముఖ్యత విజ్ఞానానికే పరిమితంకాదు. నిత్య జీవితంలో అన్నింటికి వినియోగించుకున్నప్పుడే, సరైన పద్ధతులు రూపొందగలవు. సరైన దృక్పథంతో కూడిన అనుసరణవల్ల కీడు సంభవించదు? 2 సాధారణ విషయాల గురించి ఎలా ఉన్నా, నిర్వహణకు సంబంధించిన విషయాలన్నింటిపై, పద్ధతులను రూపొందించాల్సిన వారు పరిశోధకులు కాని అసమర్థులు కాదు. 3 ఏవి సరైన పద్ధతులు అనేవి నిర్వహించాలంటే, మానవాళికి కొంత కాలానుభవం అవగతమై అవ్వాలి. ఇలాంటి అనుభవాలు మన ముందు ఉన్నాయి.

2) ఒక విషయానికి సంబంధించి సరైన పద్ధతి ఏదో ఒక్కటిగాని, లేదా కొద్దిగాగాని ఉండవచ్చు. ఇదే విషయానికి అపసవ్యమైన పద్ధతులు వందలు కొద్దీ ఉంటాయి. ఇలాంటి సరికాని పద్ధతులవల్లనే, అభిప్రాయాలలో అలవాట్లలో చేతలలో వైరుధ్యం వుంటోంది. పాలనాపరంగాను ఇదే వైవిధ్యం వుంటోంది. కాబట్టి భద్రతాయుతమైన జీవనాన్ని కోల్పోవటం జరుగుతున్నది.

3) మనం అనుసరించెడి పద్ధతులలో సారూప్యత లేనప్పుడు సత్సంబంధాలు ఏర్పడవు. సహకారం నశిస్తుంది. తాము వహించాల్సిన

బాధ్యతలపై దృష్టి ఉండదు. వ్యక్తి లేదా ప్రజలు లేదా ప్రభుత్వం అవలంభిస్తున్న పద్ధతులు సరైనవి కాకుంటే, చెడు ఫలితాలే కల్గు తుంటాయి. నేటి సమాజంలోని అన్ని విధాలైన సమస్యలకు లోపభూయిష్ట మైన పద్ధతులు విధానాలే కారణం.

4) పద్ధతులన్ని సరైనవి అవుతుంటే, పరిస్థితులు అదుపు తప్పవు. అదుపు తప్పిన పరిస్థితులవల్ల వ్యక్తులందరిని సమస్యలు వేధిస్తాయి. ఈ వేధింపుకు కారణం సరైన పద్ధతుల అమలు లేకపోవటమే. తాము అవలంభించెడి పద్ధతులనుబట్టి, పరిస్థితులు అదుపు తప్పటమో, అధీనంలో వుండటమో జరుగుతుంది. ఒకని మనస్సు ఒకని అధీనంలో ఉండాలన్నా, ప్రజల మనస్తత్వం ఉన్నతత్వం అధీనంలో వుండాలన్నా, సరైన పద్ధతు లకు ఎంతో ప్రాముఖ్యత వుంది. జీవితం క్లిష్టమయ్యేదికొద్దీ, వీటి ప్రాముఖ్యత మరింత ఎక్కువ.

5) ఏదయినా ఒక పద్ధతి పరిశోధనాంశమైనప్పుడు అది సరైన దవు తుంది. విజ్ఞానాన్నిబట్టి పరిశోధనాంశము సరైనదవుతుంది. పరిశోధనాంశం కాని పద్ధతులు విధానాలు వదలి వేయాల్సినవి. మనం రూపొందించుకొని అమలు పరచుకునేడి పద్ధతులు విధానాలే, నీతిని ధర్మాన్ని కర్తవ్యాన్ని బాధ్యతలను నిర్వర్తింప జేస్తాయి. మనల్ని నడిపించేవి ఇవే. మన నడవడిక సరిగా లేదంటే, మనం అనుసరించెడి పద్ధతులు సరైనవి కానట్లు రుజువు. మంచీ చెడుల ప్రభావాలకు కారణం, మానవులు అనుసరించే పద్ధతుల ఆచరణలే.

6) ఒక పద్ధతితో విధానంలో లోపాలు వున్నప్పుడు కష్టాలకు నష్టాలకు అవినీతికి అసమర్థతకు మార్గముంటుంది. స్వార్థ ప్రయోజనాలకు అను కూలమైన అవకాశాలను లేకుండాచేసే, నష్టాలు రాకుండాచేసే, సరైన పద్ధతులు ఏవో వాటిని ప్రవేశ పెట్టుకుంటే కష్టాలు వుండవు. సరైన

పద్ధతులను రూపొందించి అమలు పరచేందుకు, మన శక్తి సామర్థ్యాలను వుపయోగించాలి.

7) ఎవరు ఎక్కడ ఏ పని చేస్తున్నా, ఏ పద్ధతిని అవలంబిస్తున్నా, అవన్ని కాలము శ్రమయొక్క సద్వినియోగమే కాకుండా, విలువల ప్రాతిపదికకు మానవత్వపు దిశకు భంగకరంకాని విధంగా వుండాలి.

8) ఫలానా పద్ధతి ఫలానా విధానం అనేవి, అన్నింటికి వర్తిస్తాయి. ఒక పద్ధతిని విధానాన్ని మార్చుకోవటం అనేది ఎన్నింటిలోనో జరుగుతోంది. అలా కాకుంటే విప్లవాత్మకమైన పురోభివృద్ధి వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో సాధ్యపడేదికాదు.

9) ఒక పద్ధతి లేదా విధానంవల్ల, ఎలాంటి ఫలితాలు వుంటున్నాయో గుర్తించి, తదనుగుణమైన మార్పునుప్రవేశపెట్టుకోసందువల్ల, దురాదృష్టం వెన్నాడుతోంది. మనం అవలంభిస్తున్న విధానాలు సరైనవి కాకుంటే, దుష్ఫలితాలను ఇచ్చే పరిస్థితులు నెలకొని వుంటాయి. అలాంటి పరిస్థితులు మారాలంటే, ప్రస్తుతం అనుసరిస్తున్న పద్ధతులు మారాలి.

16) ఒక వ్యవస్థలో దోషాలు లేకుంటే కష్టాలులేవు. ఒక వ్యవస్థలోని తప్పులను కనుగొనుట ఖండించుటవల్లనే దోషాలు తెలుస్తాయి. ఒక వ్యవస్థలోని పద్ధతులు విధానాలు లోపభూయిష్టమైనవైతే, వాటిస్థానే సరైన వాటిని అవలంభించాలి. దీనిచే మార్పు వస్తుంది, లేదా నూతన వ్యవస్థ ఏర్పడుతుంది.

11) వివిధ రంగాలలో నిత్యానుభవంతో కూడిన పరిశోధకు లెందరో ఉండటంవల్ల, సరైన పద్ధతులేవో స్పష్టపరచ బడుతున్నాయి. సరైన పద్ధతులేవో తెలిసినా, వీటిని ప్రవేశపెట్టుకుంటానికి అసమర్థులు అవినీతి పరులు అవరోధంగా ఉన్నారు. దీనికితోడు అధిక సంఖ్యాకులలోని అవిద్య అవివేకం అనవగాహనవల్ల, సరైన పద్ధతుల అమలు సాధ్యపడకుండా

వుంది. పరిశీలన పరిశోధనయొక్క నిర్లక్ష్యంవల్ల, మార్పులేకుండా కొనసాగింప బడుతున్నాయి.

12) ఎవరు ఏ యే వాటిని నిర్వహిస్తున్నారో, ఆ యా నిర్వహణలలో పద్ధతులను విధానాలను మార్చకలిగే శక్తి లేకపోవటంవల్ల, స్వార్థ ప్రయోజనపరులు అవ్వటంవల్ల (3) పరిస్థితులు అదుపు తప్పటంవల్ల, సరైన విధానాల అమలు లేకుండా ఉంటోంది.

13) తమని తాము అదుపులో ఉంచుకునేట్లుగా పరిస్థితులు వుండాలి. తమని అదుపులో ఉంచకలిగే పద్ధతులు వుండాలి. మనం అనుసరించేవి పద్ధతులే, మనకో విధమైన పరిస్థితులను ఏర్పరుస్తాయి. పరిస్థితుల ప్రభావం నడవడికపై వుంటుంది. పరిస్థితులను ఎదుర్కొలేక పోవటము, బానిసలవటము ఉంటుంది. కాబట్టి మనుష్యులను నిస్సహాయులుగా నిష్ప్రయోజకులుగాచేసే, అజ్ఞానాంధకారంలో పడవేసే పరిస్థితులను సహించకూడదు. అంటే ఇలాంటి పరిస్థితులకు కారణమయ్యేవి పద్ధతులను చీల్చి చెండాడాలి.

14) తప్పుడు విధానాలవల్ల నిగ్రహం నిరోధం సాధ్యపడక, మనుష్యులు బలై పోతుంటారు. వ్యక్తులు అధికమించలేని పరిస్థితులను, వ్యక్తులకు సాధ్యపడని నిగ్రహం నిరోధాన్ని, సరైన విధానాలు సాధ్యపరుస్తాయి.

15) మనకుండే అత్యాశ కోరికలు స్వార్థముబట్టి, వాటికి అనుకూలమైన పద్ధతులను అంగీకరిస్తున్నాం. ఇలా అంగీకరించబట్టి, న్యాయ దృక్పథంతో కూడిన పద్ధతులకోసం ఆత్రుత లేకపోవటం జరుగుతున్నది. వ్యక్తుల కోరికలు అన్నీ, వ్యక్తిపరంగా రూపొందినవి అవటంచే స్వార్థ దృష్టి వుంది. ఇలాంటి స్వార్థానికి అనువైన పద్ధతులే నేటి సమాజంలో ఉంటున్నాయి. దానిచే సమిష్టి ప్రయోజనాలకోసం, అనువైన విధానాలపై ఆసక్తి లేకుంది.

16) మనం పొరపాట్లు చేస్తున్నాం. తప్పులని తెలిసినా పట్టించుకోకున్నాం. తప్పుడు పద్ధతులను విధానాలను నిలుపుకుంటున్నాం. కాబట్టే మానవాళి కష్టాల పాలవుతోంది. ఇదంతా స్వయంకృతాపరాధం.

17) పాలకులు యజమానులు తల్లి దండ్రులు ఇలా అధికారమున్న ప్రతివారు నియంతలయ్యారు. తమ పరిధిలోని వారిని గ్రుడ్డిగా అనుసరింపజేయింటారు. ఇదే కష్టాలకు కారణం. ఆధార రహితమైన సంప్రదాయాల నమ్మకాల భయాల ప్రభావం పాత పద్ధతులను విడనాడనీయకుండా చేస్తోంది. మత పద్ధతులను కొన్నింటిని ప్రక్కకు నెట్టివేసినా. ఇంకా కొన్నింటికి స్థానం ఇవ్వటంవల్ల దుష్ఫలితాలు ఉంటున్నాయి. ఒక పద్ధతిని ప్రవేశపెట్టిన తదుపరి ఆచరణలో, అదెలాంటి ఫలితాన్ని కల్గిస్తున్నదో, దాని ఆధారంగా మార్పులు చేర్పులు చేసుకుంటే సరైన పద్ధతులే నేడుండేయి.

18) సరైన పద్ధతులను అనుసరిస్తే ఎవరిమధ్య వేటిమధ్య, ఎలాంటి సంఘర్షణకు తావుండదు. ప్రతి ఒక్కరు ఇలా అనుసరించేందుకు అవసరమైన శిక్షణను, తమకు తాము గరపుకోవాలి. ప్రతి పని చేసేముందు, అది సరైన పద్ధతి అవునో కాదో, పరిశీలించుకోవాలి. వ్యక్తిగత పనులని అనుకునేవి కూడా, వ్యక్తికే పరిమితమై లేకున్నవి. కాబట్టి ఈ సరైనట్టిది ఎంతో ప్రాముఖ్యతగల విషయం.

# 3. పరిస్థితులు

1) సమస్యలు ఉండటము లేకపోవటమునిబట్టి, వ్యతిరేక లేదా అనుకూల పరిస్థితులు, ప్రజలకు ఏర్పడుతున్నాయి. నిరుద్యోగానికి అధిక ధరలకు పేదరికానికి వ్యసనాలకు ఇలా సమస్యలకు కారణాలు ఏమిటో, పరిష్కారాలు ఏమిటో ననేది ఊహిస్తే అర్థమయ్యేవికావు. ఒక వ్యాధి ఎందుకు వచ్చిందో, ఎలా నివారింపబడుతుందో ననేది సైతం కథలా అర్థమయ్యేది కాదు సమస్యలు వాటి పరిష్కారాల అవగాహన మన ముందు ఉంచినా, కాల్పనిక సాహిత్యంవలె అర్థమయ్యేవికావు. క్లిష్టతగల విషయాలపై శ్రద్ధ వహించనందుచే, సమస్యలకు కారణాలు తెలియక నిజం మరుగున పడిపోతున్నది.

) తల్లిదండ్రులు బిడ్డలకు ఎంతమంచిగా చెపుతున్నా మారరు. అదే అధికారంతో ఆజ్ఞాపిస్తే అలాగే నడచుకుంటారు. ఒక వ్యక్తి విషయంలోనే ఇలా ఉంటే, మొత్తం ప్రజల విషయం ఎలా ఉండగలదో ఊహించండి. అందుకే శాసిస్తారు. ఈ శాసనాలకు లోబడి జీవించటమే జీవితం. జీవితంలో కొందరికి వ్యతిరేక పరిస్థితులు, అనుకూల పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఇదంతా ప్రభుత్వాలు వ్యక్తులు అనుసరిస్తున్న పద్ధతులవల్లనే ఇటువంటి స్థితి సంభవిస్తోంది. ప్రభుత్వాలు ప్రజలు ఇద్దరూ, మానవులంతా ఒక్కటేనన్న న్యాయదృక్పథంతోగాని, పరిశోధనాంశాలతోగాని

వ్యవహరించటంలేదు. సరియైన దృక్పథాన్ని వదలివేయటంచే, వ్యతిరేక పరిస్థితులను మానవాళి ఎదుర్కొంటోంది.

3) నీతి-నిగ్రహం-నిరాడంబరత-మెౌదుపు - ఉన్నతతత్వం - పరస్పరాభిమానం-పరస్పర సహకారం-సామరస్యం-త్యాగం - సత్ప్రవర్తన - సత్పరిపాలన-ప్రతిభ-సామర్థ్యం - పరిశోధన, వంటివికే స్థానమిస్తే, ఇందుకు సంబంధించిన పరిస్థితులే ఉంటాయి. అధర్మం-ద్రోహబుద్ధి- కాంక్షాసక్తులు-వంచన-అసమర్థత-పరస్పర అవిశ్వాసం - పగ - ద్వేషం- సంఘర్షణలు-దుష్ప్రవర్తన, వంటివి పెంచుకుంటే ఇందుకు తగిన పరిస్థితులే ఉంటాయి. ఏ పరిస్థితులు నెలకొని ఉంటున్నవో, ఆ పరిస్థితు లాధారంగా మనకు శాంతియో అశాంతియో లభిస్తోంది.

4) పరిస్థితులను అదుపులోకి తేవాలన్నా, తగనట్టి పరిస్థితులను తొలగించాలన్నా, ఇదంతా ప్రజలందరి సహకారంపై ఆధారపడిఉంది తాము అనుసరించెడి వాటికి, తాము అభిలషించెడి వాటికి అధీనమై పోతుంటాయి. దీనిచే సరైన త్రోవవేపు మరల్చటం కష్టం. ఒక వ్యక్తే తన అభిప్రాయాలను మార్చుకొలే కుంటాడు. అలాంటప్పుడు దేశప్రజలలో మార్పు తేవాలంటే మాటలా? అందుకే సరైన ప్రభుత్వాన్ని సైతం ఎన్నుకోవాలన్నా అసాధ్యమై పోతోంది.

5) ప్రకృతి పరంగా సంభవించెడి పరిస్థితులు వేరు. శాస్త్ర సాంకేతిక సహకారంతో అవి పరిష్కరింప బడుతున్నాయి. సహజ సిద్ధంగా ఏర్పడి ఉన్న అనుకూల పరిస్థితులను భగ్నం చేసుకోకుండా కాపాడుకోవాలి అనుకూల పరిస్థితిలేకున్నా, ఆ పరిస్థితిని సానుకూలం చేసుకునెడి కృషిఉండాలి. మనం సృష్టించుకున్న పరిస్థితులువేరు. మనం సృష్టించుకున్న పరిస్థితులు మారాలంటే, మనం మార్చుకోనిదే అవి మారవు. వ్యతిరేక పరిస్థితులను భరించలేకున్నా తొలగింపలేక భరిస్తూ, కాలప్రభావంకోసం దైవసహాయం కోసం వేచి చూస్తుంటారు.

6) మనం సరిదిద్దలేని పరిస్థితులున్నాయి. మనం ఎదుర్కోలేని పరిస్థితులు ఉన్నాయి. దుష్ఫలితాలను దుష్ప్రభావాలను కల్గించెడి పరిస్థితులు ఉన్నాయి. ఒక్కరే వీటికి కారణంకాదు. కొంత శాతం ప్రజలవల్ల ఇవి కల్గుతున్నాయి. కొంత శాతం ప్రజలను నియంత్రిస్తే కాని ఇవి తొలగవు. ఈ నియంత్రణను చేయకలిగే అధికారమున్న ప్రభుత్వం చేయకుంటే, ఇట్టి పరిస్థితులు అలాగే కొనసాగుతుంటాయి.

7) దేశంలో ఎక్కడ ఎలాంటి పరిస్థితి నెలకొంటున్నా, అందుకు కారణం పరిపాలన. అందుకు కారణం మనం. పాలకులు అనుసరిస్తున్న పాలనా విధానాలవల్లనే, అందుకనుగుణమైన అనుసరణలు మనకు ఉంటున్నాయి. ఇందుంచే మంచీ చెడు పరిస్థితులు సంభవిస్తున్నాయి. మంచీ చెడులకు సంబంధించిన పరిస్థితులకు కారణం ప్రభుత్వాలు. ప్రభుత్వం ప్రజలు ఎవరైనా, తాము అనుసరించెడు పద్ధతులనుబట్టే, తదనుగుణ పరిస్థితి నెలకొంటుంది. ఆ ఏర్పడిన పరిస్థితులు సరికానివి అయితే, అవే దుష్టశక్తిగా వ్యక్తుల పాల్జేస్తాయి. ఈ పరిస్థితుల ప్రభావాలే, వర్తమానాన్ని భవిష్యత్తును ఏర్పరుస్తున్నాయి. ఇవి గుర్తింపక జరుగుతున్నది జరగబోయేది అంతా దైవనిర్ణయానుసారం అని అనుకోవటంవల్ల, దుష్ట పరిస్థితులను తుదముట్టించెడి ఆగ్రహం మనలో లేకుండా పోతోంది. దీనిచే దుష్టశక్తులు మనపై దాడిచేస్తున్నాయి.

8) మన వశం తప్పినవి - మనల్ని శాసించేవి - మనల్ని మోసగింపజేసేవి-మనల్ని దురలవాట్ల దుర్వ్యసనాల పాల్జేసేవి - అనారోగ్యం పాల్జేసేవి-ప్రమాదాల పాల్జేసేవి-దుఃఖింపజేసేవి-మనపై అధికారంతో ఆధిక్యత వహింపజేసేవి-నిరాశా నిస్పృహాలలోకి నెట్టివేసేవి-మనం సహించలేనివి భరించలేనివి - వర్తమానాన్ని పీడకలగా చేసేవి - భవిష్యత్తును ధ్వంసం చేసేవి, ఇలా ఎన్నెన్నో పరిస్థితులు ఉంటాయి. మనకు అర్థంకానివి, పరి

ష్కరింపకున్నవి, మన అధీనంలోలేని పరిస్థితులు అవుతాయి. సహాయం అందజేసినా నిరోధించినా నడిపించినా ఇదంతా పరిస్థితుల ప్రభావం.

9) వేటివల్ల అసౌకర్యము చికాకు కల్గుతుందో - వేటివల్ల అసహ్యము జుగుప్స కల్గుతుందో-వేటివల్ల భయము ఆందోళన కల్గుతుందో - వేటివల్ల కష్టం నష్టం కల్గుతుందో - వేటివల్ల మనశ్శాంతిని కోల్పోతుంటారో, వాటిని ఎదుర్కొవాలని నిర్మూలించాలని ఉంటుంది. ఎదుర్కొలేక నిర్మూలించలేక, ఆఖరికి ద్వేషించనూ లేక సర్దుబాటవక తప్పని నిస్సహాయత లోకి. నేటి సామాజిక ఆర్థిక రాజకీయ పరిస్థితులు నెట్టివేసి ఉంచుతున్నాయి. మనల్ని వేధించెడి పరిస్థితులను, మట్టుపెట్ట కలిగే పద్ధతులను విధానాలను రూపొందించుకుంటే, ఇవి భయాందోళనలను తరిమివేస్తాయి. మన శత్రువుల పీడను వదిలించేస్తాయి.

10) ఒక పని జరిగేట్లు చూస్తున్నది జరిపిస్తున్నది చేస్తున్నది మనమేనని మనకు తెల్సు. అయినపుడు మనం చేస్తున్న పనులు దేవుడు జరిపించినట్లవదు. అలోచించకుండా ఏదీ మాట్లాడలేం. నిర్ణయించకుండా ఏ పనీ చేయలేము. ఈ ఆలోచించటం అనేది నిర్ణయాలు గైకొనటం అనేది మనమే చేస్తున్నాం. ఈ ఆలోచన నిర్ణయం అనేవి నిరంతరం ప్రతి ఒక్కనిలో జరుగుతుండేవి. నిరంతరం జరగాల్సిఉన్న ఈ ఆలోచన నిర్ణయం అనేవి దేవునివి అనటం సరికాదు. ఆలోచన నిర్ణయం వ్యక్తులది అవుతోంది అంటే, అందుకు అనుగుణంగా సాగెడు పనులన్ని మనుష్యులు చేస్తున్నవి కాని దేవుడుకాదు. అంటే దేవునిపై ఆధారపడటంలేదు. దేవునిపై జీవునిపై ఆధారపడితేకాని, ఆలోచన సాగని పనులు జరగని పరిస్థితి లేదు.

11) మన ఆలోచనలు మన నిర్ణయాలు వేటి ఆధారంగా కొనసాగు

తాయో, వాటినిబట్టి ప్రత్యేకమైన పరిస్థితులు రూపొంది ఉంటాయి. పరిస్థితులనుబట్టి పైతం ఆలోచన నిర్ణయం కొనసాగుతుంది. మన ఆలోచనలకు నిర్ణయాలకు చేతలకు అవకాశమిచ్చేడు పద్ధతులు ఏవో, ఆ పద్ధతులను బట్టి ఆ పరిస్థితి ఏర్పడుతుంది. ఈ ఏర్పడ్డ పరిస్థితులు మంచి చెడు ఫలితాలను కల్గిస్తుంటాయి. సరికాని పరిస్థితులు మారకుంటే చెడు ఫలితాలు, సరైన పరిస్థితులను రూపొందించుకుంటే సత్ఫలితాలు ఉంటాయి. పరిస్థితులను మార్చుకోపటం, జీవితంలో మంచి ఫలితాలను పొందటం మన అధీనము.

12) కాలము శ్రమ మేధాశక్తియొక్క సద్వినియోగం తప్పనిసరి. సద్వినియోగము దుర్వినియోగము పైననే, అనుకూల వ్యతిరేక పరిస్థితులు ఆధారపడి ఉంటాయి. ఏదయినా ఒక పరిస్థితిలో ఉన్నప్పుడు, ఇలాగాకుండా మరోలా ఉంటే, ఎంత బాగుండునని అనుకుంటాము. ఈ మరోలాగ ఉండటాన్ని చేసుకోగలం. ఇదే అనుకూల పరిస్థితి. మన అధీనంలో లేని వాటి గూర్చి చేయకల్గిందిలేదు. మన అధీనంలో ఉన్న వాటిని గూర్చి, ఆలోచిస్తూ పరిష్కారాలను సాధించుకోవాలి.

13) పరిస్థితుల ప్రభావం మనఃస్తత్వంపై ఉంటుంది. సవ్యమైన పరిస్థితులు అంగీకారమైన ప్రభావాన్ని కల్గిస్తాయి. అపసవ్యమైన పరిస్థితులు అనంగీకారమైన ప్రభావాన్ని కల్గిస్తాయి. పరిస్థితుల ప్రభావాల మూలంగానే ప్రవర్తన ఉంటుంది.

14) సరికాని ఆలోచన సరికాని నిర్ణయాలు సరికాని పద్ధతులువల్ల, అదుపు తప్పిన పరిస్థితులు ఏర్పడతాయి. సరైన ఆలోచనను నిర్ణయాన్ని చేయకుంటే, తామేర్పరచిన పరిస్థితులను తామే అదుపు చేయిలేకుంటారు. అదుపు తప్పిన పరిస్థితులన్ని అనర్థాలను కల్గిస్తాయి. ఒకరు వహింప లేనంతగా బాధ్యతలను నిర్వహణలను అధీనపరచినా నియంత్రణ అదుపు తప్పు

తుంది. పరిస్థితులు అధీనంలో ఉండాలన్నా, పరిమిత దృష్టిని విడనాడ కూడదు.

15) పరిస్థితి అదుపు తప్పుతోందంటే, నియంత్రణ లేనట్లు. నియంత్రణ సరైనట్టిది కాకున్నా పరిస్థితి అదుపు తప్పుతుంది. నియంత్రణను ప్రతి ఒక్కరు తమ బాధ్యతగా భావించినపుడు, పరిస్థితులన్నీ సవ్యంగానే ఉంటాయి. నియంత్రణ అధీనంలో ఉంటే, దుష్ఫలితాలను తప్పిస్తారు. లేకుంటే తప్పించలేరు. అందుకే అధీనంలోలేని పరిస్థితులు, రానివ్వ కుండానే శ్రద్ధ వహించాలి

16) భయం ఉట్టినే కల్గుతుందా? ద్వేషం ఉట్టినే ఏర్పడుతుందా? క్రోధా వేశాలు అకారణంగా కల్గుతాయా? ఊరకే ఎవరైనా విలపిస్తారా? ఇందుకు ఏవో కారణాలు ఉన్నాయి. ఎవరో కారకులవుతున్నారు. సంతోషం కల్గుతున్నా నిశ్చింత ఉంటున్నా సామరస్యం ఉంటున్నా, వీటిని లభ్యపర చెడి ప్రవర్తన పరిస్థితులు నెలకొని ఉండటంవల్లనే, అవి లభ్యమవు తున్నాయి.

17) ప్రస్తుత పరిస్థితులన్నీ బాగానే ఉన్నాయి అనుకుంటే, మార్పు కొరకు పోరాడవలసిందిలేదు. అనర్థాలను కల్గించెడు పరిస్థితులు నేడున్నాయి అంటే, వీటిపై నిర్లిప్తత వహించరాదు. నిర్లిప్తతవల్ల దుష్ఫ లితాలను కల్గించెడి పరిస్థితులు మారవు. సర్దుబాటవు తుంటేను మార్పు రాదు. ఏ పనులయందైనా నిర్లక్ష్యమో నిర్లిప్తతో వహిస్తే, ఆ పనులలా నిలచిపోతాయి. మార్పు కూడా అంతే.

18) మనం ఏర్పాటు చేసుకున్న వ్యవస్థలే, సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితులను ఏర్పరుస్తున్నాయి. భవిష్యత్తును ఉన్నతంగా తీర్చిదిద్దుకో వలెనంటె, వివిధరంగాలలోని సరికాని పరిస్థితులను మార్చుకోవాలి. పరి స్థితులు మారటంతో సమస్యలు తొలగుతాయి. పరిస్థితుల ప్రభావాలే

మనపై పని చేస్తుంటాయి. పరిస్థితుల ప్రభావాలే గడిచేకొద్దీ, దుష్టశక్తి గానో మంచి శక్తిగానో మారతాయి. పరిస్థితుల ప్రభావాలకు స్పందించి ఆలోచించి, సరైన మార్పును తెచ్చుకోగలిగే శక్తి, మనకు సమకూరటమే కాలానికిగల శక్తి. కాలానికి ప్రత్యేకించిన ప్రభావంకాని, కాలానికి ప్రత్యేకించిన శక్తిగానిలేదు. పరిస్థితుల ప్రభావాన్నే కాలప్రభావం అని అనుకుంటాం.

...o...

# • అవకాశము

1) అవసరాలు కోరికలు అందరికీ తీరాలి. వీటిని తీర్చుకోవటం కొరకు సంఘర్షణ ఉండరాదు. అంతేగాక న్యాయబద్ధంగా నెరవేరాలి. ఇందు కను గుణమైన నియమ నిబంధనలు లేకుంటే, అందరికీ న్యాయం జరగదు. ఇట్టి న్యాయాన్ని జరిపించగల నియమ నిబంధనలున్నా, వీటిని అమలు పరచెడి శక్తి ప్రభుత్వానికి లేకున్నా అందరికీ న్యాయం జరగదు

2) మనుష్యులకు ఎలాంటి అవసరాలు కోరికలు ఉండాలో, వాటిని తీర్చు కొనుటలో ఎలాంటి నియమ నిబంధనలను పాటించాలో, స్పష్టంచేసి ఖచ్చి తంగా అమలుపరచితే సరైన అవకాశాలతో కూడిన సరైన పరిస్థితులు నెలకొని ఉంటాయి. ఇది లోపించినపుడు సరికాని అవసరాలు కోరికలు పెరుగుతుంటాయి. ఇందుకుతగ్గ చెడ్డ అవకాశాలు సృష్టింపబడతాయి. 2 చెడ్డ అవకాశాలు ఉండబట్టి, చెడ్డ అనుభవాలు అలవడతాయి. మెదడులో నిలచిన ఈ అనుభవాలే, కోరికలై అటువైపుకి లాగుతాయి. సరైన అను భవాలనుంచే కాకుండా. చెడ్డ అనుభవాలనుంచి తృప్తి లభ్యమవుతుంది. చెడ్డ అవకాశాలకు చెడ్డ అనుభవాలకు స్థానంఇస్తే, ఇవి భవిష్యత్తును నాశనం చేస్తాయి.

3) తాము చేయగల పనులుగూర్చి ఆలోచిస్తారు. తాము చేయలేని పనులు గూర్చి ఆలోచింపరు. వేటిల్లోనైనా పాల్గొంటానికి లేదా ఆలోచనలను అటు

వైపు సారించటానికి, భావాలటువైపు పరుగులు తియ్యటానికి కారణం అవకాశము.

4) ఏ విలువలు అయితే జ్ఞానిని నడిపిస్తాయో, అవే విలువలు సామాన్యులను నడిపించలేవు. సామాన్యులు విలువలను అవరోధంగా భావించి అణచివేస్తారు. అందుకే వేటికి స్వేచ్ఛ ఉండాలో, వేటికి స్వేచ్ఛ ఉండరాదో, గుర్తించి విభజించకుంటే, స్వేచ్ఛవల్ల సమకూరిన అవకాశాలచే మొత్తం సమాజాన్ని పతనస్థాయికి కొనిపోతుంటారు. స్వేచ్ఛ అవకాశాలను పెంచుతుంది. స్వేచ్ఛ అవకాశాలను నిరోధిస్తుంది. అవకాశ ధోరణికి అనువైన పనులకోసమే జీవితంకాదు. వృత్తులు వ్యాపారాలు ఇందుకొరకు కాదు. ఉమ్మడి బాధ్యతయే జీవితం.

5) సరికాని పద్ధతులకు, అలవాట్లకు కోరికలకు పనులకు అనుభవాలకు, సమాజంలో అవకాశాలను ఉంచినట్లయితే, ఇవి క్రమను నిరుపయోగం చేస్తుంటాయి. సభ్యతా సంస్కారాలను ధ్వంసం చేస్తాయి వక్రమార్గాన కొనిపోతాయి. కాబట్టి ఇలాంటి వాటికి అవకాశాలను ఉంచకూడదు. అంటే నిషేదింపబడాలి. మంచి పనులకు అవకాశం ఉండాలి. చెడ్డపనులకు అవకాశాన్ని ఉండనివ్వకూడదు. అదే సామాజిక బాధ్యత.

6) అవకాశం కూడా అనుభవమే. అవకాశాలవల్ల అనుభవాలు చేకూరుతుంటాయి. అవకాశం గొప్పది. కాలములో అవకాశము ఇమిడి ఉంది. అవకాశాలను సద్వినియోగం చేసుకోవటంపైన, భవిష్యత్తు ఆధారపడి ఉంది. బాధ్యతా రాహిత్యంలోను, అవివేకం అజ్ఞానంలోను అవకాశాలను వినియోగించు కోలేకుంటారు.

7) అవకాశము ఇవ్వటము ఇవ్వకపోవటంపై, పనులు జరిపించటము జరిపించక పోవటము ఉంటుంది. అవకాశాన్ని ఇవ్వనప్పుడు; మంచిపనులు చేయలేరు, బాధ్యతలను వహించలేరు, కర్తవ్యాన్ని పాటించలేరు, నీతిని

కాపాడలేరు, ద్రోహులను శిక్షించలేరు. 2 చెడ్డ అవకాశం అవినీతి పని జరగటానికి కారణమవుతుంది. ప్రతి ఒక్కరు చెడ్డ అవకాశాలకు స్థానం ఉంచకూడదు. అంటే పరిశీలన పర్యవేక్షణ నియంత్రణ ప్రాధాన్యతగల విషయాలు. వీటిని విస్మరించిననాడు, చెడ్డ అవకాశాలు ఉంటాయి. అవినీతి అసమర్ధతయొక్క దుష్ఫలితాలు ఉంటాయి. కుటుంబంలోనైనా, సమాజంలోనైనా అంతే.

8) పాలకులు తాము పరిపాలించేందుకు అనువైన అవకాశాలను, తమ గుప్పిట్లో ఉంచుకొని, ప్రజలు పరిపాలించుకునేటి అవకాశం లేకుండా చేశారు. ఈ అవకాశం లేనందువల్లనే, తమ సమాజాన్ని ధర్మపథంవైపు మరలించలేని నిస్సహాయులయ్యారు. సరికాని పద్ధతులను సరిదిద్దే అవకాశాన్ని ప్రజలకు లభ్యపరచి ఉంటే, ఆ అవకాశం ద్వారా తమ సమాజంలో సరైన పద్ధతులను ప్రవేశపెట్టుకునేవారు.

9) అవకాశము అంటే అనుకూల పరిస్థితి, ఇది మంచీ చెడు రెంటింటికి కూడా. అవకాశంవల్ల ఏర్పడ్డ అనుకూల పరిస్థితినిబట్టి, వ్యక్తుల ఆలోచన నిర్ణయము చేష్టలు కొనసాగుతుంటాయి. తమకు అవకాశంగా ఉన్న పరిస్థితులలో తప్పొప్పుల ప్రసక్తికన్నా, వివేకం విచక్షణకన్నా, తమ పనులు జరిపించుకోవటానికే ప్రయత్నిస్తుంటారు.

10) సరికాని పనులు జరగకుండా నిరోధింపాలంటే, అవకాశం లేకుండా చేయాలి. లేకుంటే దీనికి సంబంధించిన పరిస్థితులు నెలకొని, మనుష్యులను తమ ప్రభావంలోకి పడవేస్తాయి. అనుకూల పరిస్థితులు వ్యతిరేకపరిస్థితులు కూడా, అవకాశం ఇవ్వటంవల్ల ఏర్పడతాయి. వేటియందు నిగ్రహం నిరోధం ఉండాలనుకుంటామో, వాటికి అవకాశాలు లేకుండా చేయాలి.

11) అధర్మానికి–అసత్యాలకు–కాలం చెల్లిన పద్ధతులకు – బాధ్యతా రాహిత్యానికి–నాసిరకం ఉత్పత్తులకు–కల్తీకి– అక్రమ లాభార్జనకు – మోసాలకు,

అవకాశాలు లేకుంటే, అవి కల్గించెడు దుష్ఫలితాలు లేనట్లు చట్టాలు ఉన్నా భయపడాల్సింది లేకున్నప్పుడు, పెద్ద అవకాశాలు ఏర్పడిఉంటాయి.
12) తప్పు పనులు చేస్తున్నా అడ్డుకోకుంటే, తప్పు పనులకు అవకాశం ఇచ్చినట్లు. 2 అసభ్యతను అంగీకరిస్తుంటే, అసభ్యతకు అవకాశం ఇచ్చినట్లు 3 నేరాలు చేస్తున్నా పట్టుకోలేకుంటే, నేరాలకు అవకాశం ఇచ్చినట్లు. ఒక అవకాశం మరో అవకాశానికి కారణమవుతుంది. అవకాశాలు అవకాశాలను సృష్టిస్తుంటాయి.

13) అవకాశాన్ని ఉంచటము ఉంచకపోవటంతో పరిస్థితులే మారిపోతుంటాయి. ఋతువులు ఆధారంగా పంటల దిగుబడిని సాధించుకోవటం ఒక అవకాశము. అనుకూల పరిస్థితులను గుర్తించనపుడు అవకాశం పోతుంది. ప్రకృతి వనరులను గుర్తించనపుడు, వాటి వినియోగావకాశం నశిస్తుంది. సరియైన ప్రభుత్వ స్థాపనకు ఎన్నికలను మాత్రమే అవకాశంగా నిర్ణయించితే, ఈ అవకాశాన్ని రద్దుచేస్తే అప్పట్లో ఎన్నికలే ఉండవు.

14) ఉన్నత విద్యార్హతలతోబాటు ఇతర అర్హతలు సైతం ఉన్నవారికే, ఎన్నికలలో అభ్యర్థులుగా నిలబడేందుకు అవకాశం ఇస్తే; కుట్రలు కుతంత్రాలతో, అంగబలం అర్థబలంతో, కక్షలతో, కుల మత ముఠా రాజకీయాలతో, పదవులకోసం దేశమంతా పెనగులాడె దౌర్భాగ్య పరిస్థితులు లేనట్లవుతాయి. అవకాశాన్ని ఎవరికి ఇవ్వాలనేది దానిపై, పరిస్థితులు రూపొంది ఉన్నాయి.

15) ఈ అవకాశాలను కల్గిస్తున్నది దేవుడా? మనమా? పాలకులా ? నేటి వరకు పాలకులు కల్గిస్తున్నారు. వీరి పరిపాలనకు స్వస్తిచెప్పి, సత్ఫలితాలనిచ్చే అవకాశాలకు దేశంలో స్థానమిస్తే, సరైన సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితులు నెలకొంటాయి. వీటినుండే కదా మనకు మంచో చెడో కల్గుతున్నది దుష్ట పరిస్థితులకు అవకాశాలను మనమే ఇస్తూ, సరైన పరిస్థితులను రూపొందించుకోకుండా ఉన్నాం, కాబట్టే భవిష్యత్తు మన అధీనంలో లేదన్న భ్రాంతి కల్గుతోంది.

# 5. అనుభవాలు

1) గతం అనుభవం, వర్తమానం అనుభవం. ప్రతిరోజు ప్రతివారికి అనుభవాలే. ప్రతిది అనుభవమే. జీవితం అంటే అనుభవాలు. ఈ అనుభవాలనుండి ఎవరైనా ఏమి నేర్చుకున్నారనేడి దానిపై, మార్పును పురోభివృద్ధిని సాధింపగలరు. అనుభవాలు అంటే యథార్థాలు. జీవితం స్వల్పం. కాబట్టి ప్రతిది అనుభవం ద్వారా నేర్చుకోలేము. అనుభవాల ద్వారా నేర్చుకోకున్నా, వ్యక్తిముందు అసంఖ్యాకమైన పరోక్ష అనుభవాలు ఉంటున్నాయి.

2) అనుభవాలు లేకుండా విషయాల గూర్చి తెలియదు. ఒకరు తెలియజెప్పిన విషయాన్ని గూర్చి తెల్సుకుంటే, విషయావగాహనకు ప్రత్యక్ష అనుభవాలతో పనిలేదు. శాస్త్రీయ అవగాహనలేని అనుభవాల గూర్చి తెల్సుకోవటం నిష్ప్రయోజనం. ఒక సంఘటనయొక్క అవగాహన అనుభవమే. ఒకో ప్రత్యేక పరిస్థితినుండి, ప్రత్యేక అనుభవం కల్గుతుంది. ఒకో పరిస్థితి ఒకో అనుభవం.

3) విషయానుభవం లేకుండా నిర్ణయింపలేకుంటారు. సరైన విషయానుభవంలేని, నిర్ణయాలు అనర్థాన్ని కల్గిస్తాయి. పాలకులు ప్రజలు తామనుసరించెడి పద్ధతులద్వారా, మంచో చెడో ఫలితాలను చూస్తున్నారు. ఇవే అను

భవాలు. అనుభవం ఆలోచింప జేయిస్తుంది. ఆలోచింపలేకుంటే, ఆ దోషము వ్యక్తిది సమాజముది. గత అనుభవాలలో యథార్థత దాగి ఉంది. గత అను భవాలను పరిశీలింపనప్పుడు, యథార్థతను గుర్తింపలేకుంటారు.

4) ఏయే పరిస్థితులకు ఎవరుకారకులో, ఏయే పరిస్థితులు ఎలాంటి సంఘ టనలకు కారణమవుతున్నాయో, ఏయే సంఘటనలవల్ల ఎలాంటి ఫలితాలు సంభవిస్తున్నాయో, వ్యక్తులందరి అనుభవంలోనివే. పరిస్థితులు కల్గించెడు అనుభవాలు మనకు ఎదురవుతున్నా, అనుభవాలద్వారా గుణపాఠాలను నేర్చు కోవటంలేదు. దీనివలన దుష్టసంఘటనలు పునరావృత మవుతున్నాయి.

5) ఒకరిని వేధించిన కష్టాలవల్ల వారికో అనుభవం ఏర్పడుతుంది. ఈ అనుభవంచే, తాను పొందిన కష్టాలు ఇతరులు పొందకుండా ఎలా నిరో ధించబడాలో, కృషిచేసి నిరోధింపజేస్తే, ఒక సంఘటనకు సంబంధించిన కష్టాలు మరెవరికి ఉండవు. కష్టాలు అందరికి ఉంటున్నాయి. తామెదు ర్కొనేటి కష్టాన్ని, తామెలా అధిగమించగలరోనన్న ప్రయత్నంతో సరి పెట్టుకుంటున్నారు. కష్టాల పాలయినవారు ఆ పరిస్థితి దాటిన తదుపరి ఇంక దానినిగూర్చి మరుస్తున్నారు. కష్టాలను సంభవింపజేస్తున్న పరిస్థితులు ఏవో అనుభవాలద్వారా తెలుస్తున్నాయి. దేనివల్ల ఎవరికి ఎలాంటికష్టం ఉంటుందో నన్నది ఒక అనుభవం.

6) మనుష్యులు చేసే పనులు వేరు. వృత్తులు ఉద్యోగాలు వ్యాపారాలు వేర్వేరు. వీరందరి సమస్యలు వేర్వేరు. ఇలా సమస్యలు వేరవటంవల్ల, ఒకరికున్న సమస్యనుబట్టి కష్టం ఉంటోంది. ఒక వ్యక్తి ఎదుర్కొనే సమ స్యలు తక్కువ. సమస్యను ఎదుర్కోవటం పరిష్కరించుకోవటంతో, ఆ వ్యక్తి ఆ సమస్యనుంచి ఆ అనుభవంనుంచి దూరం అవుతున్నాడు. ఇలాగ దేశంలో ప్రజలందరూ సమస్యలను అనుభవిస్తున్నారు. ఎవరి పరిధిలోవారు మరుస్తున్నారు.

7) ఒక వ్యక్తి తానేదైతే సమస్యను అనుభవించాడో, అదే సమస్యచే తిరిగి ఇతరులు బాధింపబడకుండా ఉండాలంటే, ఎలాంటి పరిస్థితులు ఉండాలో పరిశీలించటంలేదు పరిశీలనవల్ల పరిష్కారం దొరకుతుంది. ఒక సమస్యను తిరిగి పునరావృతం కానివ్వకుండా పరిష్కరించుకుంటే. ఇదే సమస్య తిరిగి ఏర్పడదు. ఒకో సమస్య ఒకో అనుభవం. ఒకోకష్టం ఒకో నష్టం ఇవన్నీ అనుభవాలు. ఈ అనుభవాలద్వారా ఒకో సమస్యను పరిష్కరించి వేసుకుంటే, ప్రజలందరికి సమస్యలనేవి ఉండేవికావు.

8) రాత్రింబవళ్ళెలా వస్తూ పోతున్నాయో. అలాగే కష్టాలు రావటం పోవటం సాగుతోంది. కష్టాలు సంభవించనట్టి పరిస్థితులను స్థిరం చేసు కుంటే, కష్టాలు ఉండవని అనుకోక పోవటంచే భరిస్తున్నారు. కష్టాలను సంభవింపజేయని పరిస్థితులు ఏమిటో అర్థంచేసుకుంటే. అనుకూల పరిస్థితు లను నెలకొల్పుకునెడి తహతహ ఏర్పడుతుంది.

9) అనుభవాలనుంచి గుణపాఠాలను నేర్చుకొని, సమస్యారాహిత్య జీవ నాన్ని సాధించెడి కృషిలో, పాల్గొనటంలోనే జీవితానికి అర్థం ఉంది. ఎన్నో శాఖోపశాఖలుగా చీలిన వృక్షంయొక్క, ఒకకొమ్మయొక్క ఆకును త్రుంచి పారవేయటం వంటిదే, తన కష్టాన్ని పరిష్కరించుకోవటం ఎవరికివారు ఇలా కష్టాలను అధిగమించాలను కోవటంచే, ఆ విట వృక్షం ఎల్లప్పుడూ సజీవంగానే ఉంటుంది. కష్టాలను ప్రాప్తింపజేసెడు. పరిస్థితులు వృక్షంవలెనే స్థిరంగా ఉంటాయి. ఇలాంటి వ్యక్తిగత పరిధిని వదలివేసి, ఈ కష్టాలను కల్గించే పరిస్థితులను సమాజంనుండి సమూలంగా తొలగిం చట మెలాగ. అందుకు ఒక వ్యక్తిగా తానెలా సహకరించాలి అనే దృష్టిని నెలకొల్పుకున్నప్పుడు, మొత్తం సమస్యలు నిర్మూలింపబడతాయి.

10. కుటుంబంకొరకు కాకుండా సమాజంకొరకు జీవించాలి. కుటుంబ వ్యవహారాలపై ఉండెడి దృష్టి, సామాజిక వ్యవహారాలపై ఉండాలి. తన

వారు ఎదుర్కొనే సమస్యలపై ఉండే దృష్టి, ప్రజలందరూ ఎదుర్కొనే సమస్యలపై నిలపాలి. ఈ సమాజాన్ని తమ కుటుంబంగా భావించకల్గితే, కుటుంబ శ్రేయస్సుపై ఉండే దృష్టి, సమాజంపైన ఏర్పడుతుంది.

11) కష్టం అనేది దానంతటదే వచ్చి పోవటంలేదు. వ్యక్తి కాలాన్ని శ్రమను వ్యర్థపరచకుండాను, వృథా ప్రయాస పాల్పడి చేయకుండాను, అశాంతిని ఆందోళనను కల్గించకుండాను, దానంతటదే పోవటంలేదు. కాబట్టి కష్టాలు అనేవి ఉమ్మడి సమస్య. ఈ సమస్యకు పరిష్కారం మనందరం దండెత్తటమే.

12) కాలము ధనమునకువలె అనుభవాలను అవకాశాలను వ్యర్థపుచ్చు తున్నాం. కాబట్టి మనం నేర్చుకుంటున్నది, మన సమాజానికి తోడ్పడు తున్నది ఏదీ లేకున్నది. అనుభవాలను మరచితే, ఎవరు సాధించకల్గింది ఏదీఉండదు. తన అనుభవాల తోటి ఇతరుల అనుభవాలతోటి, ఎలాంటి పరిస్థితులు నెలకొని ఉన్నాయో అర్థంచేసుకోవాలి. అందరి సహకారం లేనిదే దుష్టపరిస్థితుల నిర్మూలన సాధ్యపడదు కాబట్టి, దుష్టపరిస్థితుల నిర్మూలనను కర్తవ్యంగా భావించాలి.

...o...

# 6. వ్యక్తి - సమాజము

1) మానవ ప్రవృత్తి జంతుప్రవృత్తి ఒక్కటే కాకపోవటానికి కారణం విషయజ్ఞానం. ఈ విషయ జ్ఞానమంతా పరిశోధనాంశం. భాష, భావం, సంఘటనలకు స్పందన, రాగద్వేషాలు వంటివి సమాజప్రభావం.ఏది నేర్చుకుంటున్నా, ఎలాంటి అవాంతరాలను అధిగమిస్తున్నా, ఎలా మనుగడ సాగిస్తున్నా, దీనికి కారణం సమాజం.

2) నేర్వటం నేర్వకపోవటంపై, జీవితం ఆధారపడి ఉంది. ఏది చూడకుండా, ఏది వినకుండా, ఏద గ్రహించకుండా, ఏది నేర్వబడదు. ఏది నేర్వబడకుండా; ఏది తెలియదు, ఏది చేయలేరు. విషయాలు వాటంతటవే మనుష్యులకు తెలిసిపోవటంలేదు. ఏది నేర్చుకోకుండగనే జీవుళ్ళవల్ల, అన్నియు తెలిసిపోవటంలేదు. మనిషి తెల్సుకోకుంటే, అదలా తెలియని విషయంగానే ఉండిపోతుంది

3) పుట్టి పెరగటంతో పనులు చేయటం రావు. ఎంత వయస్సు వచ్చినా, ఎంత శరీరం పెరిగినా, ఏదయినా ఒకపని చేయాలంటే చేయలేరు. ఏదైనా చేయకలగాలంటే. ఆ పనిని చేసెడు విధానాన్ని మెదడులో ప్రవేశపెట్టాలి. దీనిచే పనులను జరిపిస్తున్నది మెదడుకాని జీవుడుకాదని తెలుస్తోంది.

4) మనిషి నేర్చుకున్నాడు కాబట్టి విషయాలు తెలుస్తున్నాయి. అందువల్ల

పనులు చేయకల్గుతున్నాడు. నిత్యజీవితంలో ఎవరే పనులు చేస్తున్నా, ఇదంతా ఇంతకుముందు నేర్చి ఉన్న కారణంగానే చేయకల్గుతున్నారు.

5) పసిపిల్లలకు ఏది తెలియదు. వారిని అలా మానవ సంచారంలేని ప్రదేశంలో వదలివేస్తే వారికి అబ్బేది జంతు ప్రవృత్తి. రూపం మనుష్యులదే అయినా, స్వభావాదులు జంతువులవి. జంతువులలాగే పెరిగి, జంతువుల లాగే ప్రవర్తిస్తూ, జంతువులలాగే మరణిస్తారు.

6) ఏమీతెలియని స్థితిలోని పసిపిల్లలకు ఎన్నింటినో, తల్లిదండ్రులు నేర్పబట్టే నేర్చుకోగలిగారు. ఇలాగే మనుష్యులు సమాజంనుండి నేర్చుకుని ఈ స్థాయికి ఎదిగారు. ఒక స్థాయివరకు తల్లిదండ్రులు, ఆ తదుపరి సమాజము నేర్పుతోంది. ఇలా నేర్చుకోకుంటే ఏదీ తెలియటంలేదు కాబట్టి, తనకు ఏది తెలిసినా అందుకు కారణం నేర్వటం కాని జీవుడుకాదు. పరిశోధకులనుండి సమాజం నేర్చుకుంటూ, ఈ స్థాయికి ఎదిగింది. సమాజం నుండి మానవాళి నేర్చుకుంటోంది.

7) సమాజము కుటుంబము వ్యక్తిత్వాన్ని మనఃస్తత్వాన్ని నేర్పుతున్నాయి. సమాజమువేరు-మనిషివేరు - మనస్సువేరు కాదు. రాతిబండల నుండి సౌందర్యవంతమైన శిల్పాలు ఉద్భవించినట్లుగనే, జంతుప్రవృత్తి నుండి మానవ ప్రవృత్తిగల వ్యక్తిత్వం ఉద్భవించటం అనేది, ఒక సమాజం ప్రజలకు ఇచ్చేటు శిక్షణపై ఆధారపడిఉంది. తానొసంగెడు శిక్షణా రీతినిబట్టి, మనుష్యులు మలచబడుతున్నారు.

8) మనుష్యులకున్న సమాజానికున్న అవసరాలు కోరికలే, మనుష్యుల చేత పనులను చేయిస్తున్నాయి. పనులను నిర్దేశిస్తున్నాయి. ఇంతకుముందు ప్రవేశపెట్టబడిన నియమ నిబంధన లాధారంగా, అవసరాలను తీర్చుకుంటున్నాం. ఒక పనిని ఒకరు చేస్తున్నారంటే, అదలా చేయమనో, అదలా జరగాలనో విధి లిఖితమైలేదు. మనలను నడిపిస్తున్నది సమాజం.

9) మన అవసరాలను కోరికలను జీవుళ్ళకాని ప్రభుత్వంకాని తీర్చటం లేదు. పరస్పర సహకారం తోడ్పాటుతో, పరస్పర అవసరాలను తీర్చుకుంటున్నాం. అవసరాలు తీరుటకు కారణం పరస్పర సహకారం. ఒకని పనులు నెరవేరటానికి, మరొకరో మరికొందరో కారణం.

10) తన సంపాదన తన ప్రతిభ అనేది అహం మాత్రమే. సమాజం నుండి విడిపోతే, ఎవరికి ఏ సంపాదన ఉండదు. సంపాదన ఉంటోందన్నా, సౌకర్యాలు ప్రాప్తిస్తున్నాయన్నా, అదృష్టం అనుకున్నా, ఇదంతా సమాజంనుండి వ్యక్తుల కృషినుండి సాధ్యపడుతున్నాయి. సమిష్టి కృషి ఫలితమే సమాజంలోని సంపదలు. ఈ సమిష్టికృషిలో వృక్ష జంతుజాలం యొక్క భాగస్వామ్యము ఉంది.

11) అధికలాభాలు గడించినా, సౌకర్యాలను ఏర్పరచుకున్నా, ఏది కొనుగోలు చేస్తున్నా, ఇళ్ళు కట్టుకున్నా, ఆస్తులను సమకూర్చుకుంటున్నా, వీటికంతా కారణం; పనులు ఉద్యోగాలు, వ్యాపారాలు, వ్యవసాయం పరిశ్రమలు, వీటినుంచే లాభాలు నష్టాలు ప్రాప్తిస్తున్నాయి. ఇవి లేకుండా సంపాదనలేదు.

12) వ్యవసాయ పారిశ్రామిక ఉత్పత్తులను ఎవరు కొనకపోతే, రైతులు పండించిన పంటలు పరిశ్రమలనుంచి వచ్చిన ఉత్పత్తులు నేలపాలవుతాయి. అప్పుడు వ్యాపారాలులేవు, పనులులేవు. పరస్పర అవసరాల నిమిత్తం పరస్పరం కొనుగోలు చేస్తున్నారు కాబట్టి, వృత్తులు ఏర్పడ్డాయి.

13) మన అవసరాలు మన కోరికలే, మనకు పనులను వృత్తులను సృష్టిస్తున్నాయి. ఇలా సృష్టింపబడే అవకాశాలు పరిమితం. ఈ అవకాశాలను పొందిన వారిని ఎంత అదృష్టవంతులో అని అనుకుంటారు. సమిష్టిజీవనం నుంచి ఏర్పడ్డవే ఈ అదృష్ట దురాదృష్టాలు.

14) లక్ష్యము-కర్తవ్యము-హక్కులు-బాధ్యతలు-సమిష్టి కృషి - అజ్ఞా

పన_నియంత్రణ-ప్రోత్సాహము-నిరోధము-పరస్పర అవసరము - పరస్పర సంబంధము వంటివెన్నో, నిర్వర్తించాల్సిన పనులపై ఒత్తిడితెస్తూ మనుష్యులచే చేయిస్తుంటాయి.

15) లక్షల కొలదిమంది లాటరీ టిక్కెట్లు కొంటే, ఏ కొద్దిమందికో బహుమతి రూపంలో డబ్బు లేదా ఆస్తి వస్తోంది. అలాగే కోట్లకొలది ప్రజలు నిత్యం శ్రమిస్తుండటంవల్లనే, కొద్దిశాతం ప్రజలకు విద్య ఉద్యోగం వ్యాపారం ఆస్తివంటి అవకాశాలు చేకూరుతున్నాయి. ఇదంతా తోటివారు ప్రాప్తింప జేస్తున్నది.

16) ప్రజలందరి అవసరాలు తీరాలంటే, సమాజం సరిగా నిర్వహించబడాలి. ఇలాగ నిర్వహించాలంటే: వ్యవసాయం చేసేవారు పరిశ్రమలను నడిపేవారు తదితర వృత్తులను చేసేవారు విద్య నేర్పేవారు వృత్తి శిక్షణ ఇసంగేవారు, ఇలా కొందరు బాధ్యతలను వహిస్తేగాని, మొత్తం అందరి అవసరాలు తీరవు. అందరి అవసరాలను తీర్చమని వారికా బాధ్యతలను అవకాశాలను ఇచ్చాము. వారా బాధ్యతలను నిర్వహిస్తున్నందుకు సంపాదనను అంగీకరించాము. ఉద్యోగులకు కార్మికులకైతే వేతనాల రూపంలోను. వ్యాపారులకు కొనుగోలు అమ్మకం ద్వారాను. రైతులకు పంటలు పండించుట ద్వారాను, ఆర్జనను అనుమతించాము. ఇలాంటి అంగీకారం వల్లనే. కొద్దిశాతం ప్రజలకు ఆస్తులు సౌకర్యాలు చేకూరుతున్నాయి. ఇలా చేకూరేదంతా; తమ ప్రతిభ అనో, తమ అదృష్టం అనో, పుణ్యఫలితం అనో. దైవప్రాప్తం అనో, పలువిధాల పేర్లతో అనుకుంటారుగాని - ఇదంతా సమిష్టి శ్రమఫలితంలోని భాగం.

17) వ్యక్తి పుడతాడు మరణిస్తాడు. అతని ఆయువు స్వల్పం. అతను సాగించే జీవితం స్వల్పం. మానవాళితోబాటు సమాజము ఉంటుంది. సమాజము యొక్క లక్ష్యము ప్రజాశ్రేయస్సు. ఉమ్మడి శ్రేయస్సుకు ఎలాంటి విఘాతాలు ఏర్పడకుండా ఉండేందుకై, సమాజం తప్పొప్పుల

విభజన చేస్తుంది. సాంఘిక ప్రయోజనాల సాధనమందు, వ్యక్తి ప్రయోజనం గుర్తింపలేనిది. స్వలాభము స్వార్థము స్వసౌఖ్యము కోసం, ఆరాటపడే వ్యక్తుల దురాశలను పద్ధతులను నిరోధింపకుండా ఉంటే, అవి క్రమేపి అందరి జీవితాలలోను సాధారణమైపోయి వ్యథల పాల్జేస్తాయి.

18) తన ఊహ తన భావన ఆధారంగా, సాగేదిగా జీవితంలేదు. మనిషికి మనిషికి జీవితం ప్రత్యేకించిలేదు జీవితంలో అనుసరించాల్సిన పద్ధతులు నియమాలు ఉన్నాయి. వీటిని ధిక్కరించటంతో, వ్యక్తిత్వంలో మనఃస్తత్వంలో భిన్నత్వం ఏర్పడుతుంది.

19) సమాజంతో ఒప్పందమే జీవితం. సామాజిక విధానాలతో అంగీకరించి సక్రమ నడవడికను ఏర్పరచుకొనటమే జీవితం. జీవితం అంటే ఒక సమగ్ర విధానం.

20) తన సమాజంతో కలసి జీవించటానికి సిద్ధంచేసుకున్నదే మనస్సు. సామాజిక ప్రభావం మనస్సుపై, మనో ప్రభావాలు సమాజంపై పడుతుంటాయి. పరస్పర ప్రభావాలకు మనిషి స్పందిస్తాడు, తదనుగుణంగా ప్రవర్తించుతుంటాడు.

21) కొందరి విశ్వాసాలకు, కొందరి కొరకు సమాజం కాదు. సమాజంలో వేటికయితే స్థిరస్థానం ఉండాలో, ఆ స్థానానికి భంగం కలుగకుండా, తమని తాము సంస్కరించుకోవాలి. స్వయంకృషి ద్వారా సరైన వ్యక్తిత్వాన్ని మనఃస్తత్వాన్ని పెంపొందించు కోవాలి. అప్పుడు తాను, తోటివారు, జీవించటానికి అనుకూల పరిస్థితులు యేర్పడి ఉంటాయి.

22) సమాజము నాగరికత ఇవి లేకుంటే, ఉండేది అంధకారం అనా

గరికత్వం. నాగరికత అనేది క్రమేపి ఏర్పడుతూ వచ్చింది కాని, దానంత టది ఏర్పడలేదు. నేడు మనం చూస్తున్న ఈ నాగరికత ఒకప్పుడు లేనిది. నేడు ఏ సౌకర్యాన్ని పొందుతున్నా, ఇదంతా నాగరికతా ఫలితం. దీనిని సాధించింది సమాజం కాబట్టి, ఎన్నెన్నో ఫలితాలను అనుభవిస్తున్నాం. ఇలా అనుభవించడానికి కారణం సమిష్టికృషి.

23) మనుష్యుల అవసరాలు కోరికలు పరస్పర సంఘర్షణలను యుద్ధాలను సృష్టిస్తాయి. ఇలాంటి అనాగరికత్వం భరించలేరు కాబట్టి నియమ నిబంధనలతో కూడిన నేటిసమాజం రూపొందింది. నియమ నిబంధనలు పాటించకుంటే మనఃస్తత్వాల మధ్యఉండే వైరుధ్యాలు భరించలేనివిగా ఉంటాయి. బలవంతులు బలహీనులు మధ్య ఏర్పడే సంఘర్షణతో భయం వెన్నాడుతుంది. ఇట్టి భయాందోళనలులేకుండా రక్షణ ఒసంగేది ప్రభుత్వం. వ్యక్తులను పాలించేందుకు ప్రభుత్వం ఏర్పడింది. వ్యక్తులు కలిసి మనుగడ సాగిస్తుంటే, అది సమాజం. సమాజం యొక్క ఆధీనంలో హక్కు అయి ఉన్నభూమి దేశము. దేశాన్ని వ్యక్తులను సంరక్షించేది ప్రభుత్వం.

24) స్వంత ఇల్లువంటిది దేశం. స్వంత ఆస్తి ఎలాగో, అట్టివే దేశంలోని సంపదలు. స్వంతఇల్లు, స్వంతఆస్తికి వలె, నిశ్చింత జీవనాన్ని ప్రసాదిస్తుంది దేశం. దేశంలేకుంటే నేటిజీవితము లేదు. 2. విద్యనేర్చినా నేర్వకపోయినా అనేక గ్రంథాలు చదివినా చదవకపోయినా, సమకాలీన సాంఘిక జీవితం అవగాహనను అనుభవాన్ని కల్గిస్తుంది. ఈ అవగాహన అనుభవం వల్లనే, తాను నివసించే సమాజంలోని సమస్యలు లోపాలు గ్రహింప వీలవుతుంది.

25 వ్యక్తి వేరు సమాజం వేరుకాదు. సమాజంలో అంతర్భాగం వ్యక్తి. వ్యక్తులను నడిపించుతున్నది సమాజం. వ్యక్తులందరు కలసి నిర్వహించుకుంటున్నది సమాజం. అవకాశాలు అనుభవాలు సమాజంనుంచే ప్రాప్తిస్తు

న్నాయి. రక్షణను సంరక్షణను కల్గించుతున్నది సమాజం. సమాజం లేకుంటే పైవిలేవు.

26) మరణమనేది ఎక్కడో వ్రాసిపెట్టిలేదు. తనసమాజం తనకి రక్షణను సంరక్షణను చేకూర్చలేనిదయి పోతుంటే, ఆ మరణం ఏరోజయినా సంభవించవచ్చు. అందుచే జీవితంకన్నా, ప్రాణంకన్నా, ఉన్నతమైనది సమాజం. కాబట్టి తన అనేడి సంకుచిత పరిధి విడనాడ వలసినది. తన దేశంలో అరాచకం అవ్యవస్థలు ఉంటుంటే, వాటిచే జీవితమే నశిస్తుంది.

27) సమాజంలో సరయిన భావాలను సరయిన పద్ధతులను ప్రవేశపెట్టుకోకపోవటం లేదా ధ్వంసం చేసుకోవటం అంటే, తమ జీవితాలలో వ్యధలను ప్రాప్తింప చేసుకోవటమే. నేనుకన్నా, నాదికన్నా, బంధనలకన్నా, సమాజమే సర్వస్వము. ఇట్టి సమాజానికి హాని తలపెట్టేవారి ప్రాణాల గూర్చి క్షమవద్దు. తమ శరీరాలను తామెంత జాగ్రత్తగా కాపాడుకుంటారో తమ సమాజాన్ని తామంత జాగ్రత్తగా కాపాడుకుంటున్నప్పుడే మహాప్రశాంతి. ఇట్టిదే జీవితం.

# 7. స్వయం కృషి - సాధన

1) వ్యక్తి డబ్బును ఖర్చుచేసి, ప్రభుత్వం సమకూరుస్తున్న వాటినుండి, తాను భాగం పొందుతున్నాడు. అంతేకాని తన అవసరాలను తానే తీర్చు కోలేడు. వ్యక్తి తానేమి కొంటున్నా కుటుంబం ఏ సదుపాయాన్ని పొందు తున్నా, ఇదంతా సమిష్టి ఫలితంలో భాగాన్ని పొందటంవల్ల ఏర్పడు తున్నది. ఎక్కడ ఏవుత్పత్తి ఉన్నా, అది దేశప్రజ లందరి కృషిఫలితం. ఈ కృషిఫలితం నుండి, తనకు కావలసినది డబ్బిచ్చి పొందుతున్నాడు. దానిచే అవసరం తీరుతోంది.

2) ఏది కొనగలుగుతున్నా దానికికారణం దేశం. దేశంలోని వనరులవల్లనే ఏదయినా ఉత్పత్తి సాధ్యపడుతోంది. దేశం ప్రజలందరిది. దానిచే దేశంలో తయారయ్యేడు ఉత్పత్తులన్నింటిలో, ప్రజలందరకీ భాగంవుంది. తమందరి ఆస్తి దేశం. తమ ఆస్తిలో, తమకు భాగంఇవ్వకుండా, ఆకలితో, వ్యాధు లతో బ్రతక కల్గినంతవరకు బ్రతకండి అంటే, ఎందుకు సహించాలి? తమకు కడుపునిండా తిండి పెట్టలేని ప్రభుత్వం ఎందుకుఉన్నట్లు?

3) తమ పిల్లలకు సరయిన విద్యతో విద్యాధ్యయనం జరగాలన్నా - కాలుష్యం బెడదలు పీడించకుండా ఉండాలన్నా - సమ్మెలు, సంఘర్షణలు, ఆందోళనలు ఉద్యమాలు ద్వారా కష్టనష్టాల పాలవకుండా ఉండాలన్నా - నేరాలు నేరస్తులకు అవకాశాలు లేకుండా చేయాలన్నా - అరాచకం అవ్యవ

స్థలను ఆరికట్టాలన్నా - యుద్ధోన్మాదులచే అష్టకష్టాలు ప్రాప్తించకుండా వుండాలన్నా; మన స్వంత పనులపై వుండెడు బాధ్యతను పై వాటికి మరల్చాలి. వ్యక్తిగతమైన పనులన్ని సక్రమంగా నెరవేరుతున్నాయో లేదో నన్న ఆరాటము. ఫలితాల కొరకై స్వయంకృషి వున్నది కాబట్టి ఫలితాలు సమకూరుతున్నాయి. ఇట్టి స్వయం కృషిని తమ సమాజంపై వుంచితే, అనుకున్న ఫలితాలు సిద్ధిస్తుంటాయి. పై వంటి అవసరాలను పీడి, వ్యక్తి జీవించుటలేదు. అయితే అవి తనకు సంబంధించినవి కావని, ఎవరికివారను కుంటూ, ప్రభుత్వానికి వదిలేశారు.

4) పరిసరాలందు అపరిశుభ్రతవల్ల - వాగులు కాలువలు చెరువులలోని నీరు త్రాగటంవల్ల - వాతావరణాన్ని నీటిని కాలుష్య పర్చటంవల్ల-పోషకాహార లోపంవల్ల వర్షాకాలంలో వ్యాధులు ప్రబలే అవకాశంవల్ల - వ్యక్తి లేదా సమాజం ఆరోగ్యసూత్రాలను పాటించనందువల్ల, వ్యాధులచే పీడింపబడుతున్నారు.

5) వ్యాధులను సంభవింపజేస్తున్న పరిస్థితులు వుంటున్నాయి. వ్యాధుల బారిపడకుండా రక్షించేఏర్పాట్లు లోపించడంవల్ల, వైద్యసదుపాయం అందుబాటులో లేనందువల్ల వ్యాధుల పాలవటంవుంది. పరిసరాల పరిశుభ్రత, వైద్యసదుపాయము ప్రభుత్వానికి వదలివేశారు. కష్టాలను కల్గిస్తున్న పై పరిస్థితులను తొలగిస్తే, ఆ సమాజంలోనివారు వ్యాధుల పాలిటబడి దుఃఖించరు. ఇలా జరగాలంటె స్వంత పనియందుండే దృష్టిని పై వాటిపై ఉంచాలి,

6) ఒక పరిమిత పరిమాణంలో ఎక్కడోచోట వర్షాలు పడుతుంటాయి. ఈ వర్షపునీటిని సాగుకు అనువుగా నిల్వచేస్తూ, పంటపొలాలకు నీటిని అందిస్తే రైతులకు ఆదాయంవస్తుంది. 2. అడవులను విచక్షణారహితంగా కొట్టివేయడాన్ని వుపేక్షిస్తూ, చెట్ల చేమలపై తగినశ్రద్ధ వహింపనందుచే, వర్షాలుపడటం తగ్గిపోయి రైతులు నష్టపోతున్నారు. 3. చీడలు తెగుళ్ళ

నుంచి పంటలను రక్షించుకొనేటి సామర్థ్యాన్ని, ప్రభుత్వము రైతులు పెంపొందించు కోనందువల్ల, రైతులు నష్టపోతున్నారు. ఏరైతు కారైతుకి తనపొలం తనరాబడిపై మాత్రమే శ్రద్ధ. పండకపోతే దైవప్రాప్తంలేదని కాలక్షేపం చేస్తాడు.

7) లాభాలు నష్టాలు కల్గించే పరిస్థితులు ఏవో పైవాటిచే తెలుస్తోంది. పంటలు పండేందుకు అనుకూల పరిస్థితులను సాధ్యపరచినప్పుడే, ప్రజలం దరికి ఆహారం అందుతుంది, లేకుంటే లేదు. పంటలు పండనప్పుడు ఆ రైతులు సయితం ఆహారం కొరకు దేశంపై ఆధార పడతారు. ఇవిరైతుల సమస్యలా? కావు. ఇది ఉమ్మడి సమస్య. వ్యక్తులయొక్క ప్రభుత్వం యొక్క కృషి ప్రయత్నాలలోని లోపాలవల్ల వ్యధలు కల్గుతున్నాయి.

8) స్వయంకృషి లేకుండా ఏది సాధ్యపడుటలేదు. ఏది సాధ్యపడివా స్వయంకృషి ఫలితం. స్వయంకృషికి వున్న ప్రాధాన్యతను విస్మరిస్తుంటే దానివల్ల పొందాల్సిన ఫలితాలను కోల్పోతున్నట్లు. ప్రతిఒక్కరు తమ అవసరాలు కోరికలు తీరేందుకు కృషి ప్రయత్నము చేస్తున్నారు. వ్యక్తిగ తంగా సాగుతున్న ప్రయత్నం ఇది. ఈ అవసరాలు, కోరికలు అనేవి వీలయినంత సుళువుగా తక్కువశ్రమతో, భయాందోళన రహితంగా తీరే విధానాలు ఏవో, అట్టి విధానాల ద్వారా కలసి పనిచేయటం, సమిష్టికృషి అవుతుంది. వ్యక్తిగత పరిధిని వదలి సామాజిక పరిధిని దృష్టియందుంచు కొని, వ్యక్తి స్వయంకృషిలో పాల్గొనడం వల్ల, సమిష్టి కృషి ఫలితాలు ఏర్పడతాయి. సమిష్టికృషి సాధన వున్నప్పుడు, వ్యతిరేక పరిస్థితుల బారి నుండి తప్పింప బడతారు. స్వయంకృషిని విడనాడి, అంతా అనుకూలంగా జరపమని దేవునిని ప్రార్థిస్తే, దైవమెలా మానవుల అభీష్టాన్ని నెరవేర గలరు?

9) ఒక మనిషి ఉదయం నుండి సాయంత్రం వరకు పనిచేస్తాను, నన్ను పనిలోకి తీసుకోండి అంటే, పనులలోకి తీసుకొనెడివారు లేరు. ఇదే నిరుద్యోగం. రోజంతా అలా ఏడాదంతా పనిచేస్తున్నా, కనీసావసరాలు తీరటం లేదు. అలాంటప్పుడు ఎలా బ్రతకటం? ఎలా బ్రతకాలి అనేది సమస్య. తన శరీరంకోరే కాస్తంత తిండి పెట్టడం, వ్యక్తిగత సమస్య అయ్యింది. వ్యక్తిగత సమస్యలు పరిష్కారంకై, పనులకొరకు వేతనాలకొరకు నిరంతరం ప్రయత్నిస్తున్నారు. బ్రతకటం కొరకు పోరాడుతున్నారు. అయినా ఒకరి కాలాన్ని, ఒకరి శ్రమను ఉపయోగించుకునేవారు న్యాయ ఫలితాన్ని ఇచ్చేవారు లేకున్నారు.

10) దేశంలో అధికజనాభా వుండటంవల్ల, కొంతశాతం ప్రజల కాలం వారిశ్రమ దేశానికి అవసరం లేదు. దేశానికి అయితే ఇట్టి ప్రజల కాలం శ్రమ అవసరం లేదుకాని, వీరందరూ తమ అవసరాలు తీరుట కొరకు, దేశంపై ఆధారపడ్డారు. దేశంలోని సంపదలను సద్వినియోగపరిస్తే అవసరాలు తీరతాయి. ఈ సద్వినియోగ పరచే అవకాశం కొద్దిశాతం ప్రజల చేతుల్లో వుంది. భూములు, పరిశ్రమలు వాణిజ్యం, వృత్తులు ప్రతిభ సామర్థ్యం వంటివి, కొద్దిశాతం ప్రజల మరియు ప్రభుత్వ అధీనమై ఉన్నాయి. తమ అధీనంలో ఈ వనరులను అవకాశాలను ఉంచుకున్నారే గాని, వీటి సద్వినియోగంపై దృష్టిలేదు. అందుచే కనీసావసరాలు తీరకున్నవి.

11) కనీసావసరాలు తీరాలంటే మొదట, దేశం భరింప గలిగే జనాభా కొరకు, కుటుంబనియంత్రణ పాటించాలి. తదుపరి దేశంలోని సంపదలను సద్వినియోగ పరచాలి. ఈ రెండింటిని విడచి, వ్యక్తిగతంగా తిండి, బట్ట వసతికోసం ఎంత పోరాడినా, ఇదిలా జీవితపు సమస్యగానే మిగిలిపో

తుంది. ఎవరికివారు వ్యక్తిగతంగా సమస్యలను దాటుదా మనుకుంటున్నారు. నిజానికి ఏవి వ్యక్తిగత సమస్యలు కావు. అన్నీ వుమ్మడి సమస్యలు.

12) కనీసావసరాలు తీరేంత డబ్బువున్న వారందరికీ, ఇవి సమస్యలుగా పట్టవు. దేశంలో ఎంతశాతం ప్రజలు దారిద్ర్యాన్ని భరిస్తూ బ్రతకలేక బ్రతుకుతున్నారో, వీరందరూ సమిష్టిగా ప్రభుత్వాన్ని శాసించవలసివుంది. దేశంలోని సంపదల సద్వినియోగంపై, తమకాలము తమ శ్రమయొక్క సద్వినియోగంపై. కొంతశాతం ప్రజలు మరికొంతశాతం ప్రజలను శాసించాల్సివుంది. తమవి వ్యక్తిగత సమస్యలు కావని వ్యక్తిగత పోరాటం వదలివేసి, వ్యక్తిగత శ్రద్ధాసక్తులతో కూడిన సమిష్టి కృషిలో పాల్గొనాల్సివుంది.

13) స్వయంకృషి అనగానే ఇది వ్యక్తికి కుటుంబానికి పరిమితంగా భావిస్తున్నారు. ఒక సమాజంలోని వ్యక్తులందరి స్వయంకృషి ఫలితం వల్లనే, వ్యక్తులందరి అవసరాలు కోరికలు తీరతాయి. వ్యక్తుల కాలము శ్రమ కలిస్తే, స్వయంకృషి అవుతుంది. వ్యక్తుల స్వయంకృషి ఎందుకు దేటికి వినియోగ పడుతోంది అనేది. వ్యక్తిగత పరిధికి సంబంధించినది కాదని, అది దేశప్రజలందరికీ సంబంధించినదని గ్రహించాలి. ఎందుకంటె ఎవరు ఆధారపడ్డా, దేశంపై ఆధారపడ్డారు. కాబట్టి దేశంలో ఒక సభ్యుడిగా జీవించాలంటె దేశప్రజలందరి అవసరాలు తీరే ప్రణాళికాబద్ధమైన విధానాలకు లోబడి, ప్రతిఒక్కరు నడచుకోవాలి.

14) ప్రభుత్వం తన బాధ్యతలను తన ఉద్యోగులపై వుంచింది. వారేది చేస్తే, అది మనకు ప్రాప్తం అనెడి దశ ఇంకవద్దు. అందరి కనీస అవసరాలు తీరేంత ఉత్పత్తిని, సాధించడం అందరి బాధ్యత. స్వంత ఆస్తి స్వంత పనులపై వుండే స్వయంకృషిని–సాధనను, దేశసంపదలపై వనరులపై పనులన్నింటిపై మరలిద్దాం. ఇది కష్టకాలాన్ని తొలగిస్తుంది.

15) తమదేవుని సామ్రాజ్యంలో పండేపంటలు నుండి తదితర ఉత్పత్తుల నుండి భాగంపొందుతూ, ఆకలిని అవసరాలను తీర్చుకుంటారేగాని, ఎవరూ దిక్కులేనివారు కారు. కష్టాలు- కన్నీరు- దారిద్ర్యం, విధిలిఖితం అనేది ఒట్టి భ్రమ.

...o...

# 18. డబ్బు - శ్రమ

1) మతవిధులు సంప్రదాయాలు పండుగలు వేడుకలు వుత్సవాలు వ్రతాలు వివిధాలయిన పూజలు వంటివి, ఏదో ఒకనాడు మనుష్యులు ప్రవేశపెట్టుకున్నట్టి పద్ధతులు. ఇవి ఒకప్పుడు లేనట్టివి. వీటిల్లో పాటించేకొన్ని, కాలక్రమేణా జరుగుతున్న మార్పులు చేర్పులతో పూర్వ పద్ధతిని కోల్పోయినా మరోరూపంలో స్థిరంగా నిలచి వుంటున్నాయి. ఒకమతంకన్నా ఒకమతంలోని దేవునికన్నా, మామతం మాదేవుడు గొప్ప అనుకుంటూ, ఆరాధనలు పండుగలు ఉత్సవాలు వంటి ప్రత్యేకతలను రూపొందించుకున్నారు. దైవసంబంధమని పరలోక సంబంధమని పుణ్యఫల సంబంధమని జీవుడి సంబంధమని, ఇలా వీటిని విడనాడటం లేదు. తంతరాలనాటి అబద్ధపు ప్రచారాలను కొనసాగిస్తుండటం వల్ల, ఆభావనలు స్థిరపడి వుంటున్నాయి. అబద్ధాలను నిజాలని అనుకోవడం వల్ల తృణీకరింపు లేకుండా వుంది.

2) మతవిధులు వేడుకలు, వ్రతాలు వంటివి ఏవి ఎందుకు ప్రవేశపెట్టబడ్డాయో, వాటి పూర్వాపరాలేమిటో మనకు అనవసరం. మనం ఆచరిస్తున్న వాటివల్ల ప్రయోజనముందా? లేదా? అని పరిశీలించి, ఆచరించాలో వదలుకోవాలో తేల్చుకోవాలి. ప్రతిమతస్తులు అనేకం పాటిస్తున్నారు. వీటిని పాటించాల్సినది ఏముంది? ఎందుకు వదలివేయరాదు? ఒకరినిచూసి మరొకరు ఆచరిస్తున్నారే కాని, ఎందుకు విడనాడ కూడదన్న ఆలోచన లేకున్నది.

3) దైవసంబంధమైనా కాకున్నా, వినోదాలు విందులకు వలె, ఈ ఆచారాలను వేడుకలను జరుపుకుంటానికి బానిసలై పోయారు. ఇదో రకమయిన బానిసత్వం. వ్యసనాలకు వలె వీటి అధీనంలోపడి వదలలేకున్నారు కాబట్టే ఏదో ఒక రీతిలో జరుపు కుంటానికి సిద్ధపడుతున్నారే కాని, నిష్ప్రయోజనమైన వీటిని వదలి వేయాలన్న నిర్ణయంవేపు దృష్టిని సారించకున్నారు.

4) తప్పుడు పద్ధతులు తప్పుడు విధానాలు సంభవింపజేస్తున్న కష్టాలకు అశాంతికి ఆందోళనకు, కర్మప్రభావమని గ్రహగతులని దేవుని ఆగ్రహమని అనుకుంటూ, సౌఖ్యప్రద జీవితంకోసం మతాచరణలను నమ్మి పాటిస్తుంటే, ఏకష్టనష్టాలు తొలగవు. వ్యర్థమైన ఆచరణలతో, అపోహాలతో జీవితం గడుస్తుంది తప్పితే, వేరే ప్రయోజనం అంటూ ఏదీ కలగదు. సనాతన ఆచారాలే అవివేకత్వాన్ని నిల్పుతున్నాయి. వివేకరాహిత్యమే ఆవేదనలను కల్గిస్తోంది.

5) ముక్తి, మోక్షం అనేవి అర్థరహితమయిన భావనలు. వీటికోసం జరిపేటు ఆచరణలన్ని నిరర్థకం. ఒక వృత్తినల్ల తనని తాను పోషించుకోవటంతోబాటు, సమిష్టి ప్రయోజనాలకోసం పాటుపడుతున్నట్లే అవుతుంది. బాధ్యతాయుత ప్రవర్తనే జీవితార్థం. తమతమ వృత్తులను బాధ్యతాయుతంగా నిర్వహించటం అంటే, ప్రజలకు సేవచేస్తున్నట్లు మరియు దైవాభిలాషను నెరవేరుస్తున్నట్లు అవుతుంది.

6) జీవితం, శరీరం ఎన్నో పరిమితులకు లోబడి వుంది. ఈ పరిమితులను అర్థంచేసుకోకుండా అధిగమించితే దుఃఖము వేదన తప్పవు. పరిమితంగానే శ్రమించగలం, పరిమితంగానే డబ్బును కూడబెట్టగలం.

7) పనులు జరగటానికి డబ్బులేకున్నా పనులు జరగవు. పనులు జరగటానికి డబ్బువున్నా, తగినంత సమయం అనుకూలత లేకున్నా పనులు జరగవు. పనులు జరగటానికి డబ్బు, సమయము వున్నా మానవుల మాన

సిక శారీరక శ్రమలేకున్నా పనులు జరగవు. పైవి వున్నా ప్రకృతి వనరులు లేకుంటే పనులు జరగవు. ఇవన్నీ లభిస్తున్నా ఉత్పత్తులను వ్యర్థం చేస్తుంటే, అందరి అవసరాలు తీరవు. అనేకమైన పనులు క్రమపద్ధతిలో జరుగుతూ, అందరి అవసరాలు తీరాలంటే, డబ్బు, కాలము శ్రమ వనరులను వీలైనంత ఎక్కువగా సద్వినియోగ పరస్తుండాలి.

8) మనం పాటించే మతవిధులు సంప్రదాయాలు నమ్మకవిశ్వాసాలు వేడుకలు వుత్సవాలు డబ్బును కాలాన్ని, శ్రమను వనరులను వ్యర్ధపరుస్తున్నాయి. ఈ కారణంచే తోటివారికి అన్యాయం జరుగుతోంది. వారి అవసరాలను తీర్చే పథకాలు వెనకన పడిపోతున్నాయి.

9) మతాచరణలు వేడుకలు ధనికులకు వినోదంగా వుండవచ్చు. ఈ ఆచరణలవల్ల, దానికి సంబంధించిన పరిస్థితుల ప్రభావం, ఇతరులపై పడుతోంది. ఒకరిని చూసి మరొకరు పాటించేందుకు ప్రోద్బలమవుతున్నది. విడనాడ వలసిన వాటికి, తప్పనిసరి ఆచరణలుగా స్థానం బలపడుతోంది.

10) ప్రతి కుటుంబంలోని వ్యక్తులు తమ సమయాన్ని తమ డబ్బును ఉత్పత్తులకు ఖర్చుచేస్తుండబట్టి, ఒక పండుగో ఒకమతాచారమో పూర్తవుతోంది. ఇలాగ ఎవరి స్తోమతనుబట్టి వారు ఖర్చుచేస్తున్నారు. దీనిచే కుటుంబముతో బాటు మొత్తం సమాజము నష్టపోతోంది.

11) మాడబ్బు మాఇష్టం మాస్వవిషయం అని అపోహ పడుతున్నారు. అందరి శ్రమఫలితం అయిన డబ్బును, అందరి కనీసావసరాలు తీర్చేందుకు ఉపయోగపడేట్లు తోడ్పడాలేకాని, ఇష్టం వచ్చినట్లు వ్యర్థపుచ్చే హక్కులేదు. ఉత్పత్తులను దుర్వినియోగ పరచేహక్కు ఏ ఒక్కనికిలేదు. మున్ముందు అవసరాలు తీరేందుకు, పొదుపుగా వాడుకోవలసినవి మాత్రమే ఉత్పత్తులు. సమాజమంతటా సక్రమ నిర్వహణా సౌలభ్యం కొరకు అవసరానికి మించిన డబ్బు ఆస్తులు ఆర్జన వంటివి ప్రోద్బలం కొరకు ఇస్తు

న్నవి మాత్రమే. ప్రజలందరు తమకాలాన్ని శ్రమను డబ్బును అందరి కనీసావసరాలు తీరేంతవరకు, నిరర్ధకము నిష్ప్రయోజనము అయినవాటికి ఖర్చుపెట్టకూడదు. ఇది న్యాయబద్ధము. ఏవిధంగా చూసినా ఈమతవిధులు వేడుకలు విడనాడవలసినవి కాని పాటింపవలసినవి కావు.

12) మతసంబంధమయిన కట్టుకధలను నిజాలుగా భ్రమిస్తున్నాం, కాబట్టి విలువఇస్తూ పాటిస్తున్నాం. అందుచే ఒకప్పుడు లేనివాటికి కృత్రిమ విలువలు ఏర్పడ్డాయి. అబద్ధాలుగా తెలిస్తే భ్రాంతిపోతుంది. యదార్ధత తెల్సుకోవాలంటే ఇందుకు సంబంధించిన విషయజ్ఞానాన్ని అయినా పొందకల్గాలి లేదా వివేకం ద్వారానైనా గుర్తించ కలగాలి.

13) దేవుని ఔన్నత్యాన్ని అర్ధంచేసుకుంటే, దేవుని ఔన్నత్యానికి చెందనట్టి విషయాలను వేరుచేయవచ్చు. సర్వోన్నత్తమమైన జ్ఞానసంపన్నుడు దేవుడు కాబట్టి, ఆదేవుని స్వభావాదులు ఆలోచన నిర్ణయాలు ఎలా ఉండి వుండవచ్చో నిర్ధారణ చేయగలం. ఇట్టి నిర్ధారణబట్టి, అబద్ధాలని నిజాలని వేరు చేసుకో గలగాలి.

14) ధర్మము న్యాయము కరుణ ప్రేమ సద్గుణస్వభావం కల వ్యక్తుల ప్రవర్తన ఎలా ఉంటుందో, దుర్మార్గం ఆగ్రహం తెలివితక్కువ అపేక్షాసక్తులు కఠినత్వం కలవారి ప్రవర్తన ఎలా ఉంటుందో వేరు చేయగలం. మంచిఏదో చెడుఏదో చెప్పగలం. సత్ఫలితాలను ఇస్తున్నవిఏవో దుష్ఫలితాలను ఇస్తున్నవి ఏవో, అనుభవంలో తెలుసుకోగలం. మనకున్న జీవితానుభవాలద్వారా వేటికవి విడదీసి చెప్పగలం. ఇదేఆలోచనను ఇదే వివేకాన్ని మతవిధులపై' ఉత్సవాలపై తదితరములపై ప్రసరిస్తే, ఇవసలు దైవసంబంధం అవునో కాదో తెలుస్తుంది. దేవుని నిర్ణయాలెలా వుంటాయో ఎలా ఉండవో గ్రహింపగలం.

15) ఏవి వివేక రహితమో - ఏవి తృణీకరింప తగ్గవో - ఏవి అనైక్య

తకు దోహదమో - ఏవి వృథా వ్యయప్రయాసలకు కారణమో - ఏవి నిష్ప్రయోజనమో - ఏవి అనాగరికమో - ఏవి బాంధసమో, ఇట్టి ఆచరణలు ఎలా సరయినవి? కాలముయొక్క శ్రమయొక్క ఫలితాలను నిరుపయోగంచేసే, కాలమును శ్రమను నిరర్థక పరచే ఆచరణలను దేవుడు కోరునా? మన శ్రేయస్సును వాంచించే ప్రభువు, మన శ్రేయస్సుకు విఘాతం కల్గించే ఆచరణలను ఎలా ఇష్టపడగలరు?

16) వివేకయుతమైన ఆలోచన ద్వారా, తప్పుడు భావనలను తప్పుడు ప్రచారాలను అబద్ధాలను విడగొట్టి తెల్సుకోలేనంత స్థితిలో మానవ మనుగడ లేదే? తమ సమాజానికి చేసే సేవనుండి ఆనందాన్ని పొందగలగాలి. పేరుప్రఖ్యాతులు కావాలి అనుకుంటే, ఇట్టిసేవ ద్వారా పొందాలి. తమ హోదాను ఓహిర్గతి పరిచటానికి, వివిధ ఆచరణల పేరిట ఆడంబరంగా డబ్బులు ఖర్చుచేయటం అంగీకరింపలేనిది. పేరు ప్రఖ్యాతులపేరిట వృథా వ్యయం చేసే అవకాశాన్ని ఇంక ఇవ్వకూడదు.

17) ఒకరు మరొకనిని ప్రేమిస్తుంటే, అది చేష్టలలో వెల్లడవుతుంది. గౌరవిస్తున్నా అంతే. తోడ్పాటు అందిస్తే ప్రత్యక్షంగా కనిపిస్తుంది. ఒకరు మరొకరికి ఏదయినా చెప్పాలంటే, తననిర్ణయాన్ని బయటికి వెల్లడించాలి. ఒకరు మరొకరిని చూడాలంటే, ఇరువురు ఒకరి సమక్షంలో మరొకరు ఉండాలి. ఇలా మనుష్యుల మధ్య చేష్టలకు ప్రాధాన్యత వుంది.

18) మనుష్యులందరికి అవసరాల కోరికల ప్రాధాన్యత వుంది. వీటిని తీరుస్తుంటే సంతోషం పెల్లుబుకుతుంది. అపేక్షలు అభిమానాలు, తనఅనేది బంధనాలు ఉండటంవల్ల, వ్యక్తిదృష్టి ఏర్పడింది. ఇదంతా మానవులకు సంబంధించిన ప్రవర్తన. ఇట్టి ప్రవర్తనా దృష్టితోనే, దేవుని ఎడల ప్రవర్తించటం జరుగుతోంది. ఇది దేవునికి అవసరంలేదు కాబట్టి మన చేష్టలు నిరర్థకం.

19) మనం దేవునిని పూజించినా ఆరాధించినా, భావాలద్వారా జరపాలి గాని చేష్టల ద్వారాకాదు చేష్టలద్వారా వెల్లడిస్తేకాని గ్రహింపలేని, మానవుల వంటివారు కాదు దైవము. భావాల ద్వారానే దైవము తన సహకారాన్ని అందిస్తున్నారు.

20) మనస్సులో కదలాడే భావము ఏదయితే వుందో, అదంతా దేవునికి తెలిసిపోతుంది కాబట్టి, గౌరవాన్ని ప్రేమను పూజను భావాలద్వారా కొనసాగించుకుంటే చాలు. ఇందుకొరకు కాలంయొక్క శ్రమయొక్క ఫలితాలను ఖర్చుపెట్టాల్సినదిలేదు. మతవిధులను పాటిస్తూ, దేవుని అనుగ్రహాన్ని పొందగల మనుకోవడం భ్రమ. ఎందుకంటే మనుష్యులను నమ్మించినట్లు ప్రలోభ పరచినట్లు. వేటిచేను ప్రభువును నమ్మించలేరు.

21) సమిష్టి సంక్షేమంపై సహకారదృష్టి దేవునికి ఉంటుందికాని, వ్యక్తి సంక్షేమం కొరకు తోడ్పాటు అందించాలనెడి ధోంటి వుండదు. మతవిధులన్ని ఈధోంణి అనుసరించి ఉండేవి కాబట్టి అనవసరం. మన తండ్రిపై మనకుండె అపార ప్రేమను వ్యక్తీకరించు కుంటానికి, భావాలద్వారా కొనసాగించే పూజలు ఆరాధనలు చాలు.

22) అనేకులు పరుగుపందెంలో పాల్గొన్నారు. ప్రేక్షకులు తమ అభిమానులను మరింత వేగంతో పరుగిడుతూ, ముందుకురకమని ప్రేరేపిస్తుంటాడు వినోదం తిలకిస్తూ చేసే ప్రేరణకు కష్టం ఏముంది?

23) మరింత వేగాన్ని పుంజుకుంటూ పరుగెడటం ఎంతకష్టమో, పరుగెట్టేవారికి మాత్రమే తెలుస్తుంది. మరో అడుగు వెయ్యటమే భారమవుతుంటుంది. ఈ భారమంతా ఈ కష్టమంతా పరుగెట్టేవారిది. అలాగే ఇహలోక పరలోక సౌఖ్యాలకొరకు ముక్తిమోక్షంకొరకు, మతవిధులను సంప్రదాయాలను పాటించాల్సిందేనని ప్రేరేపించే మతాచార్యులు పురోహితవర్గము ఎలాంటి బరువు బాధ్యతలను మోయటంలేదు. పైగా ఇవి వారికి గౌరవ

స్థానంతో బాటు ధృతిని కలిగిస్తున్నాయి ఒకపని చేసేటప్పుడు సునాయా సంగా ఉండే పద్ధతిని అవలంభిస్తాం. జీవించడమూ అలాగేవుండాలి. అన వసరమైన బరువుతో కృంగిపోయే మనం ఆలోచించుకుని. మార్పును సాధించుకోవాలి గాని, ఈమార్పు కొరకు మతవర్గంపై ఆధార పడరాదు.

24) వేటికి సంబంధించిన సేవాసంస్థలు, వాటికి సంబంధించిన కార్య కలాపాలలో పాల్గొంటాయి. అలాగే మతానికి గల బలమయిన స్థానాన్ని నిల్పేందుకు, మతపరమైన వర్గము కృషి చేస్తుంటుంది. వీరు మతపరంగా మానవాళి ఎదుర్కొంటున్న కష్టాలకన్నా, మతభావనలను స్థిరంచేయడమే ప్రధానమని భావిస్తారు. స్వంత ఉద్దేశాలు భావనలు ఎలా వున్నా, మతపరి ధికి కట్టుబడిన వారలు కొబట్టి మతభావనలను అతిక్రమించరు.

25) తనకు అసమ్మతిగల తీర్పు ఆయినప్పటికి, న్యాయశాస్త్రగ్రంధాల ప్రకారంగా సాక్ష్యాధారాల ప్రకారంగామాత్రమే జడ్జి తీర్పును ప్రకటిస్తారు. అలాగే మతం ఆధారంగా నెలకొన్నవి. మతపరమైన సంస్థలు. అందుచే మతభావనలు స్థిరం చేస్తుంటారేగాని. మతానికి భంగకర పరిణామం తెచ్చే విధంగా ప్రవర్తించరు కొబట్టి వారి బోధనలు, ప్రకటనలు, ప్రచారము, అందుకనుకూలంగా ఉంటూ, మనలచే పాటింప జేసేవిగా ఉంటాయి. ఈ ప్రభావం మనస్సుపై పనిచేస్తుండటంచే, మతభావనలను మనము అతిక్ర మించ లేకుంటాము. ఇది గుర్తించి నిజాన్ని గ్రహించాలి.

26) గ్రామస్థులైనా పట్టణవాసులైనా తమ కష్టార్జితాన్ని, మతసంబంధ మరియు ఆడంబర కార్యకలాపాలకు ఖర్చుచేస్తుండడంవల్లలేదా ఇస్తుండటం వల్ల, ఇదంతా నిరుపయోగంగా ఖర్చవుతోంది. డబ్బును వీటికి వెచ్చించే బదులు దేశప్రగతికి వినియోగిస్తే, అదెంత ప్రయోజనకరం? ప్రయోజన కరమైన పనులుకదా, దేవుని సంతోషింప జేయగలవు. అంతరంగికమైన భక్తిప్రపత్తులు కన్నా, మత కార్యకలాపాలు ప్రాముఖ్యత గలవా? మత

# 9. జీవితము - భ్రమ

1) జీవితం యొక్క యదార్ధతను తెల్సుకోకుంటే, వాస్తవం మరుగున పడి, భ్రాంతులనే సరైన వనుకుంటాము. వృత్తులు, సంపాదన, ఆస్తులు భార్యాపిల్లలు దాంపత్యము సత్ప్రవర్తన విలువలు ధర్మము ప్రభుత్వము ఇలాంటి వాటన్నింటియొక్క యదార్ధతను ఉపయుక్తతను అర్ధంచేసుకుంటే జీవితం అంటే ఏమిటో అర్ధం అవుతుంది, జీవితం గూర్చిన అవాస్తవిక ధోరణులు, సమాజాన్ని గురించిన అశాస్త్రీయ విషయాలు, ప్రచారంలోను ఆచరణలోను ఉన్నప్పుడు, వేటిగూర్చి అయినా యదార్ధత తెలియదు.

2) అసత్యాలు, అవాస్తవికతా ధోరణులు, అశాస్త్రీయ విషయాలు వంటి వన్ని, యదార్ధతను తెలుసుకో నివ్వకుండా మరుగు పరచటంచే, వివిధ విషయాలపై మనకు తప్పుడు అవగాహన ఏర్పడుతోంది. ఈ తప్పుడు అవగాహన వలనే, జీవితంగూర్చిన సక్రమావగాహన ఏర్పడకుంది. దీని ఫలితంగా అనర్ధాలను కల్గిస్తున్న భ్రాంతులలోకి విసిరివేయ బడుతున్నాం.

3) బ్రతకటానికి బిల్డింగులు, ఫ్యాక్టరీలు భవంతులు, కార్లువంటి వాటి అవసరం లేదు. సంతోషంగా జీవించటానికి పేరుప్రఖ్యాతులు, అధిక సంపాదన, బంధువులు స్నేహితులతో పనిలేదు. దాంపత్య సౌఖ్యం కొరకు పెళ్ళితో పనిలేదు. కుటుంబ అవసరం లేదు. ప్రతివ్యక్తి పోషణ బాధ్యత ప్రభుత్వానిదే అయితే, తల్లిదండ్రులు పిల్లలు వంటి సంరక్షణతో

6) వారసత్వం అంటారుగాని, ఆ వారసులయినా వీటినేమి చేసుకుంటున్నారు? తాము మరణించేప్పుడు ఏమి జరిగిందో, తమ వారసులకు అదే జరుగుతోంది. ఈ ప్రపంచంలో ఎవరయినా వేటినయినా ఏమిచేసుకోగలరు? తమవారు తమఆస్తి అనుకుంటూ, ఆ భ్రమలోకి జారిపోతున్నారంతే.

7) ఎవరికైనా ఎంతఆస్తి కావాలి? ఎన్నెన్ని వ్యాపారాలను చేయగలరు? ఎన్నివందల ఎకరాలయినా ఏమి చేసుకుంటారు? వందలకోట్లు ఇచ్చినా, ఏం చేసుకోగలరు? ఆస్తిఅన్నది భ్రమేకాని ఇదొక అదనపుభారం. జీవితంలో తీరికలేకుండా మరణింప జేయించే విషవలయం.

8) తన అనే పిల్లలు ఒకబంధనే. పసివాళ్ళను పెంచి విద్యాబుద్ధులు గరపి యుక్తవయస్కులదాకా పెంచి పెళ్లిళ్ళుచేస్తే, ఎవరిత్రోవ వారిదే. ఎవరికోసం ఎవరెన్ని బాధ్యతలను మోసినా, స్వప్రయోజన దృష్ట్యా అంతా మరచిపోతుంటారు. ఇది అనుభవంలోదే అయినా, తనవారి కోసమని వారసత్వపు ఆస్తిఅని, ఎంతగా అదనపు భారాన్ని మోస్తున్నారో

9) తనదయిన భార్య ఒకబంధనే. రూపానికి గుణానికి ఆకర్షితమయ్యే మనస్సుకు అవరోధం వివాహం. అనుకూల వ్యక్తిత్వము అనుకూల మనఃస్తత్వము కొదవపడుంచే, ఏదోలా సర్దుబాటవక తప్పదు. ఇదంతా తనఅనేడి భార్యవల్ల, లేదా తనఅనెడి భర్తవల్లనే జీవితం అసంతృప్తితో గడుస్తోంది.

10) సంపాదన లేకపోవటం, ఉన్న సంపాదనము అధికం చేసుకొని కూడబెట్టడం, రెండువిధాల దుఃఖం కలుగుతోంది. తిండి బట్ట వసతి వైద్యం రక్షణ లేకుంటే, ఇది దుఃఖం. దీనికి సంబంధించని తన అనేటి వాటికి చెందిన , కిష్టాలు నష్టాలు సంతోషాలు అన్నిభ్రమే. అభిలాషలు కోరికలు నెరవేరటం వల్లనే తృప్తి సాధ్యమని, కలవంటి జీవితం కొరకు

తాము కల్గించుకుంటున్న ఎన్నెన్నో భ్రమల కొరకు; రాత్రింబవళ్ళు శారీరకంగా మానసికంగా ఎంతో శ్రమ పొలవుతున్నారు.

11) తన అనెడివన్నీ అనేక బంధాలు. ఇవో బలవత్తర బంధనలు. ఇది తెల్సుకోక వీటినే కోరుకుంటుంటే, ఇవి కల్గించే పరిస్థితులు ఇవివేసే భారం క్రింద వ్యధలే మిగులుతాయి. తాము కోరుకోదగ్గవేవో తెల్సుకోక, తమకు కావలసినవేవో తెల్సుకోక, అజ్ఞానంలో అనేకం కోరుకుంటూ, వాటి వలయంలోపడి జీవిస్తున్నారు. ఈ భ్రమలలోకే మతం కూడా నెట్టివేస్తూ, మత విధులను ఆచరించి వివిధాలైన పూజలు ఆరాధనలు చేసి, వీటిని పొందండని చెపుతోంది.

12) కుటుంబంలో ఒకరి తోడ్పాటును మరొకరు పొందాలన్నా – తమ పిల్లలచే తాము చెప్పినట్లు ప్రవర్తింప చేయాలన్నా – ఎదటి వ్యక్తి అభిప్రాయాలలో మార్పు తేవాలన్నా – విముఖత చెందిన వ్యక్తులమధ్య సాన్నిహిత్యం ఏర్పరచాలన్నా – స్వల్పమైన పనులయందే అనుకున్నట్లు చేయించాలన్నా – తాము అనుకున్నట్లు తాము చేయాలన్నా – తమని తాము నియంత్రించుకోవాలన్నా, ఇట్టి స్వల్ప విషయాలు కూడా సాధ్యపడకుండాను వుంటున్నాయి. పరిస్థితులు ఇలా ఉండగా, మనం కోరుకునేటి కోరికలను దేపుడైనా ఎలా నెరవేర్చగలరన్న వాస్తవాన్ని అర్థం చేసుకోనీయకుండా, మహాత్ములపై మంత్ర తంత్రాలపై మనకు ఏర్పడిన భ్రమలు ఎలాంటి కోరికలనైనా కోరుకునేట్లు చేస్తున్నాయి.

13) ఏవి సరైనవో, ఏవి కావో, ఏవి నిజమో ఏవి అబద్ధమో ననేవి స్పష్టంగా లేనప్పుడు, వ్యర్థమైన సంఘర్షణకు లోనవవలసి ఉంటుంది. ఆశించినపుడు, అందుకుతగ్గ ప్రయత్నం ఉంటుంది. వ్యర్థమైన తాపత్రయాలు వ్యర్థమైన పనులువల్ల ఆశిస్తున్నవి లభించవు. కృత్రిమ విలువలకు అసత్యాలకు అనవసరమైన బంధనాలకు తావిస్తుంటే, వ్యర్థమైన సంఘర్షణలు మానసికంగా తలెత్తుతుంటాయి.

14) వాస్తవికతను అర్థం చేసుకోకుంటే, జీవితంపై ఎన్నో భ్రమలను పెంచుకుంటాం. అందుకు ప్రయత్నిస్తాం. ఈ ప్రయత్నమంతా ఫలించనిది. ఎండమావులు కనిపించటానికి, వాస్తవంగా అక్కడ నీరు ఉండటానికి, ఎంత తేడా ఉంది? మతాచరణలద్వారా అభీష్టాలను నెరవేర్చుకోవటమనేది, ఎండమావులవంటి భ్రమ. భ్రమను వాస్తవికతను విడగొట్టి ఆలోచిస్తే, వృథా ప్రయాస లేనిపోని కష్టాలు తప్పుతాయి.

15) జీవితం ఎందుకో జీవితం ఏమిటో తెల్సుకోకుండా ఉన్నారు. మానవుల మధ్య నెలకొని ఉండాల్సిన అనుబంధాలను ఆత్మీయతలను ఎన్నో చిందర వందర పాల్జేస్తున్నాయి. మానవులు వేటికో బానిసలవు తున్నారు. ఈ ప్రభావంలో విలువలు అణగద్రొక్క వేయబడుతున్నాయి. తమకు కావలసినవి, తాము కోరుకోవలసినవి ఉన్నాయి. ఆ జీవితం నుంచి మాత్రమే తృప్తిని అనుభవించగలరు.

16) ఈ డబ్బు నుంచి, సరికాని కాంక్షసక్తుల నుంచి, భ్రమిత విలువల నుండి. జీవితాన్ని భ్రమ పాల్జేసే వాటినుంచి, విముక్తి కొరకు పోరాడండి. అందుండి మాత్రమే; నూతన ప్రపంచం, నూతన జీవితం సాధ్య పడతాయి.

17) తన అనే బంధం మరణంతో ముగిస్తుంది. బ్రతికి ఉన్నంతవరకే ఈ అనుబంధాలు. బ్రతికి ఉన్న కాలంలో వీటి అనుభూతులు వలదా? ఈ ప్రపంచంలో ఒక రూపంతోబాటు ఆ వ్యక్తిత్వము నశిస్తే, తిరిగది లేదు. అందుచే సహజీవనంలోని ఆనందంకన్నా, కోరికలు ముఖ్యం కారాదు.

18) డబ్బుకు ఇవ్వకూడని అగ్రసింహాసనాధిపత్యాన్ని ఇస్తూ, మానవ సమాజంలో ఉండాల్సిన ఆత్మీయతలను అనుబంధాలను భగ్నం చేసుకుంటు న్నారు. తన వారికన్నా, తమ తోటి వారికన్నా డబ్బే ముఖ్యమా? విలువలు కన్నా డబ్బే ముఖ్యమా? తన, తమ, తదితర బంధాలతోబాటు, మాన వత్వాన్ని పసిరికొట్టి ఈ డబ్బును ఏం జేసుకుంటారు.

19) కోరికలు పెంచుకుంటూన్నప్పుడే, తీరలేదన్న అసంతృప్తి. శరీరానికి ఏమి కావాలో అవి తీసుకుంటే, కోరేందుకైనా కోరికలు ఏమి ఉంటాయి? కోరికలు ఉంటున్నాయి అంటే, భ్రమలు వీడలేదన్నమాట. వాస్తవిక దృక్పథంతో జీవితం గూర్చి అర్థంచేసుకుంటే, కోరుకోవలసినవి ఎంతో తక్కువ.

20) భ్రమలనుండి జీవితంయొక్క యదార్థతను అర్థం చేసుకోనంత వరకు, తనసుగాని తన సమాజాన్నిగాని, ఉన్నతత్వంవైపు మరల్చుకో లేకుంటారు. ఆనందం తృప్తి వంటివి భ్రమపూరిత జీవనంలో వెదుక్కుంటూ, నిరాశా నిస్పృహలతో జీవించవలదు. జీవితానందము నిశ్చింత అనేవి, యదార్థ దృష్టిలోనే ఇమిడి ఉన్నాయి. వీటి అనుభవాలే తృప్తి. ఇట్టిదే జీవితం.

# 20. భావము - మనస్సు

1) పరస్పరం సమాచారం అందించుకోకలుగుతున్నామంటే అందుకు కారణం భాష. నూతన విషయాలను కనుక్కోవటంవల్ల భాష - భావము అభివృద్ధి అయి, అదలా వారసత్వంగా అందుతున్నది. ఏ గ్రంథంలో ఏ పేజీలో చూసినా వాక్యాలు. ప్రతి వాక్యమువల్ల భావ ప్రకటన వీలవుతోంది. ప్రతి వాక్యములోను పదాలు ఉన్నాయి. ప్రతి పదము ఒకో అర్థాన్ని ఇస్తుంది పదములన్ని అక్షరములతో ఏర్పడ్డాయి. అక్షరములే లిపి. ప్రతి భాషకు లిపి ఉంటుంది. ఈ అక్షరముల ఆధారంతోనే, భాష లోని వేర్వేరు శబ్దములు, శబ్ద సముదాయములను పలకకల్గుతున్నాం.

2) అక్షరాల కలయికను లేదా అక్షరాలను ఉచ్చరిస్తే శబ్దము వస్తుంది. అక్షరాల కలయిక పదాలు. భాషలోని పదములన్ని వేర్వేరయిన శబ్దములు. వేర్వేరయిన శబ్దములన్ని వేర్వేరయిన సంకేతాలు మనం మాట్లాడేదంతా సంకేత రూపమైన భావ ప్రకటన.

3) ప్రతి శబ్దమువల్ల ఏదో ఒక భావము వెల్లడవుతోంది. ఈ శబ్దార్థాలను నేర్చుకొట్టి భావము తెలుస్తోంది లేదా భావ ప్రకటన చేయకల్గుతున్నాం. భాష లేకుండా పదాలు లేకుండా ఏది వెల్లడించలేరు. వేటి గూర్చి ఆలోచింపలేరు. ఆలోచింపటానికి పదాలు వాటి అర్థాలు తెలిసి ఉండాలి. అప్పుడు తెలియనివాటిగూర్చి తెలుసుకుంటూ, పరోక్షజ్ఞానం పొంద వీలవుతుంది. ఈ విశ్వమునంతా పదాల అర్థంలో దర్శిస్తున్నాం. పదాల అర్థం కలిస్తే అది భావం. భావాలద్వారా ప్రతిది అవగత మవుతోంది.

4) పదాలు లేకుంటే, భావాలు లేకుంటే ఏది నేర్వలేరు. అవసరాను గుణంగా అరుపులు సంజ్ఞలు శరీర కదలికల ద్వారా పరస్పరం అర్థం చేసుకుంటూ, అందుకనుగుణంగా జంతువులవలె ప్రవర్తించాల్సి ఉంటుంది. జంతువులవలె జీవితం గడపకుండా అవగాహనను ఇస్తున్నది ఆలోచన. ఈ ఆలోచనకు స్థానము మెదడు. ఆలోచననుండి భావము దృశ్యము ఉంటున్నది. అవసరాన్నిబట్టి పనులనుబట్టి, అందుకు తగ్గ భావాలను దృశ్యాలను మెదడు అందిస్తుండటట్టి, ఆ పనులను పూర్తి చేయకల్గుతున్నాం. ఏవయినా పనులు చేయకల్గుతున్నామంటే అందుకు మూలం భావాలు.

5) భావాలే మనస్సు. భావాల స్పందనే మనస్సు. భావరహితంగా మెదడు లేదు. మెదడు సరైన స్థితిలో ఉన్నంతవరకు ఆలోచన అనే పనిని, భావోత్పత్తి అనేపనిని కొనసాగిస్తుంది. ఈ పనులు చేయలేనప్పుడు, భావాలు నశిస్తుంటాయి. జ్ఞప్తి స్ఫురణను పూర్తిగా కోల్పోతే, భావాల నశింపువల్ల భావ సమన్వయం లేక వేటిని గుర్తించలేరు. ఏపని చేయలేరు. శబ్దార్థాల ద్వారా, భావదృశ్యాల గుర్తుద్వారా, భావాల సమన్వయం జరుగుతుండబట్టి, మనస్సు ఏర్పడింది. మనస్సు అనేది ఆలోచన. మనస్సును నిర్మించుకోగల శక్తి మెదడుకు ఉండటంవల్ల, మానవుడు ఎన్నెన్నో పనులను చేయకల్గుతున్నాడు. ఇందుండే ఎన్నో అద్భుతాలు రూపొందాయి. ఆలోచననుంచి ఆలోచనను, భావమునుంచి భావమును మెదడు అందిస్తోంది. ఆలోచన గ్రహింపు జ్ఞప్తి విశ్లేషణ సమన్వయం వంటివి నిర్విరామంగా జరుగుతుండబట్టి, నిరంతర కార్యక్రమాలలో పాల్గొన కల్గుతున్నాం. ఈ అద్భుతం అంతా మెదడుది.

6) పదాల కలయిక భావం అవుతుంది. భావాల కలయికకు శక్తి ఉంటుంది. అదుపును నియంత్రణను భావాలే చేస్తుంటాయి. భావాలు భావా

లను ఖండిస్తాయి. భావాలు భావాలను ఆజ్ఞాపిస్తాయి. భావాలు భావాలను ప్రేమిస్తాయి లేదా ద్వేషిస్తాయి. భావాలలో మార్పుకు భావాలే కారణం. భావాలనుంచే పరివర్తన. భావాలనుంచే సంస్కారణ. భావాలనుంచే భావోత్పత్తి. అంతా భావనిలయం.

7) భావనలు ప్రవర్తనను రూపొందిస్తాయి. తెలిసినపుడు తెలియనపుడు ఉండే వేర్వేరయిన ప్రవర్తనకు, ఈ భావనలే కారణం. భావనలు ఆలోచింపజేస్తాయి. భావనలు పరిస్థితుల్ని సృష్టిస్తాయి. ఆ పరిస్థితులనుండి కలిగెడు భావాలు ఆందోళననో సంతోషాన్నో కల్గిస్తాయి. భావములనుంచే తృప్తి మనోస్థయిర్యము భయము వంటివి ఏర్పడుతున్నాయి. సంతోషము తృప్తి సౌఖ్యము వంటివి స్పందనానుభవాలే. భావాలలో తృప్తియే ఆనందము.

8) భావాలకున్న శక్తే మనసుకున్న శక్తి. భావనలే బంధాలు. భావాలు ఎటులాగితే మనస్సు అటు మరల్చబడుతుంది. భావాలయొక్క ఉత్కృష్టతే మానవత్వపు స్పందన. మనిషి వేటికి స్థానమిస్తాడో, వాటి అదుపులోకి పోతుంటాడు. మనస్సులో మంచి చెడుభావాలు ఉన్నా, వాటిద్వారా పనులు చేయటానికి, ప్రవర్తించటానికి కుటుంబము సమాజము ఇచ్చే అవకాశాలను బట్టి, అవి మనుష్యులను నడిపిస్తుంటాయి. మనస్సులో ఎలాంటి భావాలున్నా, అవకాశాలు లేనప్పుడు బలహీనపడిపోతాయి. వేటికి అవకాశం ఇస్తే అవి శక్తివంతమై, మనిషినా స్థితివైపు నిలిపి ఉంచుతాయి.

9) మంచి భావాలతో కూడినది మంచిశక్తి. చెడ్డభావాలతో కూడినది దుష్టశక్తి. దుష్టశక్తి చెడు అవకాశాలకై అన్వేషిస్తుంది. చెడు అనుభవాలను కోరుతుంది. చెడ్డపనులు చెడ్డ నడవడికకు కారణం దుష్టశక్తుల ప్రభావం అని అనుకుంటాముగాని, ఇదంతా మెదడులోని భావాలశక్తే. చెడ్డభావాలకున్న అవకాశాన్నిబట్టి, అవి మనుష్యులపై ప్రభావాన్ని చూపుతుంటాయి.

వహిస్తే, ప్రతికటం ఎలాగ, అన్న భయం, నియమ నిబంధనలను పాటింప జేయిస్తుంది.

14) అసమర్థత ఉన్నా, ఉద్యోగాలను వృత్తులను నిరాటంకంగా చేసుకు పోనిచ్చేడు వీలుంటే, ఎవరికి భయం అనేది ఉండదు. అవినీతి పనులు చేస్తున్నా, పట్టుబడకుండా తప్పించుకునే వీలుంటోంది అనేది, భయాన్ని తొలగిస్తుంది. శాసనాలను ఉల్లంఘిస్తున్నా శిక్షింపబడకుండా తప్పించుకునే వెసులుబాటు ఉంటే భయపడరు. భయపడటంలేదా భయపడాల్సిన పరిస్థితి లేకుండటం ఇవే, అనుకూల వ్యతిరేక పరిస్థితులను సృష్టిస్తున్నాయి.

15) భావాలు స్పందనను ప్రతిస్పందనను కల్గిస్తుంటాయి. సరైన పదాల కలయిక లేకుంటే, ఆ భావం అయిష్టతను ద్వేషాన్ని క్రోధాన్ని కలహాన్ని కల్గిస్తుంది. నడవడికతోబాటు ఉండే సరైన పదాల కలయిక, అభిమానాన్ని ఆత్మీయతను సహనాన్ని నిరీక్షణను కల్గిస్తుంది. భావం ఒక స్విచ్ వంటిది. మంచి భావాలకు ఉండే స్విచ్‌లు వేరు. ఇవి వ్యక్తికి సమాజానికి మేలు చేస్తుంటాయి

16) హావభావ వ్యక్తీకరణ ద్వారా వెల్లడవవలసిన, పరస్పర ప్రేమ గౌరవమును సైతం, శారీరకపరమైన చేష్టలద్వారా వెల్లడిస్తున్నారు. భార్యాభర్తలకయినా సమయం సందర్భం ఉండాలి. బాల్యం యౌవ్వనం వార్ధక్యం వేరు. శరీరం పెరుగుదలనుబట్టి ముద్దాడటం కౌగిలింపు వంటివి, కొందరి మధ్య అనంగీకారము. హావ భావాలకున్న శక్తిని మరచి, స్పందన ప్రతిస్పందనను చేష్టలద్వారా పొందటం సరికాదు.

17) పిల్లలు పెద్దలు అందరూ భాషలో చేరిన అసభ్య చెడుపదజాలాన్ని, నోటివెంట వెడలకుండా నిరోధించుకోవాలి ఏ పదానికి ఎలాంటి అర్థమో, ఏ పదాలను వాడితే ఎలా స్పందిస్తారో, తెలుసుకొని మాట్లాడాలి. ఏదోలా మాట్లాడుతుంటే సరికాని పదాలు దొర్లుతుంటాయి. ఒకరు ఉపయోగించే

పదాలు, వ్యక్తిత్వం యొక్క అంచనాకు తోడ్పడతాయి. పదాలకున్న భావాలకున్న శక్తిని గమనించి వాడుకుంటే విభేదాలు తగ్గుతాయి. లేనిపోని కష్టాలు చికాకులు జీవితంలో రాకుండా ఉండాలన్నా, పదాల భావాల ప్రయోగానికి ప్రాముఖ్యత ఉంది.

18) భావాలే ప్రేరణ చేస్తుంటాయి. భావాలే భావాలను స్ఫురింప చేస్తుంటాయి. సంఘర్షణ నుంచి మరియు పరిస్థితి నుంచి భావము జనిస్తుంది. ఇదంతా అందరిలో సాధారంగా జరిగే ప్రక్రియ. స్పందింప చేసేవారు ప్రతి స్పందన పొందేవారు ఎల్లప్పుడూ ఉంటారు. అనుక్షణము జరిగేదిది. ఒక సమాజాన్ని ఎలాంటి స్పందనాను భవాలలోకి కొనిపోవచ్చో కొనిపోకూడదో, పర్యవేక్షించు కోవటం పౌరుల బాధ్యత.

19) మనిషి కొబట్టి జీవించటానికి అనువుగా మనస్సును సిద్ధం చేసుకుంటున్నాడు ఫ్యాక్టరీని ఏలా నిర్మించుకుంటున్నాడో, అలాగే మనస్సును ఏర్పరచు కుంటున్నాడు. పొలాలలో పంటలను ఎలా ఉత్పత్తి చేసుకుంటు న్నాడో, అలాగే భావాలను ఉత్పత్తి చేసుకుంటున్నాడు. పరిమళాలతో గుబాళించే పూలవంటి స్వచ్ఛమైన నీరువంటి విషయజ్ఞానాన్ని, ప్రతిమనిషి తన మస్తిష్కంలో నింపుకున్నప్పుడు, సక్రమ మనోస్థితితో కూడిన మనస్సు ఏర్పడి వుంటుంది.

20) మనకు ఎలాంటి మనస్సు కావాలో, అట్టి మనస్సును నిర్మించుకునే శక్తి, సమాజము మనిషి అధీనమై ఉంది. నిగ్రహం, నిరోధం ద్వారా తన మనస్సుపై తన అదుపు ఉండాలి. తన మనస్సు ధర్మం యొక్క కర్తవ్యం యొక్క అధీనం చేయాలి. తనది అయిన మనస్సుపై తన ప్రభావం ఉండాలి.

21) విత్తును బట్టి మొక్కగాని వృక్షంగాని పెంపొందుతుంది విత్తులలోని రకాలను బట్టి, వైవిధ్యంగల రకాలన్ని పెరిగి, పుష్పిస్తూ ఫలోత్ప

త్తిని ఇస్తుంటాయి. భావాలు విత్తులు వంటివి. భావాలకు ముడిపదార్థాలు విత్తులు. ఈమనస్సుకు ముడిపదార్థాలు భావాలు. మంచి చెడులకు సంబంధించిన ఆలోచన, ఆయా సమాజాలలో లభించే ముడిపదార్థాల నుండే-మనుష్యుల మేథస్సు గ్రహిస్తూ వికసిస్తూ ఉంటుంది. అందుచే అవి ఎలాంటి ముడిపదార్థాలో అన్నది చాలా ముఖ్యం.

22) భావాలనుంచి ఉత్పత్తి అయినట్టిదే ఈ సమాజము. సమాజంలోని పరిశ్రమలు వ్యవసాయం భవంతులు తదితర ఉత్పత్తులు అన్నియు. భావాల నుంచే ఉత్పత్తి అయ్యాయి. ఈ భావాలకు మూలం పదార్థ ధర్మాలు పదార్థాలకున్న ధర్మాలు లక్షణాల నుంచే, భావాలు, అందుండే పరిశ్రమలు తదితర ఉత్పత్తులు సృష్టింపబడ్డాయి. దీనికి సంబంధించిన భావాలే సమాజము. ఈభావాలే నేను.

23) వేర్వేరు మాతృభాషలు కలవారిని ఒకచోట వుంచితే, వారిని సంభాషించు కునేట్లు దేవుడుకాని, జీవుడుకాని చేయలేరు. వారు మాట్లాడుకోవలె నంటే, ఏదోఒక భాషాపదజాలాన్ని అందరూ నేర్వాలి. ఇలా నేర్వనంతకాలం పరస్పరం మాట్లాడుకోలేరు. వారిని మాట్లాడింప జేసేశక్తి వేరెవరిదోకాక మెదడుపై ఉంది. భాష వచ్చినా చదవటం వ్రాయటం నేర్వనపుడు, తనపేరును తాను వ్రాసుకోలేడు. తనపేరు వ్రాసివుంచితే దానిని తెల్సుకోలేడు. అసభ్య పదజాలాన్ని పిల్లలు నేర్చితే, అఅసభ్య పదజాలంతోనె మాట్లాడుతుంటారు. యాసభాష నేర్చితే యాసగానే మాట్లాడగలరు భిన్నభాషలు నేర్చినపుడు భిన్నభాషలలో మాట్లాడ కల్గుతున్నారు ఒకరి భాష మరొకరికి తెలియకుంటే, పరస్పరం మాట్లాడుకోలేరు.

24) నేర్చిన దానినిబట్టి మాట్లాడుతున్నారు. పనులు చేస్తున్నారు. నేర్వకుంటే మాట్లాడలేరు. పనులు చేయలేరు. అంటే అంతా నేర్వటం, నేర్వకపోవటంపై ఆధారపడి ఉంది. ఏది తెలియాలన్నా పద అర్థ భావ దృశ్యా

లను మెదడులో ప్రవేశ పెట్టుకున్నప్పుడే, ఏదయినా సాధ్యపడుతోంది. ఇలా లేకుంటే జంతువు ఎంతో మనిషి అంతే.

25) శరీర యంత్రాంగాలను పని చేయిస్తున్నది మెదడు. నేర్చిన రీతిలో తగువిధంగా, భావదృశ్యాలను అందిస్తున్నది మెదడు. నేను అనేది ప్రత్యేకంగా జీవుడి రూపంలోలేదు. గాఢనిద్రలో ఏమి తెలుస్తోంది? ఆలోచనను ఆపివేసినా అంతే. ఆలోచిస్తుంటేనే, తను తన పరిసరాలు జ్ఞప్తికి వస్తున్నాయి. ఆలోచిస్తుంటేనే జీవిత అనుబంధాన్ని అనుభవిస్తున్నాం.

26) ఆలోచన అనెడి పనిని ఆపివేస్తే, మనస్సు నిలచిపోతుంది. ఆలోచన మెదడుది కాకపోతే, ఆలోచనను ఆపలేరు. ఆలోచనకు జీవుడికి- భావాలకు జీవుడికి- జ్ఞప్తి స్ఫురణకు జీవుడికి- ప్రతిభా సామర్థ్యాలకు జీవుడికి, ఎలాంటి సంబంధం ఉండటం లేదనేది అనుభవంతో అందరికి తెలుస్తున్న విషయం. కాబట్టి జీవుడు ఉన్నా లేకున్నా ఒకటే. అందుచే శరీరమునే నేను. మనస్సు అనేది భావాలే.

# 2̂. తన - పర

1) తన అనేది అభిమానం ప్రపంచ వ్యాప్తంగా ఉంది. తన అనేది అభి మానాన్ని ప్రభుత్వాలు పోషిస్తున్నాయి. అభిమాన దురభిమానాలకు అతీత దృష్టిని అలవరచు కోనందుచే, తన పర అనెడి బేధభావాలు పెరుగుతు న్నాయి. తాను నమ్మిన సిద్ధాంతం అయితే తన అవుతుంది తాను నమ్మని సిద్ధాంతం అయితే పర అవుతుంది. అభిమానించిన వాటియందు ఇష్టత ఉంటుంది. ప్రజలు అభిమానించే విషయాలలో వైరుధ్యం లేకుంటే, స్వభా వాలలో సారూప్యత ఉంటుంది.

2) తన పర అనెడి తత్వం మతాలలో వుండటంచే, తన పర తత్వం మనుష్యులకు అలవడింది. తన పర అనెడి తత్వం ఎన్నో దారుణ వ్యధ లకు కారణమయ్యింది. దేవుడు జీవుడు తదితర విషయాలకు సంబంధిం చిన ఈ తత్వాలు, భిన్నమతాలయిన తన పర అనెడి బేధభావాలను రగిల్చి పరస్పర వ్యధలకు కారణ మయ్యాయి. నేటికి కారణమవుతున్నాయి. తన పర అనెడి బేధభావాలు మతాలలో ఉన్నంతకాలం, భిన్నమతస్థుల మధ్య వాటి శాఖలమధ్య, సంఘర్షణలు అనివార్యమవుతాయి. తన పర బేధభావాలు ఏర్పడకుండా ఉండాలంటే, సిద్ధాంతాలతో మత సూత్రాలలో భిన్నత్వం ఉండకూడదు.

3) దేశదేశాలంతటా మతప్రచారకులు ఎంతో ప్రచారాన్ని కావిస్తున్నారు.

ప్రజలను అజ్ఞానంలోకి నెట్టుతూ వృథా వ్యయప్రయాసల పాల్జేస్తూ, తాము వృథాప్రయాస పాలవుతున్నారు. దీనికంతా కారణం తన పర మతదృష్టి. మతవ్యాప్తి మరియు మత సంఘర్షణలు ఉంటున్నాయంటే, తన పర మత భావమే కారణం. తనది పరులది ఒకే మతభావన అయినపుడు, మతవ్యాప్తి మరియు మతసంబంధ ఘర్షణలకు తావుండదుకదా: ఒక మతస్థులుగా కాక తమ దేశస్థులుగా జీవించటానికి, అందరు సంసిద్ధత వెలిబుచ్చ కలగాలి.

4) స్వర్గనరకాలు-పాపపుణ్యాలు-జీవుణ్ని అనేది అర్ధరహితమైన నమ్మిక. ఇదో భావన. ఈ భావానికున్న శక్తి అర్ధరహితమయిన పనులను చేయి స్తోంది. బ్రతికి ఉండగా భార్యాపిల్లలపై లేని ఆపేక్ష, తల్లిదండ్రులపై లేని ఆపేక్ష జీవునిపై వుంటోంది. తన అనేటి భావానికున్న శక్తి అలాంటిది. జీవుడి నే నేను అనేది నమ్మికవల్ల, జీవుడికి స్వర్గంకొరకు పాపప్రక్షాళన కొరకు పుణ్యాలకొరకు ఎన్నోప్రయాసలకు లోనవకల్గుతున్నారు. ఇదంతా తాను అని అనుకోవడంవల్ల జరుగుతున్నది.

5) జీవుడువేరు. తానుకాదు, తనదిలేదు అని అనుకుంటే; స్వర్గనరకాల గూర్చి, పాపంనుండి విముక్తి కొరకు పడే తాపత్రయం, ఏదీ వుండేదికాదు. ఇదంతా తన-పర అన్న ఒక్కతేడా. ఈతేడా మేధస్సుపై ఎలాంటి ప్రభా వము చూపిందో? ఎంత వ్యయప్రయాసల పాల్జేస్తోందో?

6) తన పర అనేడి తత్వమే స్వార్ధానికి వంచనకు కారణం. తన అనేటి దానినుండి మన అనేడి కుటుంబం వరకే, మనిషి పరిమితమై ఆలోచిస్తూ కృషి చేస్తున్నాడు. దీనివల్ల నిరంతర తాపత్రయాలలో చిక్కుకుని బందీ అవుతున్నాడు తాను వేరు సమాజం వేరు అనుకున్నప్పుడు, సమాజం గూర్చిన బాగోగులు సంబంధం లేనట్టివిగా అగుపిస్తాయి. తన దేశ సంప దలు ఏమయిపోతున్నా, తనకెందుకులే అని అనుకుంటానికి, తన పర

అనేది తత్వమే కారణం. తనదైతేనే తనకు శ్రద్ధాసక్తులు. పర సంబంధ మంతా ఎటుపోతే, తనకేమిటి అని భావిస్తున్నాడు.

7) తనకు కావాలి అనుకున్నప్పుడే సంఘర్షణ. ఈ కావాలి అనేది ఆసి విషయంలో అయితే? ఎంతవున్నా తృప్తి పడలేరు. నిరంతరం పోటీలోకి వురుకుతూ, ఇంకా ఇంకా సంపాదించాలనేది తాపత్రయం నుండి విడివడ లేరు. ఈకావాలి అనేది కోరికల విషయంలో అయితే, అనుభవించటానికి జీవితంలో తీరిక లేకున్నా, ఇంకా కోరుతూనే వుంటారు. అవసరం లేదు కోరనవసరం లేదు, అయినట్టి స్థితిలోనే సంతృప్తి పొందగలరు. లేకుంటే కోరికలు అపరిమితమై, స్వార్థపరత్వంలోకి వంచనలోకి నెట్టుతాయి.

8) తనకి చెందాలి తనవి అవ్వాలి అనేది మానవ సహజాభిలాష. ఈ అభిలాషకు అతీతంగా నియంత్రించటం కష్టం కాబట్టి, తన అనేది పరిధికి పరిమితులను విధిస్తూ, ఈ పరిమితత్వం నుండి నిర్వహణా సౌలభ్యాన్ని పొందుతుండాలి. ప్రయత్నం కృషి ఫలితం తమకి చెందనపుడు, పనులను చేయరు పట్టించుకోరు.

9) అవసరం లేనప్పుడు కోరరు. అందుకొరకు పోటీకాని సంఘర్షణకాని ఉండదు. అవసరాలకు కోరికలకు పరిమితులు లేనందువల్ల, స్వార్థము వంచన పెరిగింది. వ్యక్తిగత అవసరాలను కోరికలను పెంచుకుని, తన అనేది తత్వానికి బందీ అయ్యారు. మన అనేది ఆలోచనా దృక్పథంవైపు మరల్చాలంటే, పరిమితి ప్రాధాన్యత ఉంది. మనుష్యులు పెంచుకునేది అవసరాలు కోరికలకు అనుగుణంగా, అవకాశం ఇవ్వనపుడు, కోరటం ఉండదు; దీనిచే పైవాటి కొరకు పోటీపడటం ప్రయత్నించటం లేనందుచే వంచన స్వార్థము సంఘర్షణ నివారింప బడతాయి. ఉత్పత్తుల కొరత, అవసరాలు తీరకపోవటం వంటివాటి వల్ల, తమకోసం పడే ఆరాటంలో, మనఅనేది దృష్టి నశిస్తుంది. పరిమిత కుటుంబం పరిమిత జనాభా సాధ్య పరచుకుంటే, మనఅనేది స్వభావానికి త్రోవ ఏర్పడుతుంది.

14) ప్రపంచ వ్యాప్తంగా శాంతి సామరస్యాలు నెలకొనాలంటే, మన అనేది దృష్టి సాధ్యపడాలి. కాబట్టి ఇందు కనుగుణమయిన విధానాలు సిద్ధాంతాలు ఏమిటో వాటిని సాధ్యపరచటం, ప్రతిఒక్కరి ధర్మం. సరైన సిద్ధాంతాలు, సరయిన సూత్రీకరణలు, సరయిన పద్ధతులు వంటివి మనవి అవుతాయి. నిత్య జీవితంలో నిత్యవ్యవహారాలలో, ఈ సరైన వాటికి ప్రాధాన్యత ఇస్తే బేధభావ దృష్టి నశిస్తుంది.

15) తన పర అనేది తత్వ ఏ పరిధి వరకయితే ఉండతగునో, వేటికి అవసరమో, వాటికి మాత్రం పరిమితం చేయాలి. లేకుంటే ఇది మానవా ళిని అవిశ్రాంతి పాల్జేస్తుంది. పరలేకుండా తనుఅనేదిలేదు. తన పర ఇదంతా పరస్పర ఆధారం. ఈ తన పర అనేది వేర్వేరన్న భ్రాంతిని వదలి ఒకే శరీరం వంటిదిగా గుర్తించాలి. తన శరీరానికి దెబ్బ ఎక్కడతగిలినా దాని దుష్ఫలితం తప్పదు.

అందరు వేయకలరుగాని, సమాధానాలను అందరు పొందలేరు. కాబట్టి మత భావనలకు స్థానంతోపాటు మతాచరణలకు ప్రాముఖ్యత నిలచింది.

4) కొందరి అధర్మంవల్ల అన్యాయంవల్ల, మరికొంత ప్రజానీకం వ్యధల పాలవుతుంది. దుర్మార్గతగల వారిని తామేమి చేయలేకపోవటం, వీరు శిక్షలు పడకుండా తప్పించుకోవటం అసంతృప్తిని కల్గిస్తుంది. ఎవరు చేసిన పాపాలకు వారు శిక్షలు నరక యాతనలు పడకుండా, తప్పించుకోలేరన్న మత నమ్మిక, ప్రజలకు ఆమోదమైనట్టిది. అందుచే పరలోక భావనకు బలం చేకూరింది. దుష్టశిక్షణ శిష్టరక్షణ అనేది మతాభిప్రాయం, అంగీకారమైనది. అందుచే స్వర్గ నరకాలు ఇహలోక బాధలు నమ్మతగ్గవి అయ్యాయి.

5) మంచివారికి చెడ్డవారికి సయితం కష్టాలు సుఖాలు ఉంటున్నాయి. దుర్మార్గతగల వారనుభవించే కష్టాలకయితే, వారి పాపాలకు అది ఫలితం అంటారు. ఎవరికయినా మంచి అధిక ఫలితాలు సమకూరుతుంటే, దైవానుగ్రహం అని భావిస్తుంటారు. ఇలాంటి అభిప్రాయాదులవల్ల పాప పుణ్యాలకు ఫలితాలు ఉంటున్నాయన్న మత భావన స్థిరమై నిలవ కల్గింది.

6) తామూహించని సంఘటనలవల్ల, తామూహింపలేని కష్టాలు నష్టాలు వస్తుండటంవల్ల, తాము ఆశించిన విధంగా ఫలితాలను రాబట్టుకోనందువల్ల, పరిస్థితులకు అనుగుణంగా నిర్ణయాలను గైకొనటంతోబాటు జీవితాన్ని మరల్చుకోవలసి రావటంవల్ల, అంతా దైవధీనం అనిపిస్తుంది సౌకర్యాలు సదుపాయాలు వంటివి క్రమేపి ఏర్పడుతుండటంవల్ల. కొందరికి లభ్యపడుతూ మరికొందరికి లభ్యపడవు. ఇలా జరగటము మత భావనలకు బలాన్ని చేకూర్చుతుంది.

7) సవ్యమైన పరిపాలనను విడిచిపెట్టిన ప్రభుత్వాలవల్ల, సక్రమ జీవన విధానాన్ని పాటించలేని మనుష్యులువల్ల, సక్రమ నిర్వహణలు లోపించినందువల్ల, అంతా అదుపు తప్పింది. ఇలా అదుపు తప్పిన పరిస్థితులకు

భార్య ప్రభావం భర్తపై, భర్తప్రభావం భార్యపై ఉంటోంది కాబట్టి, అది నమ్మకంగాక వాస్తవం అని అంటాము. ఇలాంటివేవి మానవశరీరంపై జీవునికి ఉన్నట్లు ఎలాంటి సాక్ష్యాధారాలులేవు. జీవుని ప్రభావం ఉంటే, ఉంది అనేది స్పష్టపడేది. ఇదిలేదు. అధికారము ఆజ్ఞాపన నియంత్రణ సహకారము వంటివి జీవుడు చేయటంలేదు కాబట్టి, మనల్ని నడిపించుట లేదు.

12) సమాజం అంటే ఏమిటో - జీవితం అంటే ఏమిటో - పరిస్థితుల ప్రభావం మనస్సుపై ఎలా పనిచేస్తుందో, ఈ పరిస్థితులనేవి వేటివల్ల ఉత్పన్నమవుతున్నాయో-మంచీ చెడులకు ఏవి కారణాలో-మనస్సు అంటే ఏమిటో, మనకుతెల్సు. భావాలకున్న ప్రభావం ప్రత్యక్షంగా కనిపిస్తోంది కాబట్టి, భయం నమ్మకంవంటి భావాలకున్న శక్తి మనస్సుపై ఎలా పని చేస్తుందో తెల్సు. అసమానతలకు కారణాలు తెల్సు. ఈ ఆస్తులు అంతస్తులు భ్రమ అనితెల్సు. ఈ విషయాలవల్ల మన ఆలోచనలకు నిర్ణయాలకు ప్రవర్తనకు భవిష్యత్తుకు, దైవము జీవుడు కారణంగా లేరని తెలుస్తుంది.

13) మనుష్యులుచేసే అనేకానేక పనులపై దేవుని ప్రమేయములేదు. మనుష్యులను నియంత్రించేవి ఎన్నో ఉన్నాయి. వాటిచే నియంత్రించబడుతున్నారుగాని జీవుళ్ళవల్ల, గ్రహగతులవల్లకాదు. దేవుని తోడ్పాటు సహకారము మానవాళికి ఎలా అందుతున్నదో తెల్సు. సమాజము జీవితము మనుష్యుల అధీనమై ఉందనేది విషయాన్ని, మన అనుభవాలే నిర్ధారిస్తాయి.

14) వాస్తవం పైవలె ఉండగా, మతాలు మనల్ని అసత్య ధోరణిపైపు మళ్ళించాయి. అనవగాహనవల్ల ఈ అసత్య ధోరణులకు స్థానం ఇవ్వకలిగాము. పాతనమ్మికలు కొనసాగించుకుంటానికి వాటిల్లో నిజంలేదని, మన అవగాహన అనుభవాలే మనకు సాక్ష్యము. యథార్థతను తెలియజెప్పగల

విపై ఉండగా. వీటినికాదని ఎలా అనగలరు? ఇది వాస్తవం కాదంటే, ప్రత్యక్ష నిర్ధారణకు జీవితము సమాజము మనముందు ఉంది.

15) దేవుడు జీవుడు వేరుకాదని. వేర్వేరని-శరీరంలో దైవాంశ ఉందని, లేదని-శరీరంలో జీవుడు ఉన్నాడని, లేదని- పునర్జన్మ ఉందని, లేదని-పర లోకం ఉందని, లేదని-ఇలా నమ్మటం ఆధారంగా మత విశ్వాసాలు ఆచ రణలు రూపొందాయి. ఒక మనిషి అంతరంగంగూర్చి ఎదటివానికి తెలియ కున్నది. అలాంటప్పుడు దేవుడు జీవుడు క్షుద్రశక్తుల గూర్చి, యెన్నెన్ని విషయాలు ప్రచారంలోఉన్నా, అవి యథార్థతను తెలపవు. దైవముంటే విశ్వసృష్టిని కావించారని అనుకోనేల? జీవుడుఉన్నా కర్మ పునర్జన్మ స్వర్గ నరకాలు ఉండాలనే దేముంది? జీవుడుంటే మాత్రం, జీవుడినే తాననుకో నేల? పరలోకం ఉన్నా, పాప పుణ్యాలాధారంగా స్వర్గనరకాలను ఏల నమ్మాలి? మతాలు మతగ్రంథాలు ఉన్నంతమాత్రాన, వీటికి దైవానికి సంబంధం ఉన్నదని ఎందుకునమ్మాలి? మతం మతగ్రంథాలు ఉంటే ఉంటాయి. మతభావనలను యథార్థాలుగా భావించటం ఎందుకు? మతాను గుణ అనుసరణలు పట్టుదలలు ఎందుకు?

# 23. మానవత్వం

1) జీవించినంతకాలం ఇతరులెవరికి కీడు తలపెట్టని విధంగా, మనుగడ సాగించెదనన్న దృఢసంకల్పమే మానవత్వం. 2. తాను కష్టాలకు నష్టాలకు ఎలా బాధావేదనలు పొందుతాడో, అట్టికష్టాలను తానితరులకు కల్గిస్తే, తనవలెనె ఎదటివారు బాధావేదనలు పొందుతారనెడి స్పృహతో, తానితరులను కష్టనష్టాల పాల్జేయకుండా ప్రవర్తించుటే మానవత్వం. 3. తానెంతో తనతోటివారు అంతే. తాను భరించలేని కష్టాన్ని, తాను భరించలేని నష్టాన్ని తోటివారు భరించలేరు. అందుచే కష్టాలు నష్టాలు లేనట్టి సమాజాన్ని స్థాపించే విధానాలను అంగీకరించి, అమలుచేయించెడి ప్రభుత్వానికి, తోడ్పడటమే మానవత్వం. 4. తన సంపాదనను భోగలాలసతకొరకు కాకుండా, ఉత్పాదకతకు ఉపయోగించే పథకాలకు పెట్టుబడిగా తరలించుట మానవత్వం.

2) ఒకనికున్న హక్కులను అవకాశాలను భగ్నపరచుట - బానిసలుగా చూచుట-వెట్టిచాకిరీ చేయించుట - తనను నమ్మినవారిని మోసగించుట - అజ్ఞానం తెలివితక్కువ ఆధారంగా వంచించుట - అమర్యాద అవమానము ఆవహేళన చేయుట - హింస దౌర్జన్యం పగ ప్రతీకారంతో వ్యధల పాల్జేయుట-తమ విధులను నిర్వర్తించకపోవుట, వంటివన్ని మానవత్వం లోపించిన పనులు.

3) పరస్పర అభిమానం ఆదరణ, పరస్పర ప్రేమ ఆత్మీయత, కుటుంబ సభ్యులలోనే నశిస్తున్నప్పుడు, తోటివారిని ప్రేమించటంగాని, ఈ విశాల ప్రపంచంలోని మానవులను సహోదర భావంతో అభిమానించటంగాని సాధ్యపడదు. ప్రేమించటమెంత సహజమో, ద్వేషించటమంటే సహజము. ఒకరు మరొకర్ని ద్వేషింపజేసే పరిస్థితులున్నంతకాలం, ఎవరికివారే అవు తారు. బోధనలచే నీతులచే ఈ సమాజాన్ని సరిదిద్దలేము.

4) ద్రోహాలకు నీచులకు వంచనాపరులకు అవినీతి పరులకు, మాతో కలసి జీవించేహక్కు లేదని ఎలుగెత్తిచాటండి. శత్రువులతో సహజీవనం చేస్తూ, కష్టాలను భరించాల్సిన అగత్యం మాకులేదని చాటండి. తామందరి శ్రేయస్సుకు అవరోధంగా ఆటంకంగా ఉన్నవాటిని, వీరోచితంగా ఎదు ర్కొంటామని, శత్రుత్వ వైఖరిని అవలంభిస్తామని ప్రకటించండి. ఆనాడే, మానవత్వపు దృష్టిని పెంపొందించుకున్నా లేకున్నా, ఎవరివల్ల ఎవరికి కీడుజరగదు. ఒకవికున్న మానవతాదృష్టి ఆధారంగా, ఇతరులకు మేలుజరిగే స్థితి ఉండరానిది. మంచీ చెడులను రెండూ చేయకలిగే అవ కాశం మనిషికి ఉండరాదు. ఎప్పుడైతే చెడుచేసే అవకాశం ఉందో, అప్పుడే అక్కడ మానవత్వం నశిస్తుందన్నమాట. ఒక మనిషి మరో మనిషికి కీడుచేసేట్టి అవకాశమే లేకుంటే, ఒకనిలో మానవత్వం ఉందా లేదా అన్న ప్రసక్తి తలెత్తదు.

5) సర్వుల రక్షణ సంరక్షణ కొరకు ఏర్పడినట్టిదే సమాజం. ఒకరి దయాదాక్షిణ్యాలమీద, ఒకరి దానధర్మాలమీద బ్రతకవలసిన పరిస్థితి ఎవరికి లేదు. రైతులు వ్యాపారులు వృత్తిదారులు ఉద్యోగులు శ్రామికులు పాం కులు కుటుంబ యజమానులు, ఎవరయినాసరే ఎవరి కర్తవ్యాన్ని వారు నిర్వర్తించవలె. ఎవరి విధులనువారు సక్రమంగా పాటించవలె. డబ్బు హోదా అధికారముకన్నా ద్రోహము అక్రమము అధర్మముకన్నా, సరికాని కోర్కెలుకన్నా, మానవత్వపు స్పందన మనకు అవసరం. మానవత్వపు

విలువలను హరించి వేసేవారు, హరించి వేసేవి, మన ఉమ్మడి శత్రు వులు. మానవత్వం కొరకు మనోశిక్షణను ప్రతి ఒక్కరు ఒసంగుకోక తప్పదు.

6) ఒకరు మరొకర్ని, ఒకదేశం మరొకదేశాన్ని దోపిడి చేయటాన్ని అంగీకరింపని స్థితికి మానవసమాజం ఎదగడమే మానవత్వం. తను ఇత రులు ఎవరయినా ఒకటే. తమకొక న్యాయము, ఎదుటి వారికి వేరొక న్యాయము వుండరానిది. తమ సమకాలీన సమాజానికే కాకుండా, భవిష్య త్తరాల పౌరుల రక్షణకు సైతం, నేటివారు ప్రతిభులు. ఈ ప్రపంచంలో నీతి నిజాయితి రక్షణ సంరక్షణ యొక్క స్థాపన ఏకొందరి బాధ్యలో కాక మానవాళి బాధ్యతయి ఉంది.

7) దేశంలో ఒకపౌరునికి ఎలాంటి హక్కులు ఇవ్వబడ్డాయో, అలాంటి హక్కులే మిగతా పౌరులందరికి ఉంటాయి. వర్గం వేరయినా వర్ణం వేర యినా, కులం వేరయినా, మతం వేరయినా, మనుష్యులందరి ప్రాథమిక అవసరాలు ఎక్కడైనా, ఎవరికయినా ఒక్కటే. శరీర నిర్మాణంలో ఆకృ తిలో ఒకేవిధంగా వుండబట్టి, మనుష్యులను జంతువులను విడదీసి నట్లుగా మనుష్యులను విడగొట్టలేరు. మానవులందరూ ఒక్కటే నని యే కాకుండా మానవులందరిపై సమదృష్టి సమభావంతో నే, పరిపాలన సాగించ వలెన న్నది న్యాయసూత్రం.

8) దేశంపై, దేశ సంపదలపై ప్రతిఒక్కరికి, సమానహక్కు సమాన బాధ్యత ఉన్నప్పుడు, దేశము పరిపాలన అందరికి సంబంధించినది. తమ దేశంలో తాము అంగీకరించిన పరిపాలనలో, తమను వివక్షకు గురిచేయ డాన్ని ఎవరూ అంగీకరించరు. బలహీనుల్ని బలవంతంగా అణచివేయ టాన్ని, తోటి ప్రజానీకం చూస్తూ మౌనం వహించదు. తమ పిల్లలను తామేదయినా చేయటానికి తల్లిదండ్రులకు ఎలా హక్కులేదో, అలాగే పాలకులకు తమదేశ ప్రజలను తమకు తోచినట్లు పాలిస్తామనేది హక్కు

లేదు. న్యాయసూత్రాలు ఆధారంగా పరిపాలించకుంటే, తోటి దేశస్థులు బొమ్మలలా చూస్తూ వూరుకోరు.

9) శాసన నియంత్రణ ఆదేదయినా మానవత్వాన్ని నెలకొల్పే దవ్వాలి కాని. అజ్ఞానాన్ని, అంధకారాన్ని, మోసాన్ని నిల్పేది కారాదు. పరిశీలన పరిశోధనను ఎదుర్కో కల్గినదే మతం. మత అజ్ఞానాన్ని మన గుండెలలో దాయవలసింది లేదు. అజ్ఞానం మన ప్రథమ శత్రువు. వేటిల్లో అజ్ఞానం ఉందో, వాటిపై దండెత్తి ఆ అజ్ఞానాన్ని బహిర్గత పరచాలికాని, దానికి రక్షణ కవచాలుగా మనం వుండరాదు. ఏది అజ్ఞానమో ఏది వివేకయుతమో మానవులకు తెలుస్తోందే! మానవులకు తెలిసే ఈపాటి, దేవునికి తెలియ నిదా? మతం దైవప్రబోధమో మానవ ప్రబోధమో తెల్సుకోలేనంతటిదా?

10) మనకు వుండవలసినది మతదృష్టి కాదు, మానవతా దృష్టి. మనం నిల్పుకోవలసినది సనాతన దృష్టితోకూడిన మతాలనుకాదు. నూతన భావముతో కూడినమతం, మతదృష్టి మాత్రమే మనకు ఏర్పడాలి. బ్రతకటానికి సంపాదనకు అధికారానికి మతం వుపయోగ పడుతుందని. ఎప్పటి నుండి గుర్తించారో, ఆనాటినుండి కొందరిలో మానవత్వం నశించింది. వ్యాపారం వృత్తికివలె మతాన్ని ఉపయోగించుకోవటం వల్ల, మత అజ్ఞానంతో బాటు కష్టాలు ప్రాప్తించాయి.

11) ఫలానా కులస్థుడు ఫలానా మతస్థుడు అన్న ముద్రను దేవుడు వేయ లేదు. మనిషే మరభిమానానికి లోనై, తనకులం తనమతం అంటూ, తన బిడ్డలకు అంటగడుతున్నాడు. ఒకరు ఏకులంలోకి మారినా, ఏ మతం లోకి మారినా దేవుడొక్కడే. కులాలతో బాటు మతాలతో బాటు దేవుడు మారటంలేదు. కులాలవారి మతాలవారి దేవుళ్ళు లేనప్పుడు, ఈ కులాలు మతాలు మనకేల? కులాలకు మతాలకు దేవునికి సంబంధం లేనప్పుడు, మనల్ని కష్టాల పాల్జేస్తున్న మతాలను మతవిధులను ఏల విడనాడలే

కున్నాం? కులం మారినా మతంమారినా, కులమతాలను కాపాడకున్నా, మానవుల్ని పీడించే సమస్యలను పరిష్కరించే శక్తి, ఏమాత్రము వాటికి లేదు. వాటిని సృష్టించుకొని, వాటి కబంధహస్తాలలో చిక్కుకొని, అలసట ఆవేదనను అనుభవిస్తుండడం కన్నా, మనకు ఒరిగేదేముంది?

12) జాతి భాష మతతత్వం, కుల వర్ణ వర్గ తత్వం, ప్రాంతీయత అసమానత వివక్షత వంటివి, మానవులు సృష్టించుకున్నవి కాని, దేవుడు ఏర్పరచినవి కావు. దురభిమానాల మౌఢ్యంలో కూరుకొని, స్వార్థపరుల కుటిలత్వాన్ని పండితులమని చెప్పుకునేవారి అజ్ఞానాన్ని తెలుసుకోకున్నాము.

13) మనకు కావలసినవి శాంతిసౌఖ్యాలు కాని, గతంకాదు. మానవుల మధ్య అడ్డుగోడలలు విభేధాలకు కారణమయ్యే వాటిని, ఎక్కడయినా, ఎవరయినా ద్వేషించాలి గాని అనుసరించకూడదు. మనల్ని ఒక్కటిగా ఐక్యతపరచేవి ఏవో, వాటిని స్వీకరించినపుడే మనలో మానవత్వం వికసిస్తుంది. ఎవరో ఏదో చెపితే అది ధర్మం అవదు. ఎవరో ఏదో చెపితే అది కర్తవ్యం అవదు. మానవాళికి సంబంధించిన ప్రతిది, సరైనదని నిర్ధారణ అయినపుడే అనుసరించాలి. సరైనవని నిర్ధారణ అయిన వాటిని, అతిక్రమించకుండా ఉండటము జరగాలి.

14) మానవులందరూ ఒకటి. మానవుల అవసరాలు కోర్కెలు ఒకటి. కష్టానికి సుఖానికి స్పందన ఒకటి. ఒకరు ఎక్కువ ఒకరు తక్కువకాదు. జీవితంలో ప్రతి ఒక్కరికి సంతోషం వుండాలి. మొత్తం మానవ సమాజములోనే, శాంతి భద్రతలు నెలకొనాలి. దేవుని దృష్టిలో ఇట్టి మానవత ధర్మము వుంటాయేకాని, అల్పదృష్టి అల్పభావనలు కావు.

# 2ఄ. నాగరికత

1) సరైన పద్ధతిని అవలంబించుట నాగరికత. వివిధ రంగాలలో సరైన పద్ధతులను విధానాలను అవలంబిస్తున్నప్పుడు, ఒకసమాజం నాగరిక సమాజంగా నాగరికులుగా పరిగణింప బడతారు. వారసత్వాన్ని పరిరక్షించుకోకుండా, మంచిచెడుల విచక్షణ ద్వారా, సరయిన మార్గాన్ని ఎంచుకోవటం నాగరికత. 50 సంవత్సరముల క్రిందటకి ఇప్పటికి మార్పువుందా? లేదా? ఈ మార్పు నాగరికత. నాగరికత దిశగా మరలటమే ప్రగతి. నాగరికత అంతా మార్పువల్లనే సాధ్యపడింది. మార్పును అంతటా ప్రవేశ పెట్టుకోనందువల్ల అనాగరికత వుంటోంది. అవసరం ప్రమోజనం దృష్ట్యానే విషయాలను నేర్చుకోవటంవల్ల, మిగతా వాటిల్లో శాస్త్రీయత లోపించబట్టి, అనాగరిక లక్షణాలకు తావేర్పడింది.

2) మతంపేర సంస్కృతిపేర భాషపేర సంప్రదాయంపేర, గిరిగీసుకొని బ్రతకటాన్ని వదిలివెయ్యాలి. గతపు వారసత్వాన్ని పరిరక్షించుకోవలసిన అవసరంలేదు. మనదృష్టిలో రెండే కదలాలి. 1 దేశం 2. ప్రపంచము. దేశ సమైక్యత, ప్రపంచ సమైక్యత మన ముందున్న లక్ష్యాలు. వీటిని సాధించటం ఎవరిపైనోలేదు. మనందరిపై ఆ భాధ్యత నెలకొంది. లక్ష్యసాధనకు అవరోధంగా ఉన్న సంస్కృతులను, కాలగర్భంలో కలిపేసి నాగరికులుగా జీవిద్దాం.

3) మనిషి మానవత్వానికి నాగరికతకు ప్రతినిధిగాజీవించాలి. ముమ్మందు తరాలవారికి అందించ వలసింది నాగరికత కాని, బూజుపట్టిన సంస్కృతిని కళలను శాస్త్రాలను కాదు. కాలగర్భంలో కలసి పోవలసిన వాటన్నిటికి, అభిమానంపేర స్థానం ఇస్తుంటే, అవి మన భవిష్యత్తును కాలరాస్తాయి. మనుష్యుల మధ్య ప్రాంతాలమధ్య దేశాలమధ్య, అడ్డుగోడలు సృష్టించే వాటిని ద్వేషించాలి కాని సంస్కృతిపేర పోషించుకోవటం అజ్ఞానం.

4) మనకు మార్గదర్శకత్వం వహించాల్సింది, అజ్ఞానులు అవివేకులు దురభిమానులు పక్షపాతవైఖరి కలవారు కారాదు. మనందరిని నాగరిక దిశకు మరల్చే నాగరికులుగా తీర్చిదిద్దే, వున్నతవ్యక్తిత్వం ప్రతిభా సామర్థ్యాలు గలవారిని మాత్రమే, పెదవి విప్పనివ్వాలి. నాయకత్వం వహించ మనాలి. ప్రతి అజ్ఞాని నోరు విప్పితే, మార్గాన్ని చూపిస్తుంటే నాయకత్వం వహిస్తే ఏమవుతుంది? నాగరిక దిశకు బదులు అనాగరిక దిశకు మరల్చి. అజ్ఞానమనెడి రాటలకు కట్టివేస్తుంటారు.

5) కుల మత వర్గ వర్ణ విభేదాలను సృష్టిస్తూ, సంస్కృతీ వైరుధ్యాలను ప్రేరేపిస్తూ, స్వప్రయోజనాలను సాధించేవారిని, ద్రోహులుగా శిక్షించండి. మనుష్యులను విడగొట్టే, ప్రాంతాలనువిడగొట్టే, కుటిల రాజకీయుల ప్రచారాన్ని అంతమొందించండి. అనాగరిక రాజకీయాలను అంతమొందించకుంటే, వీరు తలకెక్కించే అజ్ఞానము దురభిమానాలు తొలగవు.

6) జాతివద్దు, భాషవద్దు, సంస్కృతి వద్దు, మతము వద్దు, వర్గము వద్దు, అశాస్త్రీయతవద్దు. వీటికి వేల సంవత్సరాల చరిత్ర ఉన్నాసరే, యివేవి మనకువద్దు. వేటిని అభిలషించాలో వేటిని తిరస్కరించాలో, వివేచన చేయకుండా కాపాడుకోవద్దు. సాధింపవలసిన ప్రగతి ఎంతో ఉంది. తెల్సుకోవలసినది, నేర్వవలసినది ఎంతో ఉంది. వివిధ రంగాలలో సంస్కరణ్య

సంస్కారవంతమైన నడవడిక. సభ్యతాయుత జీవనం, మనముందుండగా, కాలదోషం పట్టినవాటి పరిరక్షణ ఎందుకు ? సమస్యలను సమస్యలుగా గుర్తించి పరిష్కరించుకోకుండా. విడనాడవలసినవాటికి మన మనస్సులలో స్థానం ఇవ్వటం. నాగరికత అనిపించుకుంటుందా ?

7) తన దేశంకోసమేకాదు, తన ప్రపంచంకోసము మనిషిమారాలి ఈ దేశమైనా ఈ ప్రపంచమైనా, మానవాళి సుఖసౌఖ్యాల కొరకే. మనుష్యులందరికి నిశ్చింత ప్రశాంతిని ప్రసాదించేందుకు, సమున్నతమైన నాగరికతను సాధ్యపడనీయకుండా అడ్డుకుంటున్న, గతాన్ని వదలి వేయవద్దా ? మతము సంస్కృతి భాష సంప్రదాయం, ఇవేవి పుట్టుకతో అబ్బలేదు. పుట్టుకతో ఈ గత వారసత్వాన్ని వెంటపెట్టుకరాలేదు. పుట్టి పెరుగుతూ దురభిమానాలను వదలలేక, గతానికి బందీలవుతున్నాం. ఈ బంధిఖానాను పగలగొడితే, నూతన ప్రపంచానికి వారసులవుతారు. లేకుంటే కాలదోషం పట్టిన కష్టాలపాల్జేసే గతానికి వారసులవుతారు. మేలయిన భవిష్యత్తును ప్రాప్తింపజేసే. సమూలమైన మార్పుకు తహ తహ చెందినపుడే. నాగరికతార్థము సిద్ధిస్తుంది.

# 25. పూజ

1) సమస్త ప్రజలకు సంతోషకరమైన జీవితాన్ని, ప్రసాదించవలె నన్నది భగవత్‌దృష్టి. మనం పూజించినా పూజించకపోయినా, దారిద్ర్యం అసమానతలను దేవుడు ప్రాప్తింపచేయుటలేదు. దేవునికి ఆగ్రహంకాని, మానవ సంబంధమైన అభిలాషలు అవసరాలుకాని లేవు. మానవులపై ఆధారపడి దేవుడులేరు. మానవులవల్ల దేవునికి కలిగే ప్రయోజనాలు ఏవి లేవు. తనను గుర్తించినా గుర్తించకపోయినా, దేవునికి ఆగ్రహం ఉండదు. ప్రజలెవరైనా వారిని కష్టనష్టాల పాల్జేయని దయార్ద్రత కలవారు. దేవుణ్ణి పూజించాలి అనేడి నిబంధన ఏదిలేదు. పూజించే వారికోసం, సర్వశక్తి వంతుడుగా కీర్తింపబడుతున్నారు. భక్తుల ఆరాధనను అందుకోగలశక్తి, దైవమునకు మినహా ఈ ప్రపంచంలో వేరొకరికిలేదు. వేరెవ్వరికి లేదా వేటికి పూజార్హతలేదు.

2) పరమేశ్వరుడు పరాశక్తి బుద్ధుడు క్రీస్తు అనగానే, దేశదేశాలలోని ప్రజలకొక రూపం భావం స్పష్టత నొందుతోంది. ఎవరికి తోచినట్లు వారు వివిధరకాలైన రూపురేఖలతో అలంకారాలతో చిత్రించినట్లయితే, అసలా రూపాలు ఎవరివో తెలిసేవికావు. ఫలానా రూపం ఫలానా అలంకారం ఒకో దేవుని ప్రతిబింబంగా ఏకభావాన్ని తీసుకురావటంవల్ల, ఆ యా రూపాలను చూసినపుడు, భక్తిభావం కలగటానికి ఆస్కారమవు తున్నది.

చోట ఉండెను, మరోచోట లేదనేటి వీలులేదు కాబట్టి, మనస్సే ప్రధానం. హృదయం దేవాలయమైనప్పుడు, ప్రేమబంధనతో బంధింపగలరుగాని, ఇతరత్రా హంగామాఎల్ల సాధ్యపడదు. కాబట్టి దర్శన ప్రార్థనకోసం వేరే ఎక్కడికో వెళ్ళవలసిందిలేదు.

8) మానవ హృదయం ప్రేమనిలయం. ప్రేమ ఎన్నో శాఖోపశాఖలుగా చీలి ఉంది. అందులో ఒకభాగమే భగవత్ప్రేమ. ఆ భగవత్ప్రేమ నుండి జనించినదే భక్తి ఆరాధన. తను ప్రేమించినట్లు, తన ప్రేమభావాన్ని వ్యక్తీకరించుకోగల మార్గం ఉన్నప్పుడే తృప్తి. ప్రేమను వ్యక్తీకరించు కొనుటకు దైవము కనపడరు. ఆరాధనకు రూపం ఉండాలి, భావంకావాలి. విగ్రహారాధనవల్ల మొదటిది, గ్రంథస్తమైన భక్తుల రాగాలాపన స్తుతివల్ల, రెండవది నెరవేరుతుంది.

9) ప్రేమ ఒక ప్రవాహంవంటిది. దానిని సజీవనదిగా కొనిపోవాలే కాని మరొక రీతిగా కాదు. తననెవరు ప్రేమిస్తున్నా, తాను ప్రేమిస్తున్నప్పుడే తృప్తి. ప్రేమ ఆరాధనలోని అనుభూతి తెలియనప్పుడు, మానవత్వపు స్పందన లేనప్పుడు, మానవ హృదయం యాంత్రికంగా మారితే, అట్టి యాంత్రిక హృదయాన్ని భరించలేరు. ఫలితాలను లెక్కించుకునే ప్రేమించరు. ప్రతిఫలాన్ని ఆశించే, సేవాదృష్టిలేదు. ప్రేమిస్తున్నవారే ప్రేమ నుండి సంతోష తరంగాలను అనుభవించగలరు. ప్రేమించనప్పుడు ఏదీ లేదు. దేవునికి మనకు మధ్య వారధి ప్రేమ. ఈ ప్రేమ పొంగి పొరలాలి.

10) దైవంపై శ్రద్ధాసక్తులు పిచ్చి పనులుగా కన్పట్టటానికి కారణం అపరిపక్వ మనఃస్థితి. ఇట్టివారు దేవునిని తలంచటం ఎందుకని అనుకుంటారు. ఇట్టివారు ప్రపంచంలో ఉంటారు. ఇలాంటివారు దేవునిని పూజించరు. మానసిక పరిణతి లేనివారు దేవునిని పూజించలేరు.

11) పరిమళంతో కూడిన పువ్వులు ప్రీతికరంగా ఉంటాయి. అలాగే భావ పరిపక్వతతో శ్రద్ధాసక్తులతో కూడిన. ధ్యానం లేదా పూజ ప్రీతికర మైనది. ఇలాంటివారు ప్రపంచంలో బహుకొద్ది కాలం ప్రభవిస్తారు. వీరి హృదయ స్పందన వారు. వీరి ప్రేమ ప్రవాహమై ప్రసరిస్తే వారు. మనందరి దేవునికి కృతజ్ఞతను కర్తవ్యంగా. ఇట్టి వ్యక్తులు భావిస్తే వారు. ప్రతిఒక్కరు దేవుని ప్రార్థించలేరు. మానసిక అభ్యాసం పొందని వారయినా, తమ దేవునియందు ప్రేమాస్పద దృష్టిని నిలుపుకుంటే, అదే మానవాళి తరపున కృతజ్ఞత.

12) దేవునియందు కృతజ్ఞత ఏల ఉండవలెనన్నది, అపరిపక్వ భావన మాత్రమే. ఈనాటి సుఖసౌఖ్యాలు భోగభాగ్యాల వెనుక, ఆ దేవుని సహ కారం నిండి ఉంది. పరోక్ష రీతిలో ఉండే ఆ దేవుని సహకారానికి, ఈ ప్రపంచంలో మానవ మస్తిష్కం విలువకట్టలేదు.

13) ఎందరో శాస్త్రజ్ఞుల ఎందరెందరో నిర్విరామ కృషి ఫలితాల వల్ల నేడెన్నో సౌకర్యాలు సదుపాయాలను అనుభవిస్తున్నాం. ఈనాటి మన అనుభవాల వెనుక, ఒకప్పటి వారందరి విశేష శ్రమవుంది. అయినా వారం దరిని తలంచటం సాధ్యపడనిది. గతంలోని వారిపేర ఏమి చేయలేకున్నా. ఆగతం వారందరికి కృతజ్ఞతా సూచకంగా ఒకే ఒక్కరియందు ఆ దేవుని యందు మనం కృతజ్ఞత చూపుదాం. కనీసం ఈ కృతజ్ఞతనయినా కనప రచ లేకుంటే, మానవుడు మృగంకన్నా పతనావస్థకు చేరినట్లు.

14) ప్రేమకు ప్రతిగా ప్రేమ. విశ్వాసానికి ప్రతిగా విశ్వాసం. ఆదరి ణకు ప్రతిగా ఆదరణ, లేకుండా గడుపలేము. మనస్సుకు ఉండాల్సిన గుణగణాలివి. ప్రతిమనిషి పెంపొందించు కోవాల్సిన మానసిక సంపత్తి వుంది. ప్రతి మనస్సు స్పందించాల్సిన రీతి వుంది. స్పందన స్వాను భవాన్ని పోగొట్టుకోకూడదు. మరమనుష్యుల వలె జీవించకూడదు. దేవాది

సంవత్సరాల గత ప్రజల విశేష శ్రమ, ఈనాటి నాగరికత వెనుకన ఉంది. వారందరి తరపున కృతజ్ఞతా భావాన్ని వెల్లడించటానికి వారెవరు లేరు. ఎవరూ లేనప్పుడు వినేందుకు కనేందుకు లేనపుడు వారిపేర ఏమి జరుపుకున్నా నిష్ప్రయోజనం. మన మనోస్పందనలను స్వీకరించేవారు లేనప్పుడు ఆస్పందన ఎవరి కోసం? కాబట్టి మన మనోస్పందనలను స్వీకరింపగల శాశ్వితుడయిన ప్రభువుకు సమర్పించుకుందాం.

15) గత కాలం నుండి లభింప జేస్తోన్న దేవుని పరోక్ష సహకారానికి గాను, మరియు గతకాల ప్రజలందరి విశేష శ్రమకు గుర్తింపుగాను, కృతజ్ఞతా రూపంలో భక్తి ఆరాధనా భావాన్ని, దేవునికి సమర్పించుకో గలగాలి. ఇట్టి సమర్పణ మనసున్న మనిషిగా చేయ కలగాలి. అవధులు లేనిది మనస్సు. ప్రేమ తరగనిది. ప్రేమిస్తున్నప్పుడే స్పందనానుభూతి. మానసిక తృప్తి, ఆనందానుభవాన్ని కల్గించే, ప్రార్థన మానవ ఆంతర్యంలో కదలాడడం అభిలషనీయం.

16) మన అంతఃకరణంలో జరిగే భావ సంచలనం భగవానునికి అవగతం. అందుచే భక్తి ప్రేమ పరివర్తన వంటివి తెల్పుకోవటంలో, వింత పద్ధతులు విడనాడ వలసినవి. దైవమునకు మనకు వారధి మన మంచి మనస్సే. గొప్ప అలంకారాలు నిత్య ధూప దీప నైవేద్యాలతో సంబంధం లేదు? కఠినతమమైన పూజలు, కానుకలు అనవసరం. భగవానుడు తమను పరీక్షించటం వల్ల, బాధలు కల్గుతున్నాయేమోనని అనుకునే వారున్నారు. ఒకరి మనోభావాలను తెలుసుకుందుకు. భగవానుడు ఎట్టి పరీక్షలు చేయవలసింది లేదు. సహజాభిలాషలను కోరికలను త్యజించాల్సినది లేదు.

17) దైవమును ప్రేమించి నందువల్ల ఆరాధనవల్ల, మానసిక ప్రశాంతి మానసిక ఉత్తేజము లభిస్తున్నవి. ఈ అనుభవం ఆనందాన్ని ఇస్తున్నది కాబట్టి అనుసరింప తగ్గదవుతున్నది. తన ఇంట్లోనుండి తన మనస్సునుండి

కాకున్నా, విశ్రాంతిని ఇస్తుంది. నిద్రలో శారీరక కార్యకలాపాలు మందగి స్తాయి. శరీరానికి మెదడుకు విశ్రాంతి లభ్యపడుతుంది. మెదడు తగినంత విశ్రాంతిని పొందనిచే, శరీరకంగా బడలికపోదు. వేటిల్లోను చురుకుగా పాల్గొన లేము. అందుచే నిద్ర లేదా విశ్రాస్థితి తప్పనిసరి.

22) నిద్ర పట్టకున్నా నిద్రసప్పుడం లేదనెడి అశాంతివున్నా, ప్రతి నిము షము భారంగా కదులుతుంది. ఈ పరిస్థితిని భరించలేక, మత్తుమందులకు అలవడుతున్నారు. ఈ ప్రమాదకర పరిణామంనుంచి వ్యక్తిని సమాజాన్ని భావాతీతస్థితి రక్షిస్తుంది. మహేష్యోగి భావాతీత ధ్యానాన్ని అవసరం మేర అభ్యసించ గలగాలి. భావాతీత ధ్యానంలో ఆలోచన వుండదు. ఆలో చన లేనిస్థితి ఒక అద్భుతమైన స్థితి. భావాతీత ధ్యాన అభ్యాసం ఉన్నపుడు ఆలోచనకు తావివ్వకుండా, నిద్రాకారణంపై ఏకాగ్రతను అలవరచుకో వచ్చు. ఇదలా నిద్ర పుచ్చుతుంది.

23) దైవధ్యానం ద్వారా ఆలోచనలపై అదుపు పొందటానికి, భావాతీత పద్ధతిని అలవరచుకుంటే. ఒక సమయం నుండి రెండు విధాల ఫలితాలు ఉంటాయి. ఉదయంవేళ దేవునికొరకు ధ్యాన సమయాన్ని కేటాయించినట్లు అవుతుంది. భావాతీత అభ్యాసం స్థిరపడటంచే, రాత్రిళ్ళు సులువుగా నిద్ర పోవచ్చు. యోగపద్ధతుల ద్వారా జరిగే వ్యాధి నివారణలో, ఆలోచనను కేంద్రీకరించుట, ఆలోచనలను క్రమబద్ధీకరించుట తప్పనిసరి కాబట్టి, ఇందుకు ఉపకరిస్తుంది. అందుచే దైవధ్యానం ఎవరికయినా ప్రయోజన కరం.

24) మానవ హృదయం కదలని మెదలని రాతిబండకాదు. సంఘటన లకు స్పందిస్తుంది. తమ శ్రేయస్సుకై సహకారం తోడ్పాటు అందించే వారిపై, ప్రేమ భావం నెలకొని ఉంటుంది. తమను ప్రేమించే వారిని, తాము తిరిగి ప్రేమిస్తారు. ప్రేమ భావం నుంచే తమను తాము అర్పించు

కోగలరు. ఇలాంటి అర్పణలోనే జీవితానికి సార్ధక్యత తృప్తి, ఆనందము వుంది.

25) కృతజ్ఞతను సమర్పించుకుంటానికి దైవంమినహా ఈ ప్రపంచంలో ఎవరున్నారు? ప్రేమ ప్రవాహాన్ని అందుకొని, తనలో లీనంచేసుకోగల మహత్తు కలవారైన, ఆ ప్రభువుకు మినహా వేరెవరికి సమర్పించుకోగలం?

26) అపూర్వ వృక్షసంపద ఇస్తున్న ఫలితాలకు. వృక్ష సంతతిని పూజిద్దామా? అపార సంపదలను అందిస్తున్న సముద్రానికి ప్రణమిల్లుదామా?- అనునిత్యము కాపాడుతున్న వాతావరణానికి శ్రద్ధాంజలి ఘటిద్దామా? ప్రాణానికి జీవనాధారానికి హేతువయిన భూమికి మ్రొక్కుదామా?- ఆకాశపు టంచులను దాటి అనంత విశ్వాన్ని గమనిస్తూ, ఊహకు భావనకు అందని ఆ అద్భుతావ సృష్టికి ప్రణమిల్లుతూ, అచ్చెరవందుతూ కీర్తిద్దామా? ఏమి చేయటానికయినా మన మనో స్పందనలను స్వీకరించేవి ఏవున్నాయి? విజ్ఞానానికి అవన్నియు తన్మయావస్థలే. ఈ సృష్టిలో అద్భుతం కానిదేదీ లేదు. ఇట్టి అద్భుత ప్రపంచంలో నివసిస్తున్నాం. ఈ అద్భుతావస్థను ప్రార్థన రూపంలో వెల్లడించుకుందాము.

27) దైవాభిష్టానికి అనుగుణంగా మన నడవడికను రూపొందించుకో కలిగిననాడు, ప్రపంచంలో ఎవరికి కోరుకుందుకు ఏమీ లేనంతగా, మన అభీష్టాలు సిద్ధించే సమాజం సాధ్యపరచ బడుతుంది. వ్యక్తిగతంగా మానవాళి కోరుకునే కోరిక లన్నిటికన్నా, విలువైన జీవితాన్ని దైవం ప్రసాదిస్తారు.

28) ఆలోచనల అనుభవం. ఆలోచన అనుభవాలనుంచి, మరో ప్రపంచం దిశగా మరల్చగల ప్రభువైన దేవునికి, ఏమి సమర్పించి సంతృప్తిని పొందగలరు?

27)

29) కష్టాలనుంచి కన్నీళ్ళనుంచి శాశ్వత విముక్తిని కల్గించి, జీవితాలలో ఆనందానుభవాలను ప్రసాదించే దేవునికి సమర్పించేందుకు, ఎవరివద్దయినా ఏముంది?

30) ఊహ తానై భావన తానై, మనకోసం మనలను నడిపించే ప్రభువుకు, ఏమి సమర్పించుకోగలరు? మానవ ప్రవృత్తులకు భిన్నస్వరూపులైన, ఆ నిరాకార స్వరూపునకు ఏమికావలె? ఎవరు కావలె? ఏమిచ్చి ఆ దేవునిని స్పందింప చేయగలరు?

# 26. దైవనిధి

1) భక్తి విశ్వాసాలపేర మనం దేవునికి సమర్పించుకుంటున్న కానుకలు దేవుడు స్వీకరించుట లేదని తెలుసు. విగ్రాహాలకు అలంకారాలు చేసినా నైవేద్యాలు పెట్టినా, పూజలు చేసినా, ఇట్టివన్ని మన సంతృప్తి కొరకు చేసుకుంటున్నవి కాని, దేవుని అపేక్షల ననుసరించి జరిపేవికావు. దేవుని పేర మతంపేర, సమర్పిస్తున్న కానుకలు విరాళాలు సద్వినియోగ మవుతుంటే, ఆసమర్పణ వివేకవంతంగా ఉంటుంది. నేడిలా కాకుండా దుర్విని యోగ మవుతోంది. అక్రమాలకు స్థానం ఉండటాన్ని ఉపేక్షింపరాదు.

2) మతపరమైన వేడుకలు ఉత్సవాలు, మతవ్యాప్తి విద్యాలయాలు తది తర సాంఘిక సంస్థలకు; దేవాలయాల మసీదుల చర్చిల ఆదాయాలను ఖర్చుచేయటం సరికాదు. అపార నిధులుఉన్న ప్రభుత్వాలు నిర్వర్తించాల్సిన కార్యకలాపాలకు, ఈ డబ్బు ఖర్చిడకూడదు. మనం ప్రేమతో దేవునికి సమర్పించుకునే ఈ కానుకలు ఓస్వల్పనిధి. ఈనిధి వేటికోవాటికి ఖర్చయి పోవటం అంగీకరింపరాని విషయం.

3) దేవునికి సమర్పింప బడిన వాటితో, మానవాళి సంక్షేమం జరగాలి. మానవ సంక్షేమం అంతా పరిశీలన పరిశోధనపై ఆధారపడి వుంది. పరిశో ధనాంశాల వల్లనే, మానవజాతి తమను తాము తీర్చిదిద్దుకోగలరు. మరియు పురోగామి కాగలరు. మనకు మార్గదర్శి పరిశోధనాంశాలు.

4) ఒకపని చేస్తుంటే. ఆపనిలో సహకరించే వీలుంటుంది. పనియే చేయనప్పుడు, ఆ పనికి సహకరించే వీలేది? దేవుని తోడ్పాటును పొందా లంటే, పరిశోధన ప్రయోగము అనే నిర్విరామ ప్రయత్నం చేస్తుంటే, ఆ పరిశోధకులకు ఆలోచనను అందిస్తుంటారు. పరిశోధన చేయకుంటే స్ఫురించటానికి అవకాశం లేదు. పరిశోధిస్తుంటే ఆలోచిస్తుంటే, ఆ ఆలో చనను నడిపిస్తుంటారు. ఆలోచన నుంచి ఆలోచనను అందిస్తారు. పరిశో ధన ప్రయోగము లేనప్పుడు, దైవము తనదైన ఆలోచనను, విషయాల యొక్క స్ఫురణను అందించే వీలు ఏర్పడదు.

5) పరిశోధన ప్రయోగము అనేవి అనుకున్నంత తేలిక కాదు. అందరి వల్ల కావు. మానసిక శ్రమ పైకి కనిపించదు. ఈ మానసిక శ్రమ చేయ లేకనే, ఎందరెందరో విషయాలను నేర్చుకోలేకున్నారు. అధ్యయనం ఆలో చన గ్రహింపు అనేవి సాధారణ విషయం కాదు. నూతన విషయాల ఆవి ష్కరణ, ఎంతో పరిశోధనా ఫలితం. శాస్త్రవిజ్ఞాన ఫలితాలు, సాంకేతిక పరిజ్ఞానము, నూతన ప్రక్రియలు, వంటివన్ని ఉత్కృష్టమైన పనులు.

6) మనకోసం మనదేశంకోసం, నిర్విరామంగా మానసిక శ్రమచేస్తున్న పరిశోధకులకు, మన ఏర్పాటు చేసుకున్న దైవనిధినుంచి ఖర్చుచేయగల ప్పుడే, సద్వినియోగ మవుతున్నట్లు. పరిశోధనా ఫలితాలు ప్రయోగ ఫలి తాలకు దైవనిధిని ఖర్చుచేద్దాం. మనం సమర్పించుకున్న కానుకలు, విరా ళాలు మన సంక్షేమంకొరకు, సద్వినియోగపరచ పడుతున్నప్పుడే కదా, ఎవరికయినా తృప్తి.

7) సామాన్యపౌరుని నుంచి శాస్త్రజ్ఞునివరకు, సమస్యల పరిష్కారంలో వారికివున్న శక్తిసామర్థ్యాలనుబట్టి, దేవునిపేర బహుమతులు ఇద్దాం. ఇది గొప్ప ప్రోత్సాహక చర్య అవుతుంది. పరిశోధన కలవారిని ప్రోత్సహించి సత్ఫలితాలను సాధించే కృషి మరువరానిది. పరిశీలన, పరిశోధన, మానవ సమాజానికి గుండె వంటిది.

8) విజ్ఞాన విషయాలపై సాంకేతిక పరిజ్ఞానంపై, యోగంవంటి సాధన చేస్తున్నవారి మనో సంతృప్తికి, దైవనిధి వినియోగ పడడం దేవునికి ప్రీతికరం అవగలదు. దైవము ఇష్టపడగలరన్న పనులకు. సద్వినియోగం చేయకల్గి తున్నప్పుడే, మనం సమర్పించుకున్న కానుకలు విరాళాలకు ప్రయోజనం అంటూ చేకూరుతుంది.

9) మనం సమర్పించబట్టి, అవి దేవునికి చెందిన నిధి లేదా దేవునిపేర ఏర్పాటు చేసుకున్న నిధి అవుతున్నది. ఆ దైవనిధిని సద్వినియోగ పరుస్తున్నప్పుడె, మన సమర్పణకు అర్థం వుంది. ఇది లేనప్పుడు కానుకలు విరాళాలు అర్థరహితమైన చర్య.

10) క్రిస్టియన్లు క్రీస్తుపేర, ముస్లింలు అల్లాపేర, హిందువులు ప్రాంతీయ ప్రాముఖ్యతగల దేవుళ్ళపేర, ఇలా తమ విరాళాలను దైవనిధికి పంపిస్తుండవచ్చు. దేశంలో నివశిస్తున్న పౌరులు తమకు సాధ్యమయిన రీతిలో ఎంతో కొంత మొత్తాన్ని, ఏటా దైవనిధికి చేర్చుతుండాలి. ఇందుకు మినహా వేరెక్కడా ఎవరూ, దేవునిపేర మతంపేర ఏమీ సమర్పించవద్దు. దేవాలయాలు, మసీదులు చర్చిలు మొదలగువాటి ఆధ్వర్యంలోని ఆస్తులు, దైవనిధికి సంబంధితమైనవి అవ్వాలి. దైవనిధిని మతాచార్యుల నిర్వహణలో ఉంచి, పర్యవేక్షణను మనం చేస్తుండాలి. దేవాలయాల నిర్వహణ మరియు పునరుద్ధరణ వంటి వాటికి, ఈ దైవనిధి నుండె ఖర్చిడతార ఇందుకు తగిన వ్యవస్థను తదుపరి రూపొందించు కోవచ్చు.

# 27. మతాచార్యులు

1) దైవముపై ప్రేమను ఆరాధనను స్థిరపర్చటంతోబాటు, తమదేశాన్ని తాము పాలించుకొనే శక్తివంతుల్నిగా తీర్చిదిద్దటంలో, మతాచార్యులు పూజారులు తమ వంతు కృషిని కొనసాగించాలి. మత ప్రవక్తలు తాము నివసించిన సమాజంలో నెలకొన్న చెడుని ప్రజల దృష్టికితెచ్చి, ఆలోచనా పరుల్ని చేసి, నూతన దృక్పథం వైపు మరల్చేందుకు, దైవప్రేమ నెల కొల్పేందుకు ప్రయత్నించినారు. మత ప్రవక్తలకు గల లక్ష్యంఏదో అట్టి లక్ష్యం కొరకు, తాము అంకితం కాకల్గాలి.

2) జీవితం కన్నా లక్ష్యం గొప్పది. లక్ష్యం గొప్పదయినప్పుడు, లక్ష్యా నికి విరుద్ధంగా ఆటంకంగా ఉన్నవాటితో రాజీ పడకూడదు. అధిక సంఖ్యా కుల మంచితనమే అండదండలు. వారి సమీకరణవల్ల, లక్ష్యసాధనకు మార్గం నిరాటంకం అవుతుంది. ప్రభుత్వ ఆదరణ మరియు ధనికుల విరా ళాల కోసం లక్ష్యాన్ని విస్మరించరాదు.

3) మతాచార్యులకు మత ప్రవక్తల కృషి సాధన మార్గదర్శకంగా ఉండాలి కాని, అనాటి మతబోధనలు కావు. జీవితంలో ఎలాంటి ప్రలోభా లకు లొంగరాదు. కష్టనష్టాల నిర్మూలనే మతాచార్యుల లక్ష్యమవ్వాలి.

4) పరిశీలనాంశాలను పరిశోధనాంశాలను, ప్రజలకు అవగాహన పర చాలి. సాంఘిక సమస్యల నిర్మూలనకు ప్రజలందరిని సమాయత్త పర

చాలి. అరాచకంపై అవ్యవస్థలపై దాడి చేయించాలి. మతాచార్యుడనని చెప్పుకునే వ్యక్తి. సంఘ సంస్కర్తగా కృషిని కొనసాగించ కలగాలి.

5) మతము రాజ్యము వేరుకాదు. తమ సమాజాన్ని సంస్కరింప జేసు కునే ప్రేరణఇచ్చేదే మతం. సమస్యలను ధైర్యంగాఎదుర్కొని, సమస్యా రాహిత్య జీవనాన్ని సాధింప జేసుకునే మార్గంవైపు, ప్రోద్బలం చేయగ లదే మతం. మతలక్ష్యము మతభావన విశ్వశాంతి కొరకుగాని, మానవుల మధ్య అవరోధాలను నిల్పేందుకు కాదు.

9) మతం మనిషికి సమ్యక్ జ్ఞానాన్ని బోధించాలి. తాము సాధింపా ల్సిన వాటిపై జాగృత పరచాలి. కర్తవ్యం వైపు మరల్చాలి. విశ్వమా నవ ప్రబోధాన్ని గరపాలి. నీవూ నేను ఒకటేసుమా అన్న అంతర్గత భావ పరిధిని, సుస్థాపితం చేయగలగాలి.

7) నిరాశా నిస్పృహలలో విరక్తి చెందకుండా ఆదుకొని ఆదరించి శక్త్యు త్సాహాలను ప్రసాదించేదే మతం. భ్రమలను విడగొట్టి అజ్ఞానాన్ని తొల గించి, సత్యసంధత వేపు కొనిపోయేదే మతం.

8) ఆత్యాశను స్వార్థాన్ని దురభిమానాలను దురభిలాషలను తొలగించి, జ్ఞానాన్ని బోధించ కల్గినదే మతం. వృథాప్రయాసలను నశింపజేసి, జీవితా ర్థాన్ని బోధించకల్గిందే మతం. ఇందుకొరకు మతాన్ని సాధనంగా ఉపయో గించినప్పుడే, మతాచార్యులకు ప్రజాహృదయాలలో స్థానం ఉండకలదు.

9) దేవునివాక్కు ఒకనాడుండి, మరోనాడు లేకుండా పోలేదు. సమకా లీన సమాజానికి అవసరమైన ధర్మాన్ని దైవము ప్రబోధిస్తుంటారు. అట్టి ధర్మమార్గమే. అనుసరింప వలసిన మతం అవుతుంది. ప్రజల అభీష్టానికి అనుగుణంగా దైవనిధిని సద్వినియోగ పరచటంలోను, పరిశీలన పరిశోధన ఫలితాలకు తగిన ప్రోత్సాహక పథకాలను, అమలు జరిపించుటలోను ప్రముఖపాత్ర వహించే వీలుంది.

10) స్వామీజీలు:- ఏసమాజంలోనైనా మోసము, అవినీతి ఉండరానివి. సంపాదన కొరకు ఇతరులను మభ్యపరచ కూడదు. తమ వద్దకు ఎవరు రాకుంటేనేం? ఇతరులను రప్పించు కొందుకు అనంగీకార మార్గాలను అనుసరించుట సహింప లేనిది. ఎవరికున్న పరిమితులను వారు గ్రహించి, తామేమిటో తమ హద్దులేమిటో గుర్తించి, జీవించటం వుండాలికాని, ఇతరులను ఆకర్షించుట కొరకు దైవ ప్రతినిధులుగానో, అవతారమూర్తులుగానో సాగెడి ప్రచారాన్ని అనుమతించటం కూడనిది. స్వల్పకాలికమైన ఈబ్రతుకు కోసం అపేక్షలకు ఆకాంక్షలకు లోనవకూడదు. ఆకాంక్షలను అపేక్షలను అధిగమించ లేనప్పుడు, ఒక వ్యక్తిగానే జీవించాలి.

11) మతంపేర అజ్ఞానాన్ని ప్రభోదించటం తగదు. తమనునమ్మి, విశ్వసించి, ఎంతోదూరం నుండి ఎంతో ప్రయాసపడి వస్తున్న వారికి, తామివ్వతగ్గ సందేశం ఎవరి జీవితాలను వారు సరిదిద్దుకోగలదై ఉండాలి. ఇతరులు తమపై ఆధారపడాల్సి ఉన్నట్టి ప్రభోదనలు ఉపసంహరించు కోవలసినవి. వేటిని ఆశించి విశ్వాసికులు తరలి వస్తున్నారో, అట్టివారిని అజ్ఞానంలో ఉంచుతూ, అజ్ఞానపరిధిలోనే పరిభ్రమించే బోధనలుచేస్తూ, తిరిగి రప్పించుకునే ధోరణి అంగీకరింప లేనిది.

12) తమ జీవితం తమ వ్యక్తిత్వం, మానవ జీవనంలోని అజ్ఞానాంధకారాలను చీల్చి చెండాడాలికాని, ఆకాంక్షల కొరకు వ్యతిరేకించాల్సిన వాటిని బలపరచ కూడదు. తమ జీవితం, తమ ఆచరణ, తమ బోధనలు, ఆదర్శవంత మైనవిగాను, జ్ఞానప్రబోధం కల్గించేవిగాను ఉండాలేకాని అనితరంగా వుండరాదు.

13) తమను నమ్మివచ్చిన భక్తులపైన ప్రేమభావం ఉండాలి. తమ పిల్లలను తామెలా పంచించరో, అటులనే తమ విశ్వాసికులను కష్టాలపాల్జేయ కూడదు. తమ శరీరాన్ని తామెలా కష్టపెట్టుకోలేరో, అట్టి దృష్టే తమను నమ్మివచ్చిన వారిపై వుండాలి.

'4) దైవంయందు ఆరాధనను తాము కలిగిఉంటూ, అట్టి ఆరాధనా మార్గాన్ని ఇతరులలోను కల్గించాలి. తనదేహం కొరకుకాక, తనజీవితం కొరకుకాక, కర్తవ్యం కొరకు జీవించాలి. కాంక్షసక్తులు కన్నా, జీవితం కన్నా, కర్తవ్యం గొప్పది. కర్తవ్యం కొరకు జీవించాలికాని, జీవించటం కొరకు కర్తవ్యాన్ని మరచి, అనంగీకార బోధనలను ఆచరణలను వ్యాప్తి చేయరాదు.

15) సత్యానికి ప్రణమిల్లాలి. ధర్మానికి ప్రణమిల్లాలి. న్యాయానికి ప్రణమిల్లాలి. జ్ఞానానికి ప్రణమిల్లాలి. ఎక్కడ ప్రణమిల్ల వలసిన మూర్తిత్వం ఉంటుందో: అచ్చట ప్రణమిల్లాలి కాని అన్యతయందు కారాదు.

# 28. ఆధునిక మత గ్రంథం

1) బౌద్ధమత ప్రవక్త బుద్ధుడు తాను జీవించిన 80 సంవత్సరాలలో తన బోధనలను వ్రాసి ఉంచలేదు. క్రైస్తవ మత ప్రవక్త క్రీస్తు తాను జీవించిన 33సంవత్సరాల కాలంలో, తనబోధనలను లిఖితరూపమున వ్రాయించి వుండలేదు. ఇస్లాం మతప్రవక్త మహమ్మద్ రాజయి వుండి, తాను జీవించిన 62 సంవత్సరాల కాలంలో, తన బోధనలను గ్రంథరూపంలో లిఖింపజేసి ప్రజలకు వెల్లడించి వుండలేదు. ప్రవక్తలు జీవించి వుండగా త్రిపిటకాలు, బైబిలు, ఖురాన్ వంటి గ్రంథాలు లేవు, వీటి మతాలు లేవు.

2) ముస్లింలకు ఖురాన్‌వలె క్రిస్టియన్లకు బైబిల్‌వలె, భారతీయులకు ప్రత్యేక మతగ్రంథం లేదు. ప్రత్యేకంగా ప్రవక్త అంటూ ఎవరూ లేరు. ఒక మతాన్నో ఒక మత దృక్పథాన్నో ప్రవేశపెట్టి, ఆ మత ప్రభావంలో బంధించలేదు స్వేఛ్ఛాయుతమైన ఆలోచనకు అవకాశం ఇవ్వటం వల్ల, తర్కరీత్యా ప్రాముఖ్యత గల సిద్ధాంతాలు ఏర్పడ్డాయి. ఇట్టి సిద్ధాంతాలలో పరస్పర విరుద్ధత వున్నా, ఇవి అమలులోకి వచ్చాయి. ఇలా అమలులోకి వచ్చినా, కొన్నింటి వ్యాప్తికి మతాచార్యుల, పట్టుదలవల్ల రాజాదరణ వల్ల, ప్రచారము ప్రాముఖ్యత ప్రజల ఆదరణ లభించింది. ఈ భిన్నత్వాన్ని హిందూమతంగా పిలవజొచ్చారు. అందుచే హిందూమతం, ఒక మతంకాదు, భారతీయులకు మతం అంటూ ఏదీ లేదు. భారతదేశం

6) మతగ్రంథాలు కొద్ది సంవత్సరాలలో ప్రవక్త ద్వారా వెల్లడైన బోధనలు కావు. ప్రవక్తలకు జ్ఞానోదయం అయిన నాటినుండి మరణిం చేంతవరకు, వారొసంగిన బోధనలు. గ్రంథస్థం చేసిన రీతిలో క్రమ బద్ధంగా వెల్లడించినవికావు. ప్రవక్తల బోధనల సారాంశము మత గ్రంథా లలో ఉంటుందికాని, మతగ్రంథాలలో ఉన్నట్టి విషయాలన్నియు ప్రవక్త లవికావు. మతంపేరిట ఎన్నో ఆచారవ్యవహారాలు, మతసూత్రాలు, కర్మ కాండ, మతసంబంధం చేసిఉన్నారు. ప్రవక్తలు ఏమయితే బోధించారో, అవే మతగ్రంథాలుగా రూపొందలేదు.

7) ఒక బహిరంగ సభకు హాజరయినా, ఆ బహిరంగసభలో తామేమి విన్నారో. దానిని తిరిగి చెప్పగలరా? ఒకచోట ప్రసంగించిన విధంగానే మరోచోట ప్రసంగించటము వీలవదు. మనిషి తాను చెప్పిన విషయాన్ని, తిరిగి అదేవిధంగా చెప్పలేకుంటాడు. ఎవరో ఫోన్ చేసి, ఫలానా ఫోన్ నెంబరుకి ఫోన్ చేయమని, ఫోను పెట్టేశారనుకోండి. అప్పుడువిన్న ఫోన్ నెంబరు గుర్తుకురాక, ఫోన్ చేయమన్నవారికి ఫోన్ చేయలేక పోవచ్చు. ఫలానావారికి ఫలానా విధంగా చెప్పిరమ్మంటే, మరో విధంగా చెప్పే వారున్నారు. ఒకటికి మరొకటిచేర్చి విషయార్థాన్ని చెడగొట్టే వారున్నారు. రచయిత సయితం తన గ్రంథంలోని విషయాల గూర్చి, గ్రంథం చూడ కుండా వివరించలేకుంటాడు. గతంలో తాను అనుకున్నవి, తాను వ్రాసినవి తానే మరుస్తుంటాడు.

8) పరిశోధన చేస్తున్నప్పుడు లేదా ఆలోచిస్తున్నప్పుడు అందుకు సంబం ధించిన విషయాలను వ్రాసుకోవాలి. లేకుంటే పరిశీలించినవి అనుకున్నవి ఆలోచించినవి మరస్తుంటారు. ఏదయినా బోధన లేదా వ్రాయటం అనేది అధ్యయనం మరియు ఆలోచనా ఫలితం. కావలసినపుడల్లా గతపు అధ్య

యనము ఆలోచనలు జ్ఞప్తికిరావు. ఆలోచన వ్యక్తీకరణ ఒక్కవిధంగా సాగవు. కాబట్టి లిఖితమై ఉండటం తప్పనిసరి.

9) మతగ్రంథాలు కథలు నవలలు సినిమా పాటలు వంటివికావు. మత గ్రంథ విషయాలు పైవాటివలె గుర్తుండేవికావు మతగ్రంథాలలోని బహు విషయాలను తరతరాలకు కొనిపోకల్గటం అనుకునేంత సులభమా? మనిషికి ఉన్న మరపుదృష్ట్యా ప్రవక్తల బోధనలను ప్రవక్తలు జీవించి ఉన్నప్పుడే, ఎంతో శ్రద్ధవహిస్తేగాని యథాతథంగాఉండే వీలులేదు. ప్రవక్తలు జీవించి ఉండగనే తమ లిఖితమైన విషయాలను, వెల్లడించి ఉంటే. ఎవరికి తోచి నట్లు వారు మార్పులు చేర్పులు చేయలేదని నమ్మే వీలుండేది.

10) దైవము స్ఫురింపజేసిన దానిని లేదా దైవవాక్కుగా విన్నదానిని, వెంటనే లిఖించటము ఎంతో ప్రాధాన్యతగల విషయం. ఇలా లిఖిత మవ నప్పుడు, దైవం చెప్పినదానికి ప్రవక్తలు చెప్పిన దానికి ఎంతో మార్పు వస్తుంది. ఈ మార్పు సంవత్సరాలు గడిచేకొద్ది మరింత పెరుగుతుంది. దైవసందేశాన్ని యథాతథంగా వ్రాయనపుడు లేదా వ్రాయించనపుడు, దైవము ఏమి వివరించారో దానిని మరచిపోతారు. రాత్రికలలు తెల్లవారి గుర్తుండనట్లుగా. దృశ్యరూపేణా కలలయొక్క అనుభవం మనకు కల్గు తున్నా, ఆ కలలగూర్చి వివరింపలేని పరిస్థితి ఎదురౌతోంది.

11) పదాలకుగల అర్థం వేర్వేరు. పదంమారితే అర్థం మారుతుంది. అక్షరాలు మారితే పదాలు మారుతుంటాయి. పదాలుమారితే వాక్యాలు మారి పోతాయి. వాక్యాలు మారితే సిద్ధాంతాలే తారుమారు అవుతాయి. అక్షరాలకు పదాలకు వాక్యాలకు ఎంతటి అపార ప్రాధాన్యతఉందో! వీటి ప్రాధాన్యత తెలిసిన దేవుడు, తను వినిపించిన సందేశాలను తారుమారు చేయకుండా మరవకుండా, అప్పటికప్పుడు లిఖింప జేయించేవారు. ఎందుకంటే ఈ

వాక్కు వందల కోట్ల ప్రజానీకం యొక్క శుభప్రద భవిష్యత్తు కోసం కాబట్టి, తన వాక్కులో మార్పులు చేర్పులు ప్రవక్తలవల్ల తదితరులవల్ల జరగకుండా, దేవుడు శ్రద్ధవహించి ఉండేవారు.

12) మతగ్రంథాలలోని విషయాల ఆధారంగా జీవించాలి అనేది మత గ్రంథాల లక్ష్యం. ఈ లక్ష్యం కొన్ని లక్షలమందికి పరిమితం అవ్వలేదు. కోట్లమందికి కూడా కాదు. మొత్తం మానవాళి అనుసరించాలి అనేవిది మతగ్రంథాల నిర్ణయం. ఈ ఉద్దేశం దేవునికి ఉంటే, తాను నిర్ణయించే ప్రతి నిర్ణయం యొక్క మంచీ చెడులపై, ఎంతో శ్రద్ధ వహించాల్సి ఉంటుంది. ఎందుకంటే వందలకోట్ల ప్రజల భవిష్యత్తు ఆధారపడి ఉంది.

13) ఒకే ఒక్క మతాచారం తప్పుడు దయితే, ఆ ఒక్క మతాచారం వల్ల కోట్లాదిప్రజల కళ్ళు కన్నీటిని స్రవిస్తాయి. కోట్లాది కుటుంబాలు కష్టాల పాలవుతాయి. ఇంత అనర్థము ఒక్క దురాచారం వల్లనే. మత గ్రంథాలలో ఉన్నది ఒక్క పేజి, ఒక్క నిర్ణయంకాదు. ఎన్నో మత సూత్రాలు, ఎన్నో సిద్ధాంతాలు, ఎన్నో ఆచారవ్యవహారాలు ఉన్నవి. వీటిని పాటించండి అనగానే సరిపోతుందా? వందల కోట్ల ప్రజలకు నిర్దేశించినపుడు, ఆ నిర్దేశనవల్ల వారెలాంటి ఫలితాలను పొందుతున్నారో పునః పరిశీలన పునఃనిర్ణయం ఉండవలసినవి కదా? దేవుడు తన వాక్కును పంపించినా, ఫలితా ఫలితాలనుబట్టి పునః పరిశీలిస్తుంటారుగాని, అవే శాశ్వతం అని ఎలా శాసించగలరు. దేవుడలా ఎందుకు చేస్తారు?

14) 100 అంతస్తుల భవనంలో 1 వ అంతస్తునుండి చూచిన వ్యక్తికి, 100 వ అంతస్తునుండి చూచిన వ్యక్తికి ఎలా తేడా ఉంటుందో, అలాగే నేటి కాలానికి ప్రవక్తల కాలానికి అలాంటి వ్యత్యాసం ఉంది. ప్రవక్తల

కాలాన్నిబట్టి ప్రవక్తలకు అనుభవాలు ఉంటాయి. ప్రవక్తలు జీవించిన కాలందాటి, వేల సంవత్సరాలు గడిచాయి.

15) వైద్యగ్రంథాలు చేతిలో ఉన్నాయని ఒక నిరక్షరాస్యునికి ఇస్తే, వాటినుండి ఏమీ గ్రహించలేడు. అక్షరాభ్యాసం చేస్తూ ప్రాథమిక స్థాయి నుండి నేర్చుతూ, సంవత్సరాలు గడిపినపుడు, వైద్య గ్రంథాలలోని సాంకేతిక పదజాలం దాని అవగాహన అప్పుడు సాధ్యపడుతుంది. నేటి సమాజానికి అనుగుణమైన పద్ధతులు విధానాలు ప్రవక్తలు జీవించిన కాలం లోనే, వారు పొందటం వివరించటం అసంభవం. ప్రవక్తల కాలంనాటి సాంఘిక ఆర్థిక రాజకీయ పరిస్థితుల నుండి, సంస్కారణా యుతమైన భావాలను గ్రహింపగల శక్తి మాత్రమే ప్రవక్తలకు ఉంటుంది కాబట్టి, వారి బోధనలు వారి సమకాలీన ప్రజల కోసం కాని, మన కోసం కాదు.

16) సమాజంలో పురోభివృద్ధి క్రమపద్ధతిలో సాగేది. పురోభివృద్ధి స్థాయినిబట్టి, మానసిక స్థాయి గ్రహణశక్తి ఉంటుంది. ఏదయినా నేర్పాలన్నా అందుకు తగిన నాగరికత ఏర్పడి ఉండాలి. దైవస్ఫురణ గ్రహింపాలన్నా, క్రమానుగత అనుభవాలు ముఖ్యం. కాలంయొక్క అనుభవాలు లేకుండా, ఒక పని జరిగేందుకు అవకాశము ఏర్పడదు. కాలానుగుణమైన మార్పుకు, కాలానుగుణమైన అనుభవాలు ముఖ్యము.

17) నేడు దైవవాక్కు లేదుగనుకనా? ఇకముందు దైవవాక్కు ఉండదు గనుకనా? వేల సంవత్సరాల క్రిందటి మతగ్రంథాలే సర్వస్వం అని అనుకోవాలి. ప్రవక్తలు మాత్రమే మానవ సమాజాన్ని తీరిదిద్దలేదు. ప్రవక్తలతోనే ప్రగతి ఆరంభమవలేదు. ప్రవక్తలవరకే దైవవాక్కు పరిమితమై

లేదు. కాలంతోబాటు వారు సాగిపోయారు. మనముందు తరాలవారికి మంచి భవిష్యత్తును కూర్చి, కాలంతోబాటు మనము సాగిపోతాం. ఎవరయినా చేయగల అవకాశం ఇంతవరకే.

18) మతం అనేది ఒక మనిషికో మతస్థులకో సంబంధించినది కాదు. విభిన్నమతాలు విభిన్న మతస్థులకు మాత్రమే సంబంధించినవి కావు. జాతి పరంగా సంస్కృతి పరంగాకాక, మానవాళి మానవత దృష్టితో మతాలపై సరైన వివేచన చేయటం ప్రతిఒక్కరి బాధ్యత. మతాలవల్ల ఫలానా మతానికి చెందిన వారవుతున్నారు. తానొక ప్రపంచ పౌరుడినన్న తలంపుకన్నా, తానొక మతస్థుడినన్న తలంపు ఉంది. మనందరి దైవము ఒక్కరే అయినప్పుడు, ఆ ఒక్క దేవునిపేర పందల మతాలు ఎందుకు? దైవము ఒక్కరే కాబట్టి, మనందరి మతాభిప్రాయాలు ఆచరణలు ఒక్కటే యెందుకు కారాదు?

19) ప్రవక్తల కాలంనాటి సమాజాన్ని అర్థం చేసుకోవటానికి మత గ్రంథాలు ఉపకరిస్తాయి. వాటి ఉపయుక్తతను అంతవరకే పరిమితం చేసుకోవాలి. సరికాని మత సిద్ధాంతాలు, మత సూత్రాలు, మత నిర్ణయాలు, సంఘర్షణను రగిలిస్తాయి. దీనిచే సంఘర్షణాయుతమైన సమాజము, సంఘర్షణాయుతమైన జీవితము నెలకొని ఉంటుంది.

20) ఎవరికయినా కావలసింది, ఎవరయినా కోరుకోవలసింది మతాలు కావు. పరిశోధనాంశాల ఆధారంగా సమాజాన్ని జీవితాన్ని నిర్వహించుకోవటం చేతనవ్వాలి. గతచరిత్ర, వర్తమాన చరిత్ర గుణపాఠాలను గ్రహించి, ఇకనైనా మతాలకుకాక ధర్మానికి స్థానం ఇవ్వాలి. సత్యాన్ని ధర్మాన్ని గుర్తించనందువల్లనే, మానవజాతి చిన్నాభిన్నమై పరస్పరం శత్రుత్వం వహించి కడగండ్ల పాలయ్యింది.

మతాల పరిధిని కల్గిఉండటం శ్రేయస్కరం. ప్రజలు ఎవరైనా ఈ కొద్ది మతాలకు చెందినవారవుతారు. ప్రధానమతాలకు చెందిన వారిని మతాంతరీకరణ ప్రభావంలోకి నెట్టకుండా, దీనికి సంబంధించిన సమస్యలు తలెత్తకుండా, మతాంతరీకరణను నిషేదిస్తే, ఎవరి మతం వారికి వారసత్వంగా ఉంటుంది.

24) మతం కేవలం దైవవిశ్వాసానికి సంబంధించినది కాకుండా,మానవ ప్రవర్తనను నియంత్రించేది కాగలగాలి. వివిధ విషయాలపై అవగాహనను పెంపొందిస్తూ, మానవత్వపు దిశగా కొనిపో కలిగే దవ్వాలి. ఈ లక్ష్యాన్ని నెరవేర్చే శక్తిగలట్టి మతగ్రంథమైతేనే, ఆ లక్ష్యం నెరవేరుతుంది. ఈనాటి శాస్త్రవిజ్ఞానంతో ప్రజల సందేహాలకు, సవ్యమైన సమాధానాలు ఇవ్వగలం. వివాదాలకు అపోహలకు తావులేనట్టి శాస్త్రీయ భావనలను, ప్రజలకు అందించగలం. ఎలాంటి పరీక్షలకయినా సిద్ధపడిన భావోత్పత్తిని అందించగలం. ఇట్టి విషయ వివరణలవల్ల, మత ప్రచారకులు చక్కని భోధనలు చేయగలరు. సమాధానాలను సూటిగా ఇస్తూ, ప్రజలలో శాస్త్రీయ అవగాహనను పెంపొందింప గల్గటంచే, ప్రపంచ వ్యాప్తంగా అజ్ఞానం తొలగుతుంది. కట్టుకధలతో కల్పనలతో అసత్య ప్రచారాన్ని చేయాల్సింది ఉండదు. అంతేగాక మతంయొక్క స్థానాన్ని స్థిరం చేయవచ్చు. ఇట్టి స్థితిని అంగీకరించక గతకాలంనాటి మత గ్రందాలను కొనసాగించుకుంటే, మతంపై మతగ్రంధాలపై విశ్వాసాన్ని కోల్పోవటంతోబాటు, వ్యతిరిక్తత పెరుగుతుంది. మతంవేరు శాస్త్రవిజ్ఞానం వేరు కాకూడదు. మతం అంటే జ్ఞానము. జ్ఞానము అంటే మతం. ఈ స్థితికి కొనిపో గలది ఆధునిక మతగ్రంధం. దీనినే రెండవభాగం అంటున్నాను. ఇది జరిగినపుడు మానవ మస్తిష్కం మతాన్ని మతగ్రంధాన్ని మనఃస్ఫూర్తిగా అంగీకరిస్తుంది. అప్పుడు అది దైవగ్రంధంగా నిలుస్తుంది.

